

# విఘ్నేశ్వరుడు

సత్యలోకంలో కమలాసనం మీద కూర్చుని, పగలంతా సృష్టి చేసి, చేసి అలసిన బ్రహ్మకు, కల్పాంతం సమీపించటంతో నిద్రమత్తు ఆవరించింది. ఆ నిద్రమత్తులో ఆయన ఆవులించినప్పుడల్లా పర్వతశిఖరాగ్రాలు చిట్లి, అగ్నులను వెదజల్లాయి. నిద్రపట్టే సమయాన కళ్ళు చెమ్మగిల్లగా, ఆకాశంలో గుంపులు, గుంపులుగా కూడిన ప్రళయమేఘాలు మెరుపులతో, భయంకరంగా గర్జిస్తూ, ఏనుగు తొండాల వంటి ధారలతో వర్షించి, లోకాన్ని జలమయం చేశాయి. ఆయన కనురెప్పలు బరువుగా వాలడం ప్రారంభించే సరికి అన్ని దిక్కులా గాఢాంధకారం అలుముకున్నది.

ఈ ప్రళయ పరిస్థితిలో బ్రహ్మ నిద్రించాడు, ఆయనకు ప్రళయమనేది రాత్రి కాలం. తిరిగి నూతన కల్పారంభం కానున్న సమయం ఆసన్నమైంది. సరికొత్త జగత్తు మీద వెలుగు ప్రసరించబోతున్న తరుణంలో సరస్వతీదేవి వీణ సవరించి భూపాలరాగ స్వరాలను మెల్లగా పలికిస్తూండగా బ్రహ్మకు మెలకువ వచ్చింది.

ఆయన పద్మాసనం వేసి కూర్చుని, నాలుగు ముఖాలతో, నాలుగు దిక్కులూ కలయచూశాడు.

కిందవున్న జగత్తు అంతా నీటిమయమై మహా పర్వతాల్లాంటి కెరటాలతో కల్లోలంగా ఉంది. ఆ తరంగాల మధ్య ఒక

1. వటపత్ర బాలగణపతి



చోట కళ్ళను మిరుమిట్లుకొల్పే తెల్లని కాంతిరేఖ కనిపించింది.

ఆ కాంతిలో తరంగాలపై తేలుతూ ఒక పెద్ద మర్రిఆకు, దానిపై చందమామ లాంటి పసివాడు పడుకొని కుడి కాలి బొటనవేలు చప్పరిస్తూ కనిపించాడు.

బ్రహ్మ చేతులు జోడించి, కన్నులు మూసి ధ్యానించి తెరిచినంతలో ఒక వింత దృశ్యం కనిపించింది.

ఆ పసివాడు విశ్వవిరాట్ స్వరూపుడైన పరబ్రహ్మమేనని బ్రహ్మకు అనుభవ పూర్వకంగా తెలిసిన విషయమే. కాని ఇప్పుడా పిల్లవాని తల ఏనుగు తలను పోలి, చిన్నారి తొండంతో కుడిపాదాన్ని పట్టి నోటిలో పెట్టుతూన్నట్టుగా కనిపించింది.

ఆ ముఖం చాలా ప్రసన్నంగా ఉంది. పిల్లవాడు చంద్రకాంతితో ప్రకాశిస్తున్నాడు. నాలుగు చేతులు కలిగిఉన్నాడు. బ్రహ్మ ఆశ్చర్యంగా చూస్తున్న మరు నిముషంలో, ఆకుతో సహా ఆ పిల్లవాడు అదృశ్యమయ్యాడు. బ్రహ్మకు ఆ ప్రదేశాన ఎత్తుగా లేచిన పెద్ద మట్టిదిబ్బ ఒకటి కనిపించింది.

క్రమక్రమంగా నీటి నుండి సువిశాలమైన భూభాగాలూ, సముద్ర భాగాలూ ఏర్పడ్డాయి.

బ్రహ్మ సృష్టికి పూనుకున్నాడు. మొదట పర్వతాలు, నదులు ఏర్పడాలని సంకల్పించి కమండలం లోంచి నీరు తీసి జగత్తుమీద చల్లాడు. తరవాత వృక్షాలనూ, సస్యాలనూ, ఖనిజాలనూ సంకల్పించాడు. పిమ్మట కదులాడే జీవరాశిని—మొదట సముద్రంలో చేపలనూ, భూమ్మీద జంతుజాలాన్నీ, క్రిమికీటకాదుల్నీ, పక్షుల్నీ సృజించాడు. తరవాత మనుష్యులను సంకల్పించి కమండలోదకాన్ని చిలికాడు.

బ్రహ్మ సృష్టి చేస్తున్నంతసేపూ సరస్వతీదేవి వీణ వాయిస్తూనే ఉన్నది. ఎందువలనో అనుకోని విధంగా వీణ

అపశృతి పలికింది. సరస్వతి నివ్వెర పడుతూ కిందకు చూసి మరింత నివ్వెర పడింది. బ్రహ్మ అర్ధాంగి నివ్వెరపాటు అర్థంగాక కమలాసనం నుంచి వంగి కిందికి చూశాడు.

పర్వతాలు బోర్లపడుతూ శిఖరాలు భూమిలోకి పాతుకుని వెడల్పుగా పర్వత పాదాలు సూర్యరశ్మి పడకుండా గొడుగు ల్లాగా ఎదుగుతూన్నవి.

నదులు సాగరం నుంచి ఎత్తుప్రదే శాలకు చేరుకోబోతున్నవి. వృక్షాలు తల కిందులుగా, వ్రేళ్ళు ఆకాశానికి తన్ను తున్నవి.

సముద్రతరంగాల మీద జలచరాలు తేలుతూ కుప్పిగంతులు వేస్తున్నవి. కొన్ని నిటారుగా పయనిస్తున్నవి. కొన్ని పక్షుల్లా ఎగురుతున్నవి.

జంతువులూ చాలా అనర్థాలతో పుట్టాయి; తలలు లేకుండా కొన్ని, వెనుక కాళ్ళు లేకుండా కొన్ని, ఒంటికాలివి, మూడుకాళ్ళవీ, కళ్ళూ, చెవులూ అన్నీ వుండి నోరు అనేది లేనివీ, తోకలకు తలలున్నవీ, తలకు తోకలున్నవీ కని పించాయి. పక్షులకు రెక్కలులేవు. అవి నడవాలంటే కాళ్ళులేక నేల మీద దొర్లుకుంటున్నవి.

ఈ వక్రతలన్నీ గమనించి బ్రహ్మ ఎంతగానో కలవరపడుతూ తన ఉత్త మోత్తమ మనుష్య సృష్టి ఎలాగుందోనని ఆత్రంగా చూశాడు.





ఒక జానెడు మగవాడు తాటిచెట్టంత వికృతాకారిణి అయిన స్త్రీని చూపిస్తూ, "ఓ బ్రహ్మదేవుడా! ఇలాంటి స్త్రీతో నే నెలా సంసార సాగరం యీదేది?" అంటూ ఆకాశానికి తలపెట్టి పెద్దగా అరుస్తున్నాడు.

"నాలుగు తలలంటూ ఉన్నా, అసలు తల అంటూ లేని ఓయి బ్రహ్మదేవుడా! మమ్మల్నెందుకిలాగ పుట్టించావు?" అంటూ వికృతాకారాల మనుషులు చేస్తూన్న ఆక్రందనాలు మిన్నుముట్టు తున్నవి.

మనుషులలో కొందరికి రెండు తలలున్నాయి. అందులో ఒకటి స్త్రీది, రెండోది పురుషుడిది.

పురుషులు జానెడు, బెత్తెడుగా ఉన్నారు. స్త్రీలు పెద్ద ఏనుగుల్లాగా, తాటి చెట్లలాగ ఉన్నారు. వీపులకు తలలు అతికించినట్లున్నవాళ్లు, నాలుగు, మూడు, ఒంటికాళ్ళ వాళ్ళూ, పొట్టకే పెద్దనోళ్ళున్న కబంధులూ ఆక్రందనాలు చేస్తూ కనిపించారు.

జంతువులు మోరలు పైకెత్తి దీనంగా అరుస్తున్నవి. మూగగా చూస్తున్నవి. బ్రహ్మను నిందిస్తూన్నట్లుగా గింజుకుంటున్నవి, కదను తొక్కుతున్నవి.

బ్రహ్మ నాలుగు తలలూ గిర్రున తిరిగి పోయాయి. ఎనిమిది కళ్ళూ బైర్లు కమ్మాయి. తెల్లబోతూ బ్రహ్మ సరస్వతి వంక అయోమయంగా చూశాడు. అతని నాలుగు తెల్లమొహాలనూ చూసి సరస్వతి సరసంగా చిరునవ్వుతో సరిపెట్టి ఊరుకొన్నది.

"ఎందుకిలా జరిగింది? సక్రమమైన సృష్టి జరపాలనే సత్సంకల్పంతోనే కదా నేను సృష్టికి పూనుకున్నాను; ఇలాగ ఎందుకు జరిగింది?" అని తనలోతాను అనుకుంటున్నట్లుగా గట్టిగా తలలుపైకెత్తి అరిచాడు బ్రహ్మ. అతని ప్రశ్న దశ దిశలా మారుమ్రోగింది. అయోమయంగా వెర్రిచూపులు చూస్తున్న బ్రహ్మకు పెద్ద

వెలుగు కనిపించింది. ఆ వెలుగులో ఒక అద్భుతమూర్తి కనిపించాడు. ఆ మూర్తికి ఏనుగు తల ఉన్నది. నాలుగు చేతులలో పాశము, అంకుశము, కలశము, పరశువు ధరించి ఉన్నాడు. పూర్ణచంద్రుడివలె ప్రకాశిస్తున్నాడు. తెల్లని అతని ఉత్తరీయము ఆకాశమంతటా రెపరెపలాడుతూ ఎగురుతున్నది. అప్పుడు సరస్వతి వీణ ఓంకారనాదం చేసింది. సరస్వతీదేవి వేళ్ళు వాటంతట అవే వీణపై నాదనామక్రియా రాగాన్ని పలికిస్తూ, మాయామాళవగౌళరాగానికి మారుతూ, హంసధ్వని రాగాన్ని అందుకొన్నవి. గజాననుడై సాక్షాత్కరించిన ఆ దివ్యమూర్తి వటపత్రంపై నిలుచుని బ్రహ్మను అభయముద్రతో ఆశీర్వదించాడు. అతని చుట్టూరా శరత్కాల పూర్ణిమనాటి వెన్నెల వంటి వెలుగు ఆవరించి ఉన్నది.



బ్రహ్మ అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కరిస్తూ, "మహానుభావా! అద్భుత మూర్తివైన నీ వెవ్వడవు? నీవెవరో తెలుసుకోలేని అజ్ఞానిని, అనుగ్రహించు!" అని అడిగాడు.

"నాయనా! బ్రహ్మదేవా! సంకల్పం వెనుకనే వికల్పం వెంటాడుతూంటుంది; అదే విఘ్నం! విఘ్నాన్ని అరికట్టి సంకల్పాన్ని నెరవేర్చే నేను విఘ్నేశ్వరుడను! విఘ్నాలకు నాయకత్వం వహించే వికల్పాన్ని నా గొడ్డలితో ఛేదించి ప్రతి కార్యాన్నీ నిండుకలశం లాగ జయప్రదం చేసే విఘ్నవినాయకుడిని. పంచభూతములనబడే పృథ్వి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశములనే భూతగణానికి అధిపతినైన గణపతిని. ఆహార ధాన్యాల్ని ఫలించే సస్యాల్ని నాశనం చేసే మదించిన ఏనుగుల వంటి విఘ్నాలను నా వాడిగల అంకుశంతో అదుపులో పెడుతూ వాటిని నా పాశము అనే బలమైన త్రాటితో కట్టి ఉంచే నన్ను, విఘ్నేశ్వరుడు అని పిలువు!" అని గంభీర స్వరంతో విఘ్నేశ్వరుడు పలికాడు.



అప్పుడు బ్రహ్మ, "దేవా! విఘ్నేశ్వరా! నా సృజనశక్తికి ఎందుకిలాగ ఘోరమైన విఘ్నం జరిగింది? ఇన్ని వంకరలెందుకు ఏర్పడ్డాయి? ఉత్తమంగా సృష్టిజరిగే మార్గం వివరంగా చెప్పు!" అన్నాడు.

"విఘ్నం గురించి నీకు తెలియాలనే ఇదంతా జరిగింది. మర్రిఆకుపై బాల గణపతిగా కనిపించిన వటపత్రగణపతినే నేను. అప్పుడు నా గురించి ఆలోచించలేకపోయావు; నా గురించి ఆలోచించడమంటే విఘ్నం గురించి ముందు జాగ్రత్త పడే జ్ఞానాన్ని కలిగిఉండటమే! ఆ జ్ఞాన స్వరూపుణ్ణే నేను! బ్రహ్మ మొదలు కొని బుద్ధిగల ప్రతి జీవీ కార్యరంగానికి దిగే ముందు విఘ్నం రాకుండా జయప్రదం కావడానికి తగు జాగ్రత్తనూ, జ్ఞానాన్నీ కలిగి ఉండక తప్పదు! ఏనుగు అడుగు వేసే ముందు నేల గట్టితనాన్ని తెలుసుకొని మరీ నడుస్తుంది; ప్రాణుల్లో ఏనుగు బుద్ధిబలం దాని లాగే చాలా పెద్దది. ఏనుగంత విశేష మేధస్సును కలిగి ఉండాలనే సూచనగా నేను గజాననుడిగా ఉన్నాను. నీవు నిద్రిస్తూన్న సమయంలో రాక్షసుడైన సోమకాసురుడు నీ నాలుగు వేదాల్ని అపహరించి సముద్రం అడుగున దాచాడు; మహావిష్ణువు మత్స్యావతారం దాల్చి వాణ్ణి సంహరించి నీ వేదాల్ని భద్రంచా తెచ్చి వటపత్రశాయినై ఉన్న నా దగ్గర ఉంచాడు. ఇవిగో! వాటిని తిరుగ గ్రహించి సృష్టి నిర్వర్తించు!" అని చెప్పి, విఘ్నేశ్వరుడు బ్రహ్మకు వేదాలను ఇచ్చాడు.

బ్రహ్మ వాటిని అందుకొని పరమానందంతో విఘ్నేశ్వరుణ్ణి స్తుతించుతూ, "విఘ్నేశ్వరా! నేను సృష్టి సంకల్పించే ముందు నిన్ను ధ్యానించి, మనసారా నిన్ను పూజించి మరీ కార్యరంగానికి ఉపక్రమించే వరం అనుగ్రహించు! అవకతవకలుగా తయారైన సృష్టి ఉపసంహరించుకొనేలాగ చెయ్యి!" అని కోరాడు.

విఘ్నేశ్వరుడి ప్రభావం వల్ల అంత వరకు జరిగిన వంకర టింకరల సృష్టి అంతా క్షణంలో మటుమాయమైంది. అప్పుడు విఘ్నేశ్వరుడు మళ్ళీ బ్రహ్మతో, "ఓ బ్రహ్మదేవుడా! వక్రతను తుండ తుండములుగా ముక్కలు చేసే వాడిని గనుక నేను వక్రతుండుడు అనే పేరుకు సార్ధకంగా నా తొండాన్ని వక్రంగా ఉంచుతూంటాను. వక్రతుండుణ్ణి అయిన నన్ను ధ్యానించి తలపెట్టిన ఏ పని కూడా వంకర పోదు! నీవు కోరుకున్నట్లే నన్ను ధ్యానించి సృజించు. సృజించటం ఒక కళ! ఆ కళ ఎటువంటి వంకరటింకరలు పోకుండా జగత్తు నీవు మలచిన కళా నిలయంగా భాసిస్తుంది! నీకు మల్లే జగత్తులో అందరికీ అందుబాటుగా తొలి పూజలందుకొనే విఘ్నేశ్వరుడిగా విఘ్నాల నుండి కాపాడుతూ, సంకల్పసిద్ధిని కలిగించే సిద్ధివినాయకుడుగా, సకల గణాలకూ అధిపతిగా గణపతినై శివ పార్వతులకు కొడుకుగా అవతరిస్తాను!" అని చెప్పి, బ్రహ్మను దీవించి అంతర్ధానమయ్యాడు.

సరస్వతీదేవి బ్రహ్మ కేసి చిరునవ్వు నవ్వి హిందోళ, శ్రీరాగాలతో మంగళ స్వరాల్ని మహాకాశం పులకరించేట్లుగా వీణపై వినిపించింది.

బ్రహ్మ, "విఘ్నేశ్వరాయనమః!" అంటూ సృష్టిని ప్రారంభించాడు. సృష్టి మరింత అందంగా నిర్విఘ్నంగా సాగింది. గంభీరమైన పర్వత పంక్తులూ, అమృతజలాలతో నదులూ, సుందర వనాలూ, రంగు, రంగుల బొమ్మల్లాంటి జంతుజాలమూ, శారీరకంగానూ, మానసికంగానూ ఉన్నతులూ, బలవంతులూ అయిన మనుషులతో జగత్తు బ్రహ్మచేసిన కళానిలయంగా విలసిల్లింది. వాగ్దేవి అయిన సరస్వతి తన వాణిని సంగీతంలా ప్రాణికోటికి స్వరపరిచింది. జీవకోటి సలక్షణంగా పెరిగింది.

ఊడలు చిమ్మే వటవృక్షంలాగ జగత్తు వర్ధిల్లింది.





# విఘ్నేశ్వరుడు

దేవతలూ, రాక్షసులూ కలిసికట్టుగా క్షీర సాగరమధనం చేసి అమృతాన్ని సాధించారు. విష్ణువు జగన్మోహినీ రూపంతో రాక్షసులను మోసపుచ్చి అమృతాన్ని దేవతలపాలు చేశాడు. అమృతం తాగి అమరత్వం పొందిన దేవతలు గర్వంగా తిరగసాగారు. దానవులకు జరిగిన అన్యాయానికి దేవతలపై కసితీర్చుకోడానికి తారకాసురుడు ఘోరమైన తపస్సు చేసి, బ్రహ్మను మెప్పించి, చావులేనివరం కోరాడు.

''పుట్టాక ఎప్పుడో ఒకప్పుడు చావు తప్పనిది; మరోవరం కోరు!'' అన్నాడు బ్రహ్మ.

తారకాసురుడు బాగా ఆలోచించి శివుడి కుమారుడి వల్లనే తప్ప మరే విధంగానూ తనకు చావులేని వరాన్ని బ్రహ్మ నుంచి పొందాడు.

అప్పటికి శివుడి భార్య సతీదేవి దక్షయజ్ఞంలో యోగాగ్నితో తనువు చాలించింది. సంతానం లేకుండానే సతీ వియోగం పొందిన శివుడు ఉన్మత్తుడిలాగ తిరిగి, తిరిగి హిమాలయ పర్వతాల్లో ఒక చోట విరాగిగా కఠోర దీక్షతో తపస్సు చేస్తూ ఉన్నాడు.

తారకాసురుడు రాక్షసులందర్నీ కూడగట్టుకొని విజృంభించాడు. ముల్లోకాలనూ ఆక్రమించుకొని, కసితీరా దేవతలను చిత్రహింసలు పెట్టసాగాడు. ఇంద్రాది దేవతలు తమ దీనావస్థను బ్రహ్మతో మొరపెట్టుకున్నారు.

2. చిత్రగణపతి



''శివుడికి కుమారుడు పుట్టాలి, అతని వల్లనే తారకుడు చావాలి! అలాంటి వరాన్ని తారకుడికి ఇచ్చాను మరి. ఇంకె వరివల్లా తారకాసురుడికి ఎటువంటి హానీ జరగదు, మరో విధంగా అతడికి చావూ లేదు!'' అని బ్రహ్మ చెప్పి దేవతలను వెంట బెట్టుకొని తరుణోపాయానికి విష్ణువు దగ్గిరికి దారితీశాడు.

''సతీదేవి హిమవంతుడికి కూతురుగా పుట్టి పార్వతిగా పెరుగుతూ ఉన్నది. శివుడికీ, పార్వతికీ పెళ్ళి జరిగేలా చూడండి!'' అని విష్ణువు చెప్పాడు. దేవతలు నారదుణ్ణి హిమవంతుడి దగ్గిరికి పంపించారు. నారదుడి ఆదేశం ప్రకారం హిమవంతుడు తపస్సులో నిమగ్నుడై ఉన్న శివుడి దగ్గరికి వెళ్ళి, పూజించి తన కుమార్తె పార్వతి అతని తపస్సుకు అనుకూలంగా పరిచర్యలు చేస్తూండ డానికి అనుమతించవలసిందని వినయ పూర్వకంగా కోరాడు.

శివుడి మౌనాన్ని అంగీకారంగా గ్రహించి హిమవంతుడు పార్వతిని శివుడికి పరిచర్యలు చేయడానికి పురమాయించాడు.

చిన్నతనం నుంచీ పార్వతికి శివుడంటే చాలా యిష్టం. బాల పార్వతికి నారదుడు శివుడి గురించి అనేక విషయాలు చెపుతూండేవాడు. శివుడి కథలనూ, గుణ గణాలనూ, మహిమలనూ పదేపదే విన డానికి కుతూహల పడుతూ ఉండేది పార్వతి. పెళ్లాడితే శివుణ్ణే పెళ్ళాడాలని ఉవ్విళ్లూరేది. అటువంటి శివుడికి పరిచర్యలు చేయడం తరుణప్రాయంలో ఉన్న పార్వతికి మహాభాగ్యంగా తోచింది.

తెల్లవారుతూండగా శివుడు తపస్సు చేస్తున్న పరిసర ప్రాంగణ మంతా నెమిలి పింఛపుకట్టతో తుడిచి, హిమానీ జలాల్లో మంచిగంధం కలిపి కల్లాపుజల్లి, ముత్యాల ముగ్గులు తీర్చేది. బంగారు తీగెలతో అల్లి, రత్నాలు కెంపులు పొదిగిన తట్టతో శివుడికి యిష్టమైన ఫలపుష్పాలను, మారేడు

పత్రిని, తెల్ల కలువలనూ తీసుకెళ్ళి పక్క నుంచేది. బంగారు కమండలువు నిండా హిమశిఖరాల నుండి జారే స్ఫటిక జలాలను నింపి, జపమాలతో కలిపి అమర్చిపెట్టేది. శివుణ్ణి ఆకర్షించడానికి ఎన్నో విధాలుగా అలంకరించుకొని వెళ్ళేది. కిన్నెరపై శివుడికి ప్రీతికరమైన భైరవి, ముఖారి, కేదార, శివరంజని మొదలైన రాగాల్ని ఆలాపించేది. శివుడి చూపులు తనపై పడాలని పదేపదే ప్రయత్నిస్తూండేది.



తపోదీక్షలో నిమగ్నుడై శివుడు ఒక్కసారైనా తనను పరికించగలడేమోనని, అతని చల్లని చూపులు తనపై వాలాలని పార్వతి శివుడి ముఖాన్ని అలా చూస్తూ ఉండిపోయేది. శివుడు పొరపాటుగానైనా తనవంక చూడడేమో అని నిరాశా, నిస్పృహలతో ఊగిసలాడేది.

శివుడి మనస్సు చలించడానికి మన్మధుడి అవసరం తప్పనిసరి అని గుర్తించి, దేవేంద్రుడు మన్మధుణ్ణి పిలిపించాడు. సకలమర్యాదలు చేసి తన సింహాసనం మీద కూర్చోబెట్టి ఎన్నోవిధాలుగా పొగిడి పొంగవేశాడు, శివుడికి పార్వతిపై అనురాగం కలిగేలా చేయమని అర్థించాడు.

వసంతుడు సారధ్యం చేస్తూండగా మన్మధుడు చెరకు వింటినీ, పూలబాణాలనూ ధరించి రతీదేవితో చిలుకరథాన్నెక్కి, ఈశ్వరుడు తపస్సు చేస్తూన్న హిమాలయ శిఖరాల నడుమనున్న లోయను ప్రవేశించాడు. ఒక్కసారిగా ఆలోయ అంతటా వసంతఋతువు వెల్లివిరిసింది, రమణీయంగా మారింది. కోయిలల సంగీతంతో, తుమ్మెదల ఝుంకారంతో అంతా రసమయంగా వెలిగిపోయింది. తానున్న పరిసరమంతా ఆకస్మికంగా మారిపోయినట్లుగా తోచి, శివుడు కళ్ళు తెరిచి చూశాడు. అకాల వసంతాగమనానికి ఆశ్చర్యపోతూ, తపోభంగమైనందుకు నొచ్చుకుంటూండగా అతని చేతినుంచి జపమాల జారిపడింది. పార్వతి



జపమాలను తీసి శివుడికి అందిస్తున్న సమయంలో మన్మథుడు విరియబూచిన నల్లఉమ్మెత్త పూలపొద చాటునుంచి నీలోత్పల బాణాన్ని శివుడి గుండెకు గురి పెట్టి వదిలాడు. అది తగలగానే శివుడు తృళ్లిపడి తేరిపార జూచాడు. అతని ముంగల మోకరిల్లి రెప్పవాల్చకుండా తననే చూస్తున్న పార్వతి ముఖబింబం ఎంతో మనోహరంగా కనిపించింది.

తన తపోభంగానికి శివుడు నివ్వెర పడుతూ రుద్రుడై తన మూడవ కంటిని తెరిచి మన్మథుడిని చూశాడు. మరు క్షణంలో శివుడి ఫాలనేత్రం నుంచి వెలు వడిన జ్వాలల్లో మన్మథుడు కాలిబూడిద అయ్యాడు. శివుడు దిగ్గునలేచి చరచరా తన కైలాస శిఖరాగ్రం మీదికి వెళ్ళి పోయాడు.

మన్మథుడి వెన్నంటి ఉన్న రతీదేవి భర్త బూడిద కుప్పమీద కూలిపోయి భోరుమన్నది. శివ తపోభంగానికి మన్మ ధుణ్ణి పంపిన దేవేంద్రాది దేవతలను శాపాలుపెట్ట బోయేసరికి, బ్రహ్మాది దేవ తలు వచ్చి పార్వతీ శివుల కళ్యాణం జరిగి నప్పుడు మన్మథుడు తిరిగి బతికి వస్తాడని నచ్చజెప్పి, ఓదార్చి సహగమనం మాని పించారు. రతీదేవి మన్మథుడి బూడిద కుప్పనే కనిపెట్టుకొని అలా దివారాత్రాలు గడపసాగింది.

పార్వతికి తన సౌందర్యం పట్ల నమ్మకం పోయింది. శరీర లావణ్యం మీద మమకారం పోయింది. శివుణ్ణి రంజింప చేయలేని తన తనువు నిరర్థకంగా తలచి శివరంజనిగా తపస్సు చేయడానికి పూను కున్నది. తల్లి మేనక ఎంతవద్దన్నా విన లేదు. కేవలం కొద్ది ఆకులను మాత్రమే తింటూ శరీరాన్ని కృశింప జేసుకొని తపస్సు మొదలుపెట్టింది. జయ, విజయ అనే ఇద్దరు చెలికత్తెలు ఆమెకు తోడుగా ఉంటూ ఆమె యోగక్షేమాల్ని మేనకా, హిమవంతులకు తెలియజేస్తూ వస్తున్నారు. కొన్నాళ్ళ తర్వాత పార్వతి పర్ణాలను

కూడా తినడం మానివేసి నిరాహారంగా తపస్సు చేస్తూ, అపర్ణ అని పేరు పొందింది.

శివుడు మన్మథుణ్ణి భస్మం చేశాడేగాని, మన్మథుడి బాణప్రభావం ఊరికేపోలేదు. పార్వతి తపస్సు కూడా ఫలితం సాధించింది. శివుడు మారువేషంతో పార్వతి దగ్గరకు వెళ్ళి, పార్వతి మనస్సును పరీక్షించాడు. పార్వతిని మనసారా మెచ్చుకొని పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు. సప్త ఋషులను హిమవంతుడి దగ్గరకు పెళ్ళిపెద్దలుగా పంపించాడు. శివుడంతటి వాడికి కన్యాదాత కాబోతున్నందుకు ఉన్నతోన్నతంగా శిఖరాలు పెంచుకున్నాడు హిమవంతుడు. ఋషులు ముహూర్తం పెట్టి వెళ్ళారు.

ప్రమథగణాలు ముందు నడవగా శివుడు పెళ్ళికుమారుడై హిమవంతుడింటికి తరలివెళ్లాడు. హిమాలయ శిఖరాలు పెళ్లిపందిరికి రాటలైనాయి. విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుడు మొదలుగాగల దేవతలు, సప్తర్షుల వెంట వేలాదిమహర్షులు, నారదాది మునిపుంగవులు అక్కడకు చేరుకున్నారు.

పెద్ద ముత్తైదువు అరుంధతి శివుడి ఫాలనేత్రం రెప్పమీదుగా కళ్యాణ తిలకం నిలువుగా దిద్దింది. పెళ్ళి అలంకరణతో



శివుడు చాలా సుందరంగా తయారయ్యాడు. అప్పుడు అందరూ శివుణ్ణి— సుందరేశ్వరుడు అని అన్నారు.

సర్వాలంకార శోభితయై విద్యుల్లతలాగ మెరిసిపోతూన్న పార్వతిని పెళ్ళికూతురుగా తీసుకొచ్చి విష్ణువు శివుడితో, "నీవు సుందరేశ్వరుడివి అయితే, నాచెల్లెలు పార్వతి మీనాక్షి దేవి!" అని అంటూ పార్వతి కుడిచేతిని శివుడి కుడి చేతిలో పెట్టి యిద్దర్నీ పెళ్ళి పీటలమీద కూర్చోబెట్టాడు.

శివ పార్వతుల వివాహం ఎంత వైభవంగా జరగాలో అంత వైభవంగా జరిగింది.



హిమాలయలోయలో శివుడు, పార్వతి తపస్సులు చేసిన చోటనే దేవశిల్పి విశ్వకర్మ కొత్త దంపతులైన పార్వతీ పరమేశ్వరుల కోసం దివ్యమైన అంతఃపుర మందిరాన్ని నిర్మించాడు.

మంగళ తూర్యనాదాలు మిన్నంటుతూండగా చేతులు కలుపుకొని శివుడు, పార్వతి అందరిమధ్య నడుస్తూ మందిరానికి బయలుదేరారు. మందిరాన్ని చేరుకునే దారిలోనే మన్మధుడి భస్మరాశి ఉన్నది. ఆ బూడిదకుప్పను అంటిపెట్టుకొని రతీదేవి కన్నీళ్ళతో మోకరిల్లి దోసిలిపట్టి పతిభిక్ష అడుగుతున్న దానిలాగ ఉన్నది.

శివ పార్వతులు ఆమె దగ్గరకు వెళ్ళి, ఆమెతలపై చేతులుంచి దీర్ఘసుమంగళిగా ఉండు అని దీవించారు. శివుడు మళ్ళీ తన మూడోకంటినే తెరిచి యీసారి చల్లని వెన్నెల కాంతితో చూడగానే భస్మరాసి మాయమై మన్మధుడు నిజరూపంతో లేచి అందరికీ కనిపించి, చెరుకువింటి నారిని ఝుమ్మనిపించి అదృశ్యమైయ్యాడు.

అప్పుడు శివుడు రతీదేవితో, ''అమ్మా! నీ భర్త తిరిగి జీవించాడు. నీకు ఎప్పటిలాగే సదా కనబడుతూనే ఉంటాడు. నీ రెండు కళ్ళకు తప్ప మరే మూడో కంటికీ కనిపించడు. ఎవ్వరూ అతణ్ణి చూడలేరు గనుక అతణ్ణి ఎవ్వరూ ఏమీ చేయలేరు. అతని బాణాల బారినుండి తప్పించుకోలేరు. నీకు తప్ప యితరులకు కనిపించడం అతని యిష్టంపైనే ఉంటుంది. అలాంటి వరాల్ని అతనికి ఇస్తున్నాను!'' అని చెప్పాడు.

పార్వతీ శివులు గృహప్రవేశం చేశారు. కనిపించని మన్మధుడు కూడా కనిపించని పూలబాణాలతో రతీదేవితో మందిరంలోకి వెళ్ళాడు. అరుంధతి నూతన దంపతులకు ఎర్రనీటితో దిష్టి తీసి, కర్పూరహారతి పట్టింది. అప్పుడు విశ్వకర్మ తెరతో నిండా కప్పబడి ఉన్న ఒక నిలువెత్తు పలకను పార్వతీ శివుల ఎదురుగా నిలబెట్టి, ''ఇది

ఒక గొప్ప అపురూప చిత్రపటము. ఈ చిత్రంలో ఇద్దరు చిత్రింపబడి ఉన్నారు. ఆ ఇద్దరిలో ఎవరి సౌందర్యం ఎక్కువ గొప్పదో మా బోటివారికి ఎవ్వరికీ చెప్ప శక్యంకాలేదు! అది చెప్పగలవారు మీ రిద్దరే నన్న నమ్మకంతో మీ ముందు పెడుతున్నాను, చెప్పండి!'' అని తెరను తొలగించాడు.

అది ఒక నిలువుటద్దం! అద్దంలో శివుడు పార్వతి తమ ప్రతిబింబాలను చూసి ముసిముసిగా నవ్వుకున్నారు.

''ముసిముసినవ్వులు సమాధానాలు కావు, చెప్పితీరాలి!'' అన్నాడు నారదుడు.

శివుడు చిరునవ్వుతో పార్వతిని క్రీగంట చూస్తూ, ''ధగధగా శుక్రుని లాగ మెరుస్తూన్న ముక్కర గల చిత్రాంగి సౌందర్యమే గొప్పది!'' అన్న వెంటనే పార్వతి సిగ్గుతో ఎర్రబడ్డ చెక్కిళ్ళతో, ''ఆ ముక్కంటి పురుషుడి సౌందర్యమే సృష్టిలో గొప్పది,'' అని వీణ మీటినట్లు పలికింది.

అందరూ శివపార్వతులపై పుష్పాక్షతలు చల్లి వెళ్ళిన తర్వాత కొత్త దంపతులిద్దరూ పట్టుదిళ్ళు అమర్చిన తూగుటుయ్యలపై కూర్చున్నారు.

వారి కెదురుగా విశాలమైన గోడ మీద మనోహరమైన పెద్ద చిత్తరువు చిత్రింపబడి



ఉన్నది. చిత్రం మధ్యలో అందమైన ఒక ఏనుగుల జంట నాట్యం చేస్తున్నట్లుగా ముందరికాళ్ళు ఎత్తి ఎదురెదురుగా ఎత్తిన తొండాలను పెనవేసుకొని ఉన్నవి. తోరణం కట్టినట్టు ఉన్న ఆ రెండు ఏనుగుల మధ్యనుంచి కనిపిస్తున్న సరోవరంలో పెద్ద పద్మము వికసిస్తూ ఉన్నది. ఆ చిత్రంలో చిత్రింపబడిన ఏనుగుల జంటపై శివ పార్వతుల చూపులు నిలిచాయి. అంతలో పద్మ చిత్రమున్నచోట వెన్నెల వంటి జ్యోతివెలిగింది. ఆ వెలుగు క్రమక్రమంగా పెద్దదై వ్యాపించింది. ఆ వెలుగులో శశివర్ణంతో మెరిసిపోతూన్న విఘ్నేశ్వరుడు వారికి కనిపించాడు.

విఘ్నేశ్వరుడి ముఖము ఏనుగు ముఖమే అయినప్పటికీ, ఆ ముఖంలో దివ్యత్వం నిండి ఉన్నది. ప్రసన్నత వెల్లి విరుస్తూన్నది. అతని చూపులు శాంతంగా మేధస్సునూ, శక్తినీ చాటుతున్నాయి. అతని దోరపుబొజ్జ నిండుగా తళతళలాడు తున్నది. అభయహస్తంతో నిల్చొని ఉన్న విఘ్నేశ్వరుడు పార్వతికి ముద్దులమూట లాగ కనిపించాడు.

విఘ్నేశ్వరుడిని చూస్తూంటే శివుడికీ, పార్వతికీ ఎన్నడూ ఎరగని అనిర్వచనీయ మైన ఆనందమేదో తమలో ఉప్పొంగు తూన్నట్లు అనిపించింది. ఆ ఆనందపార వశ్యంలో నోటమాటరాక విఘ్నేశ్వరుణ్ణి రెప్పవాల్చకుండా చూస్తున్నారు. విఘ్నే శ్వరుడు ఎడమపక్కకు సొంపుగా వంపు పెట్టి ఉన్న చిన్నారి తొండాన్ని సవరించు కొని ఊపుతూ, ముద్దుముద్దు మాటలతో, "నేను విఘ్నేశ్వరుణ్ణి! విఘ్నాలను అరి కట్టే వినాయకుడిని! పంచభూతగణాలకు అధిపతిని! గణపతిని! చిత్రవిచిత్రమైన రూపం గల చిత్రగణపతిని! మీ ఇరువురి అనురాగ ఫలితంగా శివుడి తేజస్సుతో కుమారస్వామి పుట్టి తారకాసురుణ్ణి అంత మొందిస్తాడు. కుమారస్వామికి ముందుగా నేను అవతరించి మీకు పుత్రుడిగా ఉంటాను. పుత్రగణపతినై అవతరించ బోతున్నాను!" అని చెపుతూంటే పార్వతి అతణ్ణి అందుకొని ఎత్తు[illegible]వాలని చేతులు చాచింది. విఘ్నేశ్వరుడు వెలుగుతో సహా అంతర్ధానమయ్యాడు.

అంతవరకు తమకు కనిపించిందంతా కలా, నిజమా అని పార్వతీ, శివులు ఒక రొకరు ప్రశ్నార్థకంగా చూసుకొన్నారు. ఆ చూపుల కలయికలో అంతా మర్చి పోయారు. వారికి కనిపించిన అద్భుత మంతా మరుపుకొచ్చింది.

శివుడు, పార్వతి ఆ మందిరంలో ఆనందసముద్రంలో మునిగి సంసారం సాగిస్తున్నారు. ఆ సమయంలోనే జగత్తుకు కనీవినీ ఎరగని ఉపద్రవం ముంచు కొచ్చింది.





# విఘ్నేశ్వరుడు

తారకాసురుడి నిరంకుశత్వానికి తోడుగా, త్రిపురాసురు లనే ముగ్గురు రాక్షసులు తపస్సులు చేసి వరాలు పొంది ఆకాశంలో ఎగురుతూ తిరిగే మూడు పట్టణాలను నిర్మించుకొని, ముల్లోకాల మీద విరుచుకుపడ్డారు. మూడు పురాల మీద ఎగురుతూ అగ్నిగోళాల్ని కురిపిస్తూ, పట్టణాలనూ, పచ్చని పల్లెలనూ తగల బెడుతూ విధ్వంసకాండ సాగిస్తున్నారు. జగత్తు అట్టుడికిపోతున్నది. వారిని అంత మొందించగలవాడు శివుడొక్కడే అని తెలిసిన దేవతలు అంతా కలసివచ్చి, మందిర ప్రాంగణంలో హోరెత్తి ప్రార్ధనలు చేశారు. పెళ్లాడిన కొత్తలోనే ఏదో బెడద వచ్చిందని శివుడు విసవిసలాడినా, త్రిపురాసురులు చేస్తున్న మారణహోమం విన్నమీదట ఉద్రేకం పుట్టి మూలనున్న త్రిశూలాన్ని దుమ్ము దులిపి పట్టుకొని, తన అనుచరుల్ని, ప్రమథగణాలనూ వెంటబెట్టుకొని, త్రిపురాసురులను తుదముట్టించడానికి కదిలాడు.

అదేసమయంలో జడల ఏనుగుగా మారి లోకాన్ని భీభత్సంచేస్తూ, ఒక రాక్షసరాజు బయలుదేరాడు. ఏనుగు రూపం కారణంగా అతడికి గజాసురుడు అన్న పేరువచ్చింది. అతడు గొప్ప శివ భక్తుడు. శివుడి వల్ల తప్ప మరెవరివల్లా చావులేని వరం పొందాడు

"శివుణ్ణి నీ లోపలే ఉంచేసుకొంటే మరీ మంచిది గదా!" అని నారదుడు

3. పుత్రగణపతి



గజాసురుడి మేలు కోరుతున్న వాడిలాగా అతడితో చెప్పాడు. గజాసురుడు వెంటనే ఉగ్రమైన ఆరాధనతో శివుణ్ణి గూర్చి తపస్సు మొదలు పెట్టి శివుణ్ణి మెప్పించాడు. త్రిపురాసుర సంహారానికని బయలుదేరిన శివుడు గజాసురుడి కోరిక ప్రకారం గజాసురుడి గుండెలో లింగ రూపంతో ఉండిపోయాడు.

''శివుడు గజాసురుడి గుండెలో ఉండిపోతే త్రిపురాసుర సంహారం ఎలా జరుగుతుంది? నవ వధువు పార్వతి ముచ్చట తీరేదెలా? శివుడికీ, పార్వతికీ పుట్టవలసి ఉన్న వాడి వల్లనే కదా తారకాసురుడి అంతం జరగాలి?'' అని దేవతలు అంతా దిగులు ముఖాలు వేస్తూంటే నారదుడు, ''శివుడు ఉబ్బులింగడు కదా!'' అని ఉపాయం అందించాడు. దేవతలంతా గజాసురుడి ఎదట శివుణ్ణి పొగుడుతూ స్తోత్రపాఠాలు మొదలుపెట్టారు.

గజాసురుడు కూడా తన్మయుడై వారితో కలిసి శివభజన సాగించాడు. శివలింగం ఉబ్బి అలాఅలా పెరిగిపోతూ గజాసురుడిని చీల్చివేసింది. శివుడు ఇవతల పడ్డాడు. గజాసురుడు కన్నుమూస్తూ, ''నిన్ను నమ్ముకొంటే ఇలా చేశావేమిటి!'' అని శివుణ్ణి నిందించగా, ''గజా! శివ భక్తికి తార్కాణంగా కలకాలం నీ పేరు నిలిచేలాగ ఏనుగుతల నాకు సన్నిహితంగా ఉంటుంది. గజచర్మాన్ని కట్టుకుంటాను,'' అని శివుడు చెబుతూ గజాసురుడిని తనలోకి తీసుకొని కైవల్యాన్ని ప్రసాదించాడు.

శివుడు భూమిని రథంగా, సూర్య చంద్రుల్ని రథచక్రాలుగా, వేదాలు గుర్రాలుగా, బ్రహ్మసారథిగా, మేరు పర్వతాన్ని ధనుస్సుగా, విష్ణువును బాణంగా సమకూర్చుకొని, తన అనుచరులైన నందీ, శృంగీ, భృంగీ మొదలైన ప్రమథ గణాలను వెంట వేసుకొని, ముక్కోటి దేవతలు వారివారి దేవేరులతో సహా వెనుక రాగా, భయంకరులైన త్రిపురాసురులపై యుద్ధానికి వెళ్ళాడు.

ఇంట్లో వంటరి పార్వతికి కాలం బరువుగా గడుస్తున్నది. శివుడు ఎప్పుడు వచ్చేదీ తెలీదు. ఆ సమయంలో నారదుడు వచ్చి, "అమ్మాయి పార్వతీ! శివుడు నిన్ను పెళ్ళాడినప్పట్నించీ తారకాసురుడు తల్లడిల్లిపోతూ పీడకలలు కంటున్నాడు. నీకు ఎలాంటి హాని తలపెడతాడోయే మో. వాడికి వజ్రదంతుడు తోడై ఉన్నాడు. వజ్రదంతుడు బహుమాయావి! నువ్వు చాలా జాగ్రత్తగా ఉండాలిసుమా!" అని హెచ్చరించి వెళ్ళాడు.



పార్వతికి మరింత చిరాకు, దిగులు కూడా కలిగాయి. చక్కగా తలంటు స్నానం చేస్తే చిరాకు తగ్గి బాగుంటుందనిపించింది.

పార్వతి నలుగు పెట్టుకొని, ఆ నలుగు ముద్ద కూడదీసి, ఆ ముద్దతో ఒక బొమ్మ చేసి ముచ్చటగా చూసుకొని అలా కిందపెట్టి అటు తిరిగి ఇటు చూసేసరికి బొమ్మకు మారుగా ముద్దులుమూటగట్టే బాలుడు కనిపించాడు. "ఎవరబ్బా, నీవు?" అని పార్వతి అడిగింది.

"నీ కాంతిని పుణికి పుచ్చుకొని రాలిన నలుగుముద్దనే కదుటమ్మా! నీ పుత్రుణ్ణి, పుత్రగణపతిని!" అన్నాడు బాలుడు. పార్వతి బాలుణ్ణి అక్కున చేర్చుకొని ముద్దాడి, ఒక అంకుశ గదా దండాన్ని అతని చేతికిచ్చి, "నాయనా! ఎవ్వరినీ, పురుగునైనా రానీయకు!" అని చెప్పి సింహద్వారం దగ్గిర కాపలా ఉంచింది.

"అమ్మా! తినడానికేమైనా పెట్టవూ," అని అడిగాడు కుర్రవాడు. అప్పటి కప్పుడు పిండి కలిపి చలిమిడి ముద్దనూ, ఉండ్రాళ్ళనూ చేసి ఇచ్చి పార్వతి స్నానానికి వెళ్ళింది.

పార్వతిని అంత మొందించితే శివుడికి కొడుకు పుట్టే అవకాశం లేదు, తన ప్రాణానికి భయం ఉండదని తలచి తారకాసురుడు వజ్రదంతుణ్ణి పార్వతిని అపహరించుకొని రమ్మని పురమాయిం




చాడు. వజ్రదంతుడు వజ్రాయుధాన్ని పరపరకొరికి పారేయగల వాడికోరలు గల పెద్ద రాక్షసి ఎలుక రూపంతో కొండల్ని డొల్చి పిండిచేస్తూ, మూషికాసురుడు అని కూడా పేరు పడ్డాడు. పార్వతిని అపహరించుకు రావడానికి ముందు గజకర్ణి, గోకర్ణి అనే తన ముఖ్యానుచరులైన రాక్షసులిద్దర్ని పంపించాడు.

వాళ్లు దున్నపోతుల్లా బలిసిన కుర్రాళ్ళ రూపంతో వెళ్లి, దొంగచూపులు చూస్తూ, సింహద్వారం దగ్గిర అంకుశ గదాదండాన్ని పట్టి అటూ ఇటూ తిరుగుతూ కాపలా కాస్తున్న బాలుణ్ణి, "ఆడుకుందాం రా!" అని పిలిచారు.

బాలుడు వాళ్ళను చూడనట్టే చూసి, నవ్వుతూ, "ముందు కాస్త తినండిరా!" అంటూ రెండు చలిమిడిముద్దలు వాళ్ళ మీదకు విసిరాడు. వాళ్ళు తలలు దిమ్మ తిరిగి పారిపోబోతూంటే, రెండు ఉండ్రాళ్లు పెద్ద బండరాళ్లై వాళ్ళముందు పడగా బోర్లా పడ్డారు. పుత్రగణపతి వాళ్ళను పిలిచి, "చెవులు పట్టుకొని మూడేసి గుంజీలు తీసి, లెంపలేసుకొని మరీ పొండిరా!" అని ఆజ్ఞాపించాడు. వాళ్ళు లాగే చేసి, రాక్షస రూపాలతో వజ్రదంతుడికి ఎగఊపిరితో జరిగింది చెప్పారు.

వజ్రదంతుడు హుంకరించి ఎలుక రూపంతో వెళ్లి ద్వారానికి సమీపంలో బొరియచేసి దూరబోతూండగా పుత్రగణపతి మొలపాశాన్ని తీసి ఉచ్చు పన్ని విసిరి మూషికాన్ని పట్టాడు. ఉచ్చు మెడకు బిగిసి కీచుకీచుమంటూన్న దాని నెత్తిన నాలుగు మొట్టికాయలు పెట్టి, తోక పట్టుకొని గిరగిరా తిప్పి విసిరేశాడు.

పుత్రగణపతి విసురుకి మూషికాసురుడు అమాంతంగా అతని రాజ్యంలో అంతఃపురం ముందు దభీమని నిజరూపుతో బోర్లాపడ్డాడు. అతని భార్య ధవళ గొప్ప దేవీ భక్తురాలు. ఎప్పటికీ తన పసుపు కుంకుమలు నిలిచేలాగ భర్తకు చావులేని వరం దేవివల్ల పొందింది! ధవళ భర్తను

ఊరడించి వరం సంగతి చెప్పి ధైర్యం కలిగించి, పార్వతి జోలికి పోవద్దని హితవు చెప్పింది.

*　　*　　*

త్రిపురాసురులను సంహరించి ముందుగా వచ్చిన శివుడు పార్వతిని చూడాలనే తహతహతో హుటాహుటిగా వెళ్ళబోతూంటే బాలుడు అడ్డగించాడు. శివుడు చకితుడై, "ఎవరు నువ్వు?" అని గద్దించాడు.

బాలుడు పకపక నవ్వుతూ, "అమ్మ కొడుకుని! మాయావులూ, వేషధారులూ తిరుగుతున్నారు, పురుగైనా పోకుండా కాపలా పెట్టింది, మా అమ్మ!" అన్నాడు.

"నేను ఈశ్వరుణ్ణి, దేవుణ్ణి!" అన్నాడు శివుడు.

"నాకు ఎటువంటి దేవుడితోనూ నిమిత్తం లేదు. అమ్మ ప్రకృతి స్వరూపిణి; ప్రకృతి శాసనాన్ని అనుసరించి నడుచుకోవడం కంటే జీవకోటికి వేరే ధర్మమేదీ లేదుకదా! అమ్మ ఆజ్ఞ పాలించటమే నా విధి!" అన్నాడు బాలుడు.

కొంచెం వెనక నుంచి త్రిపురాసుర సంహారం చేసిన శివుడి పరాక్రమవీర గాథను గానం చేస్తూ జయజయ ధ్వానాలతో వస్తూన్న ప్రమథగణాలు, ముక్కోటి దేవతలు అక్కడికి చేరుకొని,




శివుడు బాలుడితో ఘర్షణ పడుతూండడం చూసి ఆశ్చర్యంతో బొమ్మల్లాగ నిల్చిపోయి, వాళ్ళ సంవాదం వినసాగారు.

"కుర్రకుంకవు, తెలియక దేవుడు లేడంటున్నావు. అంతటికీ మూలము పరబ్రహ్మము, అతడే దేవుడు!" అన్నాడు శివుడు. "పెద్దవాడివైనా నీకే తెలియనట్టుంది, ఆదిశక్తి నుండి విశ్వమూ, త్రిమూర్తులూ వచ్చిన సంగతిని సూక్ష్మంగా చెబుతాను విను," అంటూ బాలుడు చెప్పసాగాడు:

ఆదిశక్తి రూపుదాల్చి బ్రహ్మను, విష్ణువును, మహేశ్వరుణ్ణి తన మేను విదల్చగా వచ్చిన ఎరుపు, నీలం, తెలుపు



రంగుల తేజస్సుల నుండి పుట్టించింది. బ్రహ్మ, విష్ణువు లిద్దరూ దేవి చెప్పింది వినకుండా ధిక్కరించారు. వాళ్లను ఆమె తన మూడో కంటిని తెరిచి బూడిద కుప్పల్ని చేసింది. మహేశ్వరుడు గడుసు వాడు; చెప్పినట్టే వింటానుగాని, ముందు మూడోకన్ను తనకు ఇమ్మన్నాడు. దేవి తన మూడో నేత్రాన్ని తీసి అతని నొసట అతి కించింది. వెంటనే అతను దాన్ని తెరిచి ఆవిణ్ణి కాల్చాడు. ఆమె మండిపోతూంటే అగ్నిరేణువులు విరజిమ్ముకొని తేజో మండలాలు ఏర్పడ్డాయి. భస్మం రేగి అంతటా నిండింది. ఆ విధంగా విశ్వం ఏర్పడింది. తర్వాత కాలినట్టే కాలి పోయిన దేవి మళ్ళీ యథారూపంలో కనిపించింది. అందుకే ఆమెను 'మహా మాయ' అని అన్నారు. మహేశ్వరుణ్ణి మెచ్చుకొని, అతణ్ణి లయకారుడుగా నిర్ణ యించింది. బ్రహ్మ, విష్ణువులను వారి బూడిదల నుండి రప్పించింది. కొంత మిగిలివున్న తన బూడిదను మూడు భాగాలు చేసి వాణిని, లక్ష్మిని, ఉమను రూపొందించింది. వాణిని బ్రహ్మ, లక్ష్మిని విష్ణువు, ఉమను మహేశ్వరుడు అర్ధాంగు లుగా స్వీకరించి లోకపాలన చేయండని చెప్పి, దేవి అంతర్ధానమైంది.

''నీవు చెప్పిందంతా ఒట్టి కట్టుకథ!'' అన్నాడు శివుడు.

''నాది కట్టుకథ అయితే బ్రహ్మము దేవుడు అంటూ నీవు చెప్పేదంతా కేవలం మెట్టవేదాంతం అంటే తప్పేముంది? అంతా దేవుడు నుండి పుట్టిందనడం కంటే ఆదిశక్తి నుండి వచ్చిందనడం ఎక్కువ నిజంగా వినిపించడం లేదా!'' అని అడిగాడు బాలుడు. అతని మాటలకు అక్కడున్న మగవాళ్ల ముఖాలు వెలవెల పోయాయి. ఒక్క విష్ణువు మాత్రం మెచ్చుకుంటూన్నట్టుగా బాలుణ్ణి చూసి చిరునవ్వు నవ్వాడు. బ్రహ్మ బాలుడి తర్కానికి మురిసిపోయాడు. ఆడవాళ్ళ ముఖాలు కళకళలాడుతూ వికసించాయి.

శివుడు ముఖం ఎర్రగా చేసుకొని, "చూస్తే పసివాడివైతివి, భయపడకు, నిన్నేమీ చేయనులే! మంచిగా ద్వారానికి అడ్డం తొలగిపో!" అన్నాడు కసురు తున్నట్టుగా. "నా కంఠంలో ప్రాణం ఉండగా నిన్ను వెళ్ళనిచ్చేది లేదు!" అన్నాడు బాలుడు నిర్భయంగా. శివుడికి పట్టరాని కోపం వచ్చింది. చప్పట్లుచరిచి ప్రమథగణాలకు సైగచేశాడు. బాలుణ్ణి ఈడ్చిపారేయడానికి వాళ్ళు ముందు కురికారు.

బాలుడు నవ్వుతూ, "పసివాడివంటూ కనికరించినట్లే నటిస్తూ నా మీదకు నీ గణాల్ని బలప్రయోగానికి ఉసిగొల్పడం ఏమైనా బాగుందా? సరే, నేనూ గణాధిపతినే!" అంటూ అంకుశదండాన్ని నేలకు గట్టిగా తాటించాడు. నేల ఈనినట్లు పుత్రగణపతి లాంటి రూపురేఖలు గల వాళ్ళు వేలకువేలు పుట్టుకొచ్చి, నందినీ, శృంగినీ, భృంగినీ, చండీశ్వరుణ్ణీ తమ చేతులో ఉన్న అంకుశాలు, గదలు, పాశాలు, శూలాలతో గొడ్లను తరిమినట్టు తరిమేశారు. మిగతా శివానుచరులంతా జాడలేకుండా పారిపోయారు. పుత్ర గణపతి గణమంతా అదృశ్యమయ్యారు.

శివుడు రుద్రుడై త్రిశూలం ఎత్తాడు. బాలుడు అంకుశదండంతో అడ్డుకోగా ఖంగున మ్రోగుతూ త్రిశూలం పడిపోయింది. బాలుడు పకపక నవ్వుతూ, "మా అమ్మ ఇచ్చిన దండం నా చేత నుండగా నన్నేమీ చేయలేవు. నీ వేదో చేద్దామనుకుంటున్నది నిర్విఘ్నంగా నెరవేర్చాలనే నేనూ సిద్ధంగా ఉన్నాను, తర్వాత కథ అమ్మ చూసుకొంటుంది!" అంటూ అంకుశగదాదండాన్ని దూరంగా విడిచిపెట్టాడు. శివుడు ఒళ్ళు తెలియని కోపంతో ఉన్మత్తుడిలాగ త్రిశూలాన్ని బాలుడి కంఠానికి గురిపెట్టి విసిరాడు. మరుక్షణంలో బాలుడు, "అమ్మా!" అని పెద్ద పెట్టున అరుస్తూండగా అతని తల తెగి ఆకాశానికి ఎగిరి పెద్ద జ్యోతిగా వెలిగిపోతూ, అంతరిక్షంలో లీనమైంది.





# విఘ్నేశ్వరుడు

పార్వతి పుత్రగణపతి కేకకు బిరబిరా వచ్చి, తల తెగిపడి ఉన్న బాలుణ్ణి చూసి, శివుణ్ణి చురచుర చూస్తూ, "ఎంత పని చేశావు! మన పుత్రుణ్ణి నరికావు! పుత్ర హంతకుడివి!" అంటూ కుప్పలా కూలబడి భోరుమని శోకించసాగింది.

అంతవరకు స్తంభించిపోయి చూస్తున్న గుంపులో ఒక్కసారిగా కలకలం సముద్ర ఘోషలాగా చేలరేగింది. పెద్దనేరం చేసిన వాణ్ణిలాగ శివుణ్ణి చూడసాగారు. శివుడికి ముచ్చెమటలు పోశాయి. బిక్కముఖం పెట్టి, "నాకు తెలియని పుత్రుడా! ఎలాగ వచ్చాడు?" అన్నాడు.

పార్వతి తనవంటికి పెట్టుకున్న నలుగు ముద్ద ఏ విధంగా పుత్రగణపతి అయినదీ చెప్పింది. దానికి శివుడు పెదవి విరిచి, కోపంగాచూస్తూ, "నీకు కుమారుడైతే కావచ్చు, అందుకే అమ్మ, అమ్మ అంటూ తెగ వాగాడు. మన పుత్రుడంటున్నావు, నాకు పుత్రుడెలాగ అవుతాడు?" అని అడిగాడు.

పార్వతితెల్లబోయింది. అప్పుడు విష్ణువు బ్రహ్మకు సైగచేశాడు. బ్రహ్మ ముందుకు వచ్చి, "శివుడు పార్వతిచేతిని పుచ్చుకున్నప్పుడే శివుడి తేజస్సు పార్వతి శరీరంనిండా ప్రవేశించి పులకరింప జేసింది. అది మొదలు శివుడు, పార్వతిలో సగభాగంగా అంతర్లీనమై ఉంటూనే ఉన్నాడు. పుత్రగణపతి శివుడి కుమారుడే!" అని నాలుగు నోళ్ళతో నొక్కి చెప్పాడు.



శివుడు చేతులు నలుపుకొంటూ దిక్కులు చూస్తూంటే, పార్వతి బాలుడి కళేబరం మీదపడి ఏడుస్తూంటే, ఆకాశం నుండి, "ఉత్తర దిక్కుకు తల పెట్టి నిద్రిస్తూన్న తలను తెచ్చి నాకు అతకండి, నేను లేస్తాను!" అన్న పుత్రగణపతి వాక్కులు వినిపించాయి.

వెంటనే దేవతలూ, ప్రమథులూ అంతా గాలిస్తూ ఎంత వెతికినా ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రిస్తున్న వాళ్ళెవ్వరూ కనిపించలేదు.

ఇంకా వెతుకుతూ పోగాపోగా సహ్యాద్రి పర్వతం మీద బిల్వవనంలో ఒక తెల్లని ఏనుగుగున్న మాత్రం ఉత్తర దిక్కుకు తలపెట్టి నిద్రిస్తూనే, శివస్మరణ చేస్తూ కనిపించింది.

ఆ ఏనుగుగున్న దేవలోకంలో దేవతా గజమైన ఐరావతం కుమారుడైన గజేంద్రుడు. ఐరావతం ఇంద్రుడి వాహనం. ఒకసారి ఇంద్రుడు అలా వస్తూంటే గజేంద్రుడు అతణ్ణి లెక్కచేయకుండా తన ధ్యాసలో తానుండటం చూసి ఇంద్రుడు కళ్ళెర్రజేసి, "నా వాహనం కొడుకు ఇంత పొగరా!" అని దుర్భాషలాడాడు.

అప్పుడు గజేంద్రం శాంతంగా, "నా తండ్రి తనవిధిని తాను చేస్తున్నాడు, అంత మాత్రం చేత నీవు మమ్మల్నితక్కువ చేసి మాట్లాడవలసిన పని లేదు. నేను నీకు భయపడాల్సిందేమీ లేదు!" అన్నాడు.

"నేను దేవేంద్రుణ్ణిరా, ఏనుగా!" అన్నాడు ఇంద్రుడు గర్వంగా.

"ఔను, నేను ఏనుగును, గజేంద్రుణ్ణి! మరొకరు నాగేంద్రుడైతే, ఇంకొకరు పక్షింద్రుడు. ఇలా ఎంతమంది ఇంద్రుళ్ళున్నా ఉండవచ్చు. నూరు యజ్ఞాలుచేస్తే చాలు, ఇంద్రపదవి పొందవచ్చు. తపస్సుతో సాధించవచ్చు. అందుకే ఎవరెక్కడ ఏది చేస్తున్నారని తెలిసినా నీకు తగనిభయం! ఇంద్రత్వం ఏమంత గొప్పదని నీవు జ్ఞానంతో చెప్పుకొంటున్నావు?' అన్నాడు గజేంద్రుడు.

ఇంద్రుడు రెచ్చిపోయి శపించుతున్న ట్లుగా, "నీ తల తెగా!" అని తిట్టాడు.

గజేంద్రం నవ్వుతూ, "శివుడిఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదుగదా, ఆ తలముందే నీ తల వంచవలసి వస్తుందేమో ఎవరి కెరుక!" అన్నాడు.

గజేంద్రం గొప్ప జ్ఞాని అని గుర్తించలేని గర్వాంధుడైన ఇంద్రుడు, "ఆ శివుణ్ణే నమ్ముకో, భూమ్మీద పడు!" అని గజేంద్రాన్ని స్వర్గం నుండి కిందకు తోసే శాడు. గజేంద్రం సహ్యపర్వతం మీద పడి, ఎల్లప్పుడూ శివసంస్మరణం చేసుకుంటూ, శివుడి నివాసమైన కైలాసం ఉండే ఉత్తర దిక్కుకే తలపెట్టుకొని నిద్రిస్తూండేది.

దేవతలు గజేంద్రం తలను నరికి తీసుకెళ్ళారు. ఆ తలను శివుడు బాలుడి కళేబరానికి అతికించగానే పుత్రగణపతి ఏనుగు ముఖంతో కళకళలాడుతూ లేచి నించున్నాడు.

"నా ముద్దులయ్యకు ఏనుగు ముఖం ఏమిటి? నేను చూడలేను," అని పార్వతి దుఃఖంతో కళ్ళు మూసుకొంది.

అప్పుడు గజముఖుడు వీనులు విందు చేసేస్వరంతో, "అమ్మా! ఎందుకు విచారి స్తావు? జరగాల్సిందంతా నిర్విఘ్నంగా జరి గింది! ఆనాడు మీరిద్దరూ గోడమీదఏనుగుల చిత్రాన్ని చూస్తున్నప్పుడు కనిపించిన



నన్ను గుర్తించలేదా? విఘ్నేశ్వరుణ్ణి!" అన్నాడు.

ఆ మాటలు వింటూనే పార్వతికి కల వచ్చినట్లుగా ఆ విశేషమంతా కనిపిం చింది. శివుడికీ అలాగే విఘ్నేశ్వరుడు స్ఫురణకు వచ్చాడు.

"విఘ్నేశ్వరా! నీవా, మాకు పుత్రుడవై అవతరించావా! ఇందుకా నన్ను అంతగా కవ్వించి కయ్యానికి కాలుదువ్వి, నాకు కోపం తెప్పించింది! నాకు యిప్పుడు అంతా బోధపడుతున్నది, నీ లీల అద్భుతం!" అన్నాడు శివుడు.

"లేకపోతే గజాసురుడికి, నువ్వు ఇచ్చిన వాగానాలు ఎలాగ నెరవేరతా



యనుకున్నావు?'' అని విఘ్నేశ్వరుడు జ్ఞాపకం చేశాడు.

శివుడు, ''బాగా జ్ఞాపకంచేశావు. నేను గజచర్మాన్ని కూడా కట్టుకోవలసి ఉన్నది. ఏనుగుతల నా కుమారుడికి ఉండనే ఉన్నది!'' అన్నాడు. ఆ తర్వాత గజచర్మాన్ని తెప్పించి కట్టుకున్నాడు.

శివుడు విఘ్నేశ్వరుడికి వినయంగా వంగి, ''విఘ్నేశ్వరా! నీ విశ్వరూపాన్ని చూపించు!'' అని కోరాడు.

అప్పుడు విఘ్నేశ్వరుడు ఆకాశానికి పెరిగి ఐదుతలలతో కనిపించాడు. భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము అనే పంచ భూతాల రంగులైన ఆకుపచ్చ, మబ్బు రంగు, ఎరుపు, తెలుపు, నీలం రంగులు అయిదు ఏనుగు తలలకూ ఉన్నవి. ఆ తలలపై నక్షత్రాలు తల పూవులుగా మెరుస్తున్నవి. విఘ్నేశ్వరుడి గుండ్రని పెద్ద బొజ్జ మినుకు మినుకుమనే కాంతులతో ఆకాశాన్ని పోలి ఉన్నది. అతని అనేకమైన చేతుల్లో అంకుశము, గొడ్డలి, పాశము, కలశములతో బాటు త్రిమూర్తులకు చెందిన శంఖచక్ర గదా పద్మ ఢమరుక త్రిశూల వజ్రాయుధాలు, జపమాల, కమండలువు, వీణ, ఖడ్గము, శక్తిఈటె మొదలైనవన్నీ ఉన్నాయి. అతని రూపాన్ని తలలు పైకి సారించి చూస్తున్న వారంతా కళ్ళు మిరుమిట్లు గొలిపే అతని తేజస్సు చూడలేక తలలు దించారు. అప్పుడు అందరిలోనూ ఏదో మహానందం కలిగింది. సరస్వతి వీణ తీసి విఘ్నేశ్వరుడికి ప్రియమైన హంస ధ్వని రాగాన్ని సంరంభంగా దురితగతితో పలికిస్తూంటే, నారదుడు మాయామాళవ గౌళరాగాన్ని మధ్య మధ్య జోడించాడు. శివుడు ఆనందతాండవం చేశాడు.

ఇంద్రుడితో సహా ముక్కోటి దేవతలు తలలు వంచి విఘ్నేశ్వరుడికి నమస్కరించారు. అప్పుడు ఇంద్రుడి చెవుల్లో, 'ఆ తల ముందే నీ తల వంచవలసి వస్తుందేమో!' అని గజేంద్రం అన్న



మాటలు గింగురుమన్నాయి. పుత్రగణపతికి అతికిన తల గజేంద్రానిదని అతనికి తెలుసు. ఇంద్రుడు చెవులు పట్టుకొని మూడుసార్లు వంగి లేస్తూ లెంపలేసుకొని సాష్టాంగపడి మ్రొక్కి, "గజేంద్రా! నీవు జ్ఞానివి, నేను అజ్ఞానిని. నా గర్వాన్ని మన్నించు!" అని మనస్సులో అనుకున్నాడు. దేవతలంతా ఇంద్రుడు చేసినట్లే అనుకరించి మ్రొక్కారు.

విశ్వరూపం దాల్చిన విఘ్నేశ్వరుడితో శివుడు, "విఘ్నేశ్వరా! నీ రూపానికి ఎన్నో విశేషార్థాలున్నట్లుగా మాకు తోస్తున్నది, తెలుసుకోవాలని కుతూహలపడుతున్నాము," అని అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "శివభక్తుల సమ్మేళనమే యీ విశ్వం. నేను విశ్వజననీజనకులైన పార్వతీ శివులకు పుత్రుణ్ణి మాత్రమే. వారికి అంజలి ఘటిస్తున్నాను!" అని అంటూ చేతులెత్తి జోడించి ఊరుకున్నాడు.

బ్రహ్మ ముందుకు వచ్చి యిలా చెప్పాడు: "మత్స్యావతారం ఎత్తి విష్ణువు సోమకాసురుణ్ణి సంహరించి వేదాల్ని భద్రపరిచాడు. నిండుచందమామ కాంతుల్ని విరజిమ్ముతూ విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి వాటిని నాకు అందజేశాడు. నాకు జ్ఞానసిద్ధి కలిగింది. అప్పుడు విఘ్నేశ్వరుని గురించి విశేషాలు చాలా తెలుసుకున్నాను. సంకల్పసిద్ధికి మూలమైన విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి సక్రమంగా సృష్టిచేయగల్గాను.

విఘ్నేశ్వరుడు విరాట్‌స్వరూపుడు. వ్యాపించేవాడు గనుకనే 'విష్ణం' అని అనిపించుకున్నాడు. ఆకాశము, గాలి, అగ్ని, నీరు, మట్టి అనే పంచమహాభూతగణానికి అధిపతి గనుకనే విఘ్నేశ్వరుడు మహాగణాధిపతి! లక్ష్మీసరస్వతుల నిలయంగా నడుమనున్న విశ్వరూప విఘ్నేశ్వరుడి ఐదు తలలూ శ్వేతనీలము, ఊదా, ఎరుపు, శ్యామనీలము, పచ్చరంగులతో పంచమహాభూతాలకు ప్రతిరూపాలుగా ఉన్నవి.

ఏనుగుతల బలానికీ మేధస్సుకీ చిహ్నం; బొజ్జ ఉండగానే సంబరం కాదు, తగినంత మేధస్సు ఉండాలని అర్థం. కొత్తవి పడుతూ ఉంటే, పాతవి జీర్ణం అవుతూండే తినుబండారాలకు మల్లే, అనంతాకాశంలో నక్షత్రమండలాలు, గ్రహాలు, ఉపగ్రహాలు, గోళాలు, లోకాలు నిండి ఉన్నాయని లంబోదరం గుర్తుచేస్తూన్నది. ఈయన త్వరలోనే చిన్న ఎలుక నెక్కి తిరగబోతున్నాడు. అంటే సూర్యచంద్రాది గ్రహాలు మహామండలాలు శూన్యాకాశంలో గతులు తప్పకుండా అంత లాఘవంగా తిరుగుతున్నాయనీ, విశ్వస్వరూపం చిట్టెలుకపై ఏనుగుస్వారి లాంటి చిత్రాతిచిత్రమైన విజ్ఞానంతో నిండి ఉన్నదనీ చెప్పడం అన్నమాట! విశ్వవిజ్ఞానానికి విఘ్నేశ్వరుడు సంకేతం, విజ్ఞానేశ్వరుడు అనబడుతున్నాడు.



విశ్వానికి అధినేత, నియంత అంకుశాన్ని ధరించాడు. బుద్ధిబలానికి విఘ్నేశ్వరుడు గురుతు! బుద్ధి వెర్రితలలు వేయకుండా మావటివాడు ఏనుగును ఉంచినట్లుగా, అదుపులో ఉంచాలని అంకుశం మనో నిగ్రహానికి ప్రతిరూపంగా ఉన్నది. సర్వమూ తమతమ ధర్మాలకు కట్టుబడి ఉన్నదని విఘ్నేశ్వరుని చేతనున్న పాశము చెబుతున్నది. పరిపూర్ణత తొణకని బెణకని నిండుకుండ లాంటిదని, కలశాన్ని ధరించాడు. పరశువుతో విఘ్నాన్ని ఛిన్నాభిన్నం చేస్తాడు. విశ్వం నాదాత్మకమైనది. అనేక ఓంకార ఝంకారాల్ని ధ్వనించే విశ్వవీణనే విఘ్నేశ్వరుడు మీటుతున్నాడు. చరాచర జీవకోట్ల మొరలన్నీ వినడానికే అంత పెద్ద చెవులు రిక్కించి ఉన్నాడు. ఏనుగు కళ్ళు చిన్నవైనా సూక్ష్మదర్శనం కలిగి, నిశితంగా చూడగల్గినట్లే, పరమాణువు మొదలుకొని బ్రహ్మాండాల్ని పరిశీలిస్తున్నాడు. వంపు పెట్టిన వక్రతుండం వంకల్ని తుండతుండాలుగా చేసి సరిదిద్దుతుంది. తొండం నిడువుగా సాగి

ఎన్నిటినైనా అందుకొంటుంది. అంది స్తుంది!

సస్యసమృద్ధికి విఘ్నేశ్వరుడు అధినాథుడు. భోజనప్రియుడు గనుక, ఆహారం వల్లనే కండబలమూ, కండబలం ఉంటేనే బుద్ధిబలానికి నిలకడ, సార్థకత ఉంటాయని పండ్లూ, పిండివంటలూ, ఆకుకూరలూ వద్దనకుండా స్వీకరిస్తాడు. భాద్రపదమాసంలో ఏనుగుల్లాంటి మేఘాలు తొండాలవంటి వర్షపుధారలు కురుస్తాయి. మేఘ గణాలకు నాథుడు గణనాథుడు! విఘ్నేశ్వరుడు అవతరించిన ఇది భాద్రపదమాసమే. భాద్రపద శుక్లచవితినాడు విఘ్నేశ్వరుణ్ణి అర్చించిన వారికి సంకల్పసిద్ధితోపాటు, అన్ని విఘ్నాలను అరికట్టుకోగల బుద్ధి నిబ్బరము కలుగుతుంది.

తన దంతపు గంటాన్ని మోపినది ఎత్తకుండా విఘ్నేశ్వరుని చేతి మీదుగానే పంచమవేదం అనదగ్గ మహాభారతం అక్షరసిద్ధిపొంది, చిరస్థాయిగా నిలుస్తుంది. విఘ్నరాజు మహిమలు వర్ణించడం నా తరం కాదు. ఏ కార్యమైనా తలపెట్టే ముందు విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి, పూజించి మరీ ప్రారంభించాలి. శుభం కలుగుతుంది అంటూ అభయముద్ర పట్టి ఉన్నాడు. మహాగణాధిపతి అందరికీ ప్రథమ ఆరాధ్యదైవము!'' అని బ్రహ్మ ముగించాడు.

అప్పుడు శివుడు అందర్నీ కలయజూసి, ''బ్రహ్మవాక్కు విన్నారుకదా, విఘ్నేశ్వరుడు తొలిపూజ దేవర!'' అన్నాడు.

అందరూ ఔను, ఔను అని తలలూపారు. నారదుడు హంసధ్వనిరాగాన్ని వీణపై హెూరెత్తిస్తూంటే, సరస్వతి హంసానంది రాగాన్ని అందుకొంది. ఆ సంరంభంలో పార్వతి విఘ్నేశ్వరుడికి నమస్కరించబోతూంటే, విశ్వరూప మహాగణాధిపతి, ''అమ్మా, అమ్మా వద్దు!'' అని వారిస్తూ చప్పున విశ్వరూపాన్ని ఉపసంహరించుకొని, గుజ్జువినాయకుడై తల్లి కాళ్ళు చుట్టేసుకున్నాడు.






పార్వతి క్షణంలో తన దుఃఖమంతా మరిచిపోయి, పిల్లవాణ్ణి ఎత్తుకుని దిష్ఠి తీసింది. శివుడు చేతులు చాచి పిలిచాడు. శివుడు మళ్ళీ ఏం చేసి పోతాడో అని భయం భయంగా తప్పటడుగులు వేస్తూ వెళ్ళిన విఘ్నేశ్వరుడి ముద్దు చేష్టకు అంతా ముచ్చటపడ్డారు.

''నాయనా, విఘ్నేశ్వరా! నిన్ను పుత్రుడిగా పొంది ధన్యులం అయ్యాం. చిరంజీవ!'' అని శివుడు ఎత్తి ముద్దాడుతూంటే విఘ్నేశ్వరుడు కిందకు దూకి, ''తండ్రీ! ఎంతమాట, నేను మీ కొడుకుని, ధన్యుణ్ణి నేను!'' అంటూ పార్వతీశివుల పాదాలను చిరుతొండంతో చుట్టి, కళ్ళ కద్దుకొని ప్రణామాలు చేశాడు. తరవాత విష్ణువును సమీపించి ఆయనకు ప్రణామం చేశాడు.

విష్ణువు, ''రావోయి ముద్దుల మేనల్లుడా!'' అని దగ్గరకు తీసుకొని, ''కళ్యాణమస్తు!'' అని దీవించాడు.

అప్పుడు విష్ణువు కాంతిలో విఘ్నేశ్వరుడు నీలాకాశం రంగులో కనిపించాడు. విష్ణువుకీ, విఘ్నేశ్వరుడికీ ఏవో పోలికలున్నట్లు అందరికీ తోచింది. అదే మేనమామ పోలిక అంటే! అని అనుకున్నారు.

వినాయకుడు బ్రహ్మకు నమస్కరించాడు. బ్రహ్మ, ''తొలిపూజ లందుకోవయ్యా బొజ్జగణపయ్యా!'' అని అంటూ అతని ఏనుగబుగ్గలు చిదిమిచిటిక వేశాడు.

5. విజయ విఘ్నేశ్వరుడు



రించాము. జయలక్ష్మి అనే సిద్ధి, విద్యావతి అనే బుద్ధి వినాయకుడికి తగిన వధువులు. ఇహ విఘ్నేశ్వరుని పెళ్ళి ముచ్చటే చూడాలి!'' అని అన్నారు.

లక్ష్మి, ''లక్ష్మీకరుడైన విఘ్నేశ్వరుణ్ణి నమ్మిన వారిని స్థిరంగా అంటిపెట్టుకొని ఉంటాను! సిద్ధిస్వరూపిణి జయలక్ష్మి నా అంశ. వినాయకుడికి కానున్న భార్య!'' అని చెప్పింది.

సరస్వతి, ''విఘ్నేశ్వరుడు జ్ఞాన ప్రదాత, విజ్ఞానదాయకుడు. అక్షరాభ్యాసానికి ముందు పిల్లలచేత పసుపు ముద్ద విఘ్నేశ్వరుడి పూజ జరిపించి, విఘ్నేశ్వర పరిపూర్ణస్వరూపంగా గుండ్రంగా చుట్టించి మరీ ఓనమాలు దిద్దించాలి; నా అంశగల విద్యావతి బుద్ధిరూపిణి, వినాయకుని నాయకి!'' అని చెప్పింది.

అప్పుడు విఘ్నేశ్వరుడు బేలముఖం పెట్టి, అందరినీ కలయజూచి, ''చూశారా! పెద్దల తీరు ఎలా ఉందో! పెళ్ళి చేసుకొని, వారు పడ్డ అవస్థలే పిల్లలు కూడా పడాలని పెళ్ళితొందర పెడతారే గాని, హాయిగా ఉండనివ్వరు. అందునా అమ్మలకు మరీ ఆరాటం! అన్నాడు.

అప్పుడు విష్ణుమూర్తి, ''లేదురా బాబూ! అణిమాదిసిద్ధులకు, అష్టఐశ్వర్యాలకు మూలమైన సిద్ధులు ఎనమండు

తర్వాత విఘ్నేశ్వరుడు లక్ష్మికి, సరస్వతికి మ్రొక్కాడు. వాళ్ళిద్దరూ కలిసి అతణ్ణి ఎత్తుకుని చెరో చెంపా ముద్దాడి, ''మేము విఘ్నేశ్వరుడి ఇరుపక్కలా అత్తాకోడళ్ళ పొరపొచ్చాలు మాని ఇలాగే సఖ్యంగా ఉంటాము!'' అని పార్వతిని చూసి, ''ముగ్గురమూ ఒకే ముగ్గురమ్మల మూలపుటమ్మ నుండి వచ్చిన సంగతి పుత్రగణపతి చెప్పనే చెప్పాడు. తర్వాత మళ్ళా విడివిడిగా క్షీర సాగరం నుంచి లక్ష్మి, బ్రహ్మ నాలుక నుండి సరస్వతిగా వాణి, మొదట దక్షుని కుమార్తె సతీదేవిగాను, ఇప్పుడు హిమవంతుని పుత్రి పార్వతిగా ఉమ అవత

గురు, చక్కనిచుక్కలై నిన్ను పూర్ణ చంద్రుణ్ణి కొలిచినట్లు సేవిస్తూంటే చూడా లని తొందరగానే ఉంది, సుమీ!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''ఓహెూ! అలాగా, నువ్వు కృష్ణావతారంలో అష్టమహిషులతో వేగుతూ ఆనందిద్దువు గానిలే!'' అన్నాడు.

విష్ణువు మందహాసం చేసి, ''నీ మాటకు తిరుగులేదు కాని, నీకు మాత్రం పదిమంది వధువుల పెళ్ళి తప్పదు!'' అన్నాడు.

''అలాగైతే విఘ్నేశ్వరుడి పెళ్ళికి వెయ్యి విఘ్నాలు అన్న సామెతగా, నేనే విఘ్నాలు కల్పించుకోక తప్పదు!'' అన్నాడు విఘ్నేశ్వరుడు.

''వెయ్యి కాదు, కోటి విఘ్నాలు వచ్చినా విఘ్నేశ్వరుడి పెళ్ళి ఆగదు!'' అని బ్రహ్మతో గొంతులు కలిపి అందరూ అన్నారు.

అప్పుడు నారదుడు ముందుకు వచ్చి, ''విజ్ఞానేశ్వరా! వాచాలతలో నన్ను మించావు కాని, పెళ్ళి తప్పించుకోవడం ఎవరితరం! నేను సంసారసాగరం ఈదడం చాతగాకనే కదా మునినై తిరుగుతున్నాను. జ్ఞానేశ్వరా! కళ్యాణం, ఉద్యోగం పురుషలక్షణం అని పురుషోత్తములూ ఆది దేవుళ్ళూ అనిపించుకున్న ప్రముఖులంతా పెళ్ళిళ్ళుచేసుకొని సృష్టి,



స్థితి, లయాది ఉద్యోగాలు చేస్తున్నారు. నీవూ, నేనూ అనగా ఎంత!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, ''ఓహెూ! నీకూ పెళ్ళి పిచ్చి తగిలే లాగుందే! స్వయంవరానికి కూడా వెళ్ళేవులాగుంది!'' అన్నాడు.

నారదుడు, ''త్రికాలవేదిని నేనేనను కుంటే అనంతకాలవేదివి నీవు. నీతో వాదించటం నా తరమా? మాటకారి తనంలో నీ తర్వాతనే నేను. అందరి జాతకాలూ నీ చేతుల్లోనే ఉన్నాయి. నిన్ను విస్మరించిన ఎలాంటి ఉద్దండ జ్యోతిషపాండిత్యమూ ఫలించదు. మనం ఇద్దరం మేలురకం వాగుడుకాయలం!



మాటలకు దిగితే అనంతకాలం చాలదు గాని, నీవు పూర్ణజ్ఞానివి. మా లాంటి అర్ధ జ్ఞానులు ఎలాంటి పిచ్చిలో పడ్డా నీ లాంటి వాళ్ళు తామరాకు మీద నీటిబొట్టు లాగ దేనికీ లొంగిపోరు. నీవు మాయకు అతీతుడివి, కాబట్టి సిద్ధిబుద్ధులు, అష్టసిద్ధులూ నిన్ను వరించుతాయని, నన్ను కూడా శ్రీరస్తు, శుభమస్తు, శీఘ్రకళ్యాణ సిద్ధిరస్తు! అని పలికించనియ్యి," అని అంటూ మహతి వీణపై కళ్యాణిరాగం మొదలుపెట్టి సామరాగం అందుకొని సౌరాష్ట్ర రాగంతో మంగళగీతాన్ని పలికించాడు.

దేవతలంతా ఎవరితావులకు వారు వెళ్ళారు. విఘ్నేశ్వరుణ్ణీ, పార్వతినీ, వెంటబెట్టుకుని శివుడు తన నిజనివాసమైన కైలాసానికి వెళ్ళాడు. నారదుడు తిన్నగా వజ్రదంతుడి దగ్గిరికి బయలుదేరాడు.

ఆనాడు పుత్రగణపతి తోకపట్టి గిరగిరా తిప్పి విసిరితే పడ్డపాటుకు వజ్రదంతుడి ఒళ్ళునొప్పులు యింకా తీరనే లేదు. ధవళ, భర్తకు పరిచర్యలు చేస్తున్నది. వచ్చిన నారదుణ్ణి చూసి, మళ్ళీ ఏం గొడవ తెచ్చి పెడతాడో అని అనుకుంటూనే లోనికి వెళ్ళింది.

నారదుడు మూషికాసురుడితో, "నిన్ను పరాభవించిన గణపతి విఘ్నేశ్వరుడిగా వర్ధిల్లుతున్నాడు, మరి....," అంటూ ఆగాడు.

పరాభవాగ్ని రగిలి, వజ్రదంతుడు, "ఇప్పుడేం చెయ్యమంటావు, నారదా?" అని దిక్కుముహం పెట్టాడు.

నారదుడు, "వరాలదేవుడు బ్రహ్మ ఉండనే ఉన్నాడుగదా! వజ్రాన్ని వజ్రంతోనే కొయ్యాలి! ప్రతీకారం సాధించు. గణపతి విఘ్నేశ్వరనామం ధరించాడు, గజముఖుడు! గుర్తుంచుకో!" అని చెప్పి చల్లగా వెళ్ళాడు.

మహాశ్వేత అనే నామాంతరం గల ధవళ ఎంత చెప్పినా వినకుండా, వజ్రదంతుడు, "మహాశ్వేతా! నీ పసుపు



కుంకాల పుణ్యమూ అని నా కెలాగూ చావు భయం లేదుగద! ప్రతీకారం చేసి మనశ్శాంతిని పొందనివ్వు!'' అని చెప్పి ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మను ప్రసన్నం చేసుకొన్నాడు.

''ఏం కావాలి యింకా?'' అని బ్రహ్మ అడిగాడు.

''విఘ్నానికి రూపం కల్పించి, నా ఆజ్ఞానువర్తిగా చెయ్యి!'' అని మూషికాసురుడు కోరాడు.

బ్రహ్మ విఘ్నాన్ని ఆవాహన చేసి వజ్రదంతుడి ముందుంచాడు. అతడి కేమీ కనిపించలేదు. బ్రహ్మ అతనికి సూక్ష్మ దర్శన దృష్టి యిచ్చాడు. విఘ్నం మామూలు కంటికి కనిపించని కారు నల్లని సూక్ష్మక్రిమి రూపంలో అతడికి కనిపించింది.

మూషికాసురుడు ఆశ్చర్యంతో, ''ఇదేమిటి! ఈ నలుసును ఏం చేసుకోను?'' అన్నాడు.

బ్రహ్మ నవ్వి, ''విఘ్నం పెనుభూతం లాగ ఉంటుందనుకున్నావు కాని, విఘ్న బీజం కంటికి కనిపించని సూక్ష్మాణువు. సూక్ష్మక్రిమివల్ల భయంకర వ్యాధి వ్యాపించినట్లే, అనర్థదాయకమైన విఘ్న కారణం ఎంత చిన్నదైనా, ఎంతటి భీషణాకృతినైనా ధరించి సర్వనాశనం చేయగలదు! కామరూపి, ఏ రూపాన్నైనా ధరించి, అనర్థాలు కలిగించటమే దాని పని. ఏం చేసుకుంటావో చేసుకో!'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

మూషికాసురుడు విఘ్నంతో, ''నువు వెంటనే మహా గజాసుర రూపంతో వెళ్ళి విఘ్నేశ్వరుణ్ణి నాశనం చెయ్యి!'' అని ఆజ్ఞాపించాడు.

విఘ్నం ఏనుగ శరీరమూ, ఏనుగ కాళ్ళూ, భయంకరమైన చిన్నతలా, పెద్ద కోరలూ, నిప్పుల్లాంటి కళ్ళుగల గజాసుర రూపం పొంది, మహా పర్వతం లాగ కత్తి ఝుళిపిస్తూ ఆకాశానికి ఎగిసి ఎగురుతూ వెళ్ళాడు.



కైలాసంలో విఘ్నేశ్వరుడు అల్లారు ముద్దుగా పెరిగి, తలిదండ్రుల అనుమతితో తాను పుట్టిన విశ్వకర్మ నిర్మించిన భవనానికి బయలుదేరాడు. ఎదురుగా వస్తూ మన్మథుడు రూపంతో కనిపించాడు. విఘ్నేశ్వరుడు ఆశ్చర్యంగా, "కనిపించని వాడివి కనిపించావు. ఏమిటి విశేషం? నా మీద నీ విలువిద్య చూపకుమీ! అర్భకుణ్ణి," అన్నాడు.

మన్మథుడు వినయంగా తల వంచి, "గజేంద్రాననా! నీవు నా బాణాలకు అతీతుడివి. నాకు కనిపించాలని ఉంటే కనిపించే వరం శివుడు యిచ్చినదేగదా. దగ్గిర పోలికలున్న దగ్గిరవాళ్ళం గనుక కనిపించాను, అంతే! నీవు ఎద్దునెక్కిన శివుడి కొడుకువైతే, నేను గ్రద్దనెక్కిన విష్ణువు కుమారుణ్ణి. నన్ను శివుడు దహించి బ్రతికించాడు, నిన్ను ఖండించి బతికించాడు. నా వాహనం చిలుక, నీ వాహనం ఎలుక. మనస్సును చలింపజేసే పూలమ్ములు నా ఆయుధాలైతే, మనోనిగ్రహాన్ని యిచ్చే పాశాంకుశాలు నీ ఆయుధాలు. మరి నీకు తమ్ముడు కుమారస్వామి పుట్టాలి గదా? పార్వతీ పరమేశ్వరుల పరస్పర అనురాగ తేజస్సే కుమారస్వామిగా అవతరించాలి! తారకాసుర నిర్మూలన జరగాలి. అందుకే గదా నన్ను దేవతలు బూడిద కూడా చేయించింది. కైలాసం చేరబోతున్నాను. అనుజ్ఞ యివ్వు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "మన్మథా! అందుకే నేనూ కైలాసం దిగి వెళ్తున్నదీను. నీ పని నిర్విఘ్నంగా నెరవేర్చు. జయప్రదమవుతుంది!" అన్నాడు.

మన్మథుడు అదృశ్యుడై పార్వతీ శివులున్న కైలాస మంటపాన్ని చేరుకున్నాడు.

విఘ్నేశ్వరుడు భవనాన్ని చేరుకొని, సింహద్వారానికి ఛేరువగా చంద్రశిలా వేదికపై సుఖంగా కూర్చొని పరిసర ప్రకృతిని ఆనందంగా చూస్తున్నాడు. మెరుగుపెట్టిన వెండి హిమగిరి శిఖరాలు

సంధ్యకాంతుల్ని తళతళ ప్రతిఫలిస్తు న్నాయి. హిమానీ జలపాతాలు మంద్ర గంభీరంగా సరిగమలు వినిపిస్తున్నాయి. అలాంటి ప్రశాంత సమయంలో, "విఘ్నేశ్వరుడనేవాడు ఎక్కడ?" అనే భీకరగర్జన దిక్కులు మారుమోగుతూ వినిపించింది.

మహా గజాసుర రూపం ధరించిన విఘ్నం, విఘ్నేశ్వరుడి ఎదురుగా వాలింది. భూమి కంపించింది. గజాసురుడు, "నేను మహా గజాసురుణ్ణి. నువ్వు గజముఖుడి వైతే, నేను గజకాయుణ్ణి! నిన్ను హత మార్చవచ్చాను!" అంటూ రంకె వేశాడు.

విఘ్నేశ్వరుడు చెవిటివాడి లాగ అమా యకంగా చూస్తూ, "అబ్బ, ముక్కలు నరుక్కొని చెరుకుగడ తినాలని ఉంది. గొడ్డలి కాస్త పదునుపెట్టి యిస్తివా నీకు కుడుములు పెడతాను," అని అంటూ పరశువును వాటంగా విసిరాడు. గజా సురుడి కాళ్ళు తెగి పర్వతంలా కూలాడు. విఘ్నేశ్వరుడు ఎక్కి తాండవం చేస్తూ మర్దిస్తూంటే, "మహాప్రభో! నేను విఘ్నాన్ని! బ్రహ్మ యిచ్చిన వరం మేరకు మహా గజాసుర రూపంలో వచ్చాను, శాస్తి అయింది!" అని విఘ్నం అరిచింది.

విఘ్నేశ్వరుడు, "నేను విఘ్న వినాశ కుణ్ణి! అదీగాక నువ్వు ఇప్పుడు మాయ దారి గజాసురుడివి. నిన్ను తుత్తునియలు చేయక తప్పదు. నీ తునకలు నన్ను, నిన్ను ఏమర్చిన వాళ్ళను మాత్రమే పట్టి పీడిస్తాయి. నువ్వు కాళీయనాగుడవై కాళిందిమడుగున దాగి ఉండు. బాల కృష్ణుడు నిన్ను మర్దిస్తాడు. అతని పాదాలు నీ తలల మీద పడి నీ పాప పరిహారం అవుతుంది; జాతి సర్పాల పడగలపై విష్ణు పాదముద్రలు అది మొదలు అలంకారంగా శోభిస్తాయి!" అని చెప్పి, పరశువును పట్టి విఘ్నాన్ని ఛిన్నాభిన్నం చేశాడు. ఆ రేణు వులు అంతటా వ్యాపించి అదృశ్య మయాయి. విఘ్నం అణురూపంతో మిగి లింది. దేవతలు విఘ్నేశ్వరుడిపై పూల జల్లు కురిపించారు.





# విఘ్నేశ్వరుడు

"విఘ్నేశ్వరా! ఇప్పుడు నీవు చేసిన గజాసుర నిర్మూలన జ్ఞాపకంగా గణపతి నవరాత్రి ఉత్సవాలు కలకాలం ఘనంగా జరుగుతూంటాయి. ముందు కాలంలో ప్రజల స్వేచ్ఛ, శ్రేయస్సుల కోసం సాగే ఉద్యమాలు గణేశఉత్సవాలతో జయప్రదంగా కొనసాగి ఫలిస్తాయి. ఉత్సవాలన్నిటికీ గణపతి నవరాత్రి ఉత్సవం తిలకంగా ఉంటుంది!'' అని ఆకాశవాణి పలికింది.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, ''పార్వతీ నందనా! మేనల్లుడివని చెప్పి నాకు మరొక పని కూడా కల్పించావా!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''మేనమామ వరస పెట్టి కాలనేమి అయిన కంసుణ్ణి మేనమామ గండాన నువ్వెలాగూ పుట్టి, చంపుతావుగదా! ఇలాంటి వరసలన్నీ నీవు నేర్పిన విద్యలేగదా నీరజాక్ష!'' అన్నాడు.

విష్ణువు, ''విఘ్నవినాశకా! నీ పరశువు ముందు, నా చక్రాయుధం ఏపాటి? నీ గొడ్డలిసాము చూసినప్పుడు మహ ముచ్చటేసింది సుమా!'' అన్నాడు.

''పరశురామావతారంలో నా గొడ్డలి ఎరువు తీసుకెళ్ళి గర్వపోతులైన క్షత్రియుల్ని తెగనరుకుదువు గానిలే!'' అన్నాడు విఘ్నేశ్వరుడు.

విష్ణువు, ''గజవిఘ్నాసురుడి మీద ఎక్కి మర్దిస్తున్నప్పుడు నీ బుడిబుడి నడకల గుజ్జురూపం కూడా నన్నెంతో మురిపించిందోయి!'' అన్నాడు.

**6.** కుమారస్వామి జననం



"అలాగైతే, వామనుడివై బలిచక్రవర్తిని పాతాళానికి అణగదొక్కుదువు గానిలే!" అని విఘ్నేశ్వరుడు అన్నాడు.

"నీ బుద్ధి విశేషం కూడా నన్ను అమితంగా ఆకర్షించుతోంది. ఏం చెయ్యను," అని విష్ణువు అనగా, విఘ్నేశ్వరుడు, "ఏ యుగానికి అవసరమైన ధర్మాన్ని ఆ యుగంలో స్థాపించడమే గదా, నీ అవతారాలకు మూలకారణం! ధర్మసంస్థాపనకు, అసలు అర్థం, సంఘం హింసతో, మూఢాచారాలతో కుళ్ళిపోతున్న రోజుల్లో బుద్ధుడవై మానవులకు సక్రమ సంఘజీవనాన్ని, నిర్వాణాన్ని భోధించుతావులే! మాయాదేవి స్వప్నంలో నా తెల్లని ఏనుగు రూపం గర్భంలో ప్రవేశించి బుద్ధుడైన సిద్ధార్థుడి అవతారానికి నాంది పలుకుతుంది!" అని చెప్పాడు.

విష్ణువు మహదానందం పొందాడు.

పరమాణురూపంలో ఉన్న విఘ్నం, "విఘ్నరాజా, నీ బానిసను, నీ ఆజ్ఞాను వర్తిని, వెళుతున్నాను," అని శలవు తీసుకొని కాళింది మడుగు చేరి కాళీయుడుగా దాక్కుంది.

విఘ్నం వెనుకనే మూషికాసురుడు మూషికరూపంతో వచ్చి ప్రచ్ఛన్నంగా దాగి, విఘ్నానికి పట్టిన గతి చూసి పట పట పళ్ళు కొరికి, నిజరూపంతో బోర విరుచుకొని విఘ్నేశ్వరుడి ముందు నిలబడి సింహనాదం చేశాడు.

విఘ్నేశ్వరుడు బలిష్ఠమైన అతని శరీరాన్ని సంతృప్తిగా చూశాడు. మూషికాసురుడు నిర్లక్ష్యంగా విషపునవ్వు నవ్వుతూ, "విఘ్నం నీ బానిస కనుక ఏం చేసినా చేశావు గాని, నేను నీ జన్మవిరోధిని. సింహస్వప్నం అనే మాట వినే ఉంటావు, సింహాన్నై నీ కుంభస్థలాన్ని చీలుస్తాను!" అని అంటూ సింహంగా మారి పెద్దగా గర్జించాడు.

విఘ్నేశ్వరుడు, "సింహమా! నువ్వు జగజ్జనని వాహనానివి, నిన్ను గౌరవిస్తున్నాను!" అన్నాడు.



సింహం మళ్ళీ గర్జించి ఉరకబో తూంటే, విఘ్నేశుడు, "శివా, శరభా!" అని స్మరించాడు.

సింహానికి ఎదురుగా శివుని శరభావ తారం ఘీంకార గర్జనలు చేస్తూ నిలిచింది. శరభానికి సింహశరీరము, కేసరాలు, కోరలు ఉంటూ ఏనుగు తొండమూ, దంతాలు ఉన్నాయి. మహా సర్పంలాంటి తోక చివర జ్వాలలు కక్కే మకర ముఖము ఉంది. శరభం జూలు అగ్నిశిఖల్లాగా ఎగురుతున్నాయి. శరభం తొండంతో సింహం ముఖం వాచేలా కొట్టింది. సింహం తోకముడిచి పరుగు తీసింది. శరభావతారం మాయమైంది.

విఘ్నేశ్వరుడు తొండాన్ని యోజనం పొడవున సాగదీసి సింహం నడుము చుట్టి పట్టి ఎత్తాడు. సింహం కిరకిర లాడింది. ఆ సమయంలో ఆకాశగమనం చేస్తున్న నారదుడు 'సా' అని గొంతు సాగదీస్తూ, "సామజ వరవదనా!" అంటూ హిందోళ రాగాన్ని ఆలాపించాడు.

దేవతలు గుమిగూడి ఆకాశం నుండి వింత చూస్తున్నారు. విష్ణువు, "విజయ విఘ్నేశ్వరా! నువ్వు పట్టిన సింహాన్ని పెంచుకుంటాను, యివ్వవూ?" అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, "పెంచినట్టే పెంచి తలా, గోళ్ళూ తీసుకొని నరసింహావ తారం ఎత్తి హిరణ్యకశ్యపుణ్ణి చీలుద్దా మనా? అదేం కుదరదు. ఈ మృగరాజు అవసరం నాకు ఉంది, నీ నరసింహావ తారం నీవు చూసుకోవలసిందే!" అన్నాడు.

తొండం మూషికాసుర సింహాన్ని తిన్నగా తీసుకెళ్ళి మహాశ్వేత ముందు విడిచి అదృశ్యమైంది. మహాశ్వేత భర్తకు హితవు చెప్పినా వినకుండా నిజరూపంతో విఘ్నేశ్వరుడితో ఢీకొనడానికి పరుగు తీశాడు. మహాశ్వేత దేవిని ప్రార్థించింది. దేవి కనిపించి, "నీ భర్త విఘ్నేశ్వరుడికి ఎలుక వాహనంగా చిరంజీవిగా ఉంటాడు. అలా రాసిపెట్టి వుంది. నీవు కూడా శ్వేత



ఛత్రానివై నీ భర్తతోబాటు కలకాలం విఘ్నేశ్వరుణ్ణి సేవిస్తూ ఉంటావు!'' అని చెప్పి అంతర్ధానమైంది.

వజ్రదంతుడు కామరూపి గనుక, ఈసారి ఏనుగుల్ని తన్నుకుపోగల గండ భేరుండపక్షి రూపంతో, దారిలో కనిపించిన రెండు ఏనుగుల్ని గోళ్ళతో పట్టుకుని ఎగిరి వెళ్తూండగా చెలరేగిన అలజడికి, చిన్న గ్రద్దరూపంతో ఒక చెట్టుమీద హరిని ధ్యానిస్తూ ఉన్న గరుత్మంతుడికి ధ్యాన భంగమైంది. కోపంతో గ్రద్ద గండ భేరుండాన్ని ముక్కుతో పొడిచింది. ఆ పోటుకు వజ్రదంతుడు నిజరూపంతో నేలకూలాడు.

గరుత్మంతుడు, ''ఇంతకంటె రుచి కరమైన ములుకుపోట్లు తినబోతున్నావు. వెళ్ళు!'' అంటూ ఎగిరిపోయాడు.

మూషికాసురుడు వెళ్ళి విఘ్నేశ్వరు డితో, ''నీకూ ఉన్నాయి, పెద్దదంతాలు, వెలక్కాయలు నొక్కి తినడానికి తప్ప మరెందుకూ పనికిరావు. నా దంష్ట్రలతో వజ్రాల్ని పిండి చేస్తాను, కైలాసాన్ని గుల్ల చేస్తాను, తెలుసునా!'' అన్నాడు.

వినాయకుడు దిక్కులు చూస్తూ, తనలో తాను గొణుక్కుంటూన్నట్లుగా, ''ఔనౌను, ఎందుకూ కొరగాని దంతాలు ఉండి ఎందుకూ?'' అంటూ ఒక దంతాన్ని పటుక్కున సగానికి విరిచి, పారేసినట్టుగా విసరేశాడు.

ఆ దంతం గాలిలో గిర్రున తిరుగుతూ ఇంద్రజాలం ప్రదర్శించి వెళ్ళి వజ్ర దంతుణ్ణి గుచ్చిగుచ్చి పొడవడం ప్రారం భించింది. రక్తం ధారలుకట్టి కారసాగింది. మహాశ్వేత అది చూడలేక మూర్ఛ పోయింది. వజ్రదంతుడు చిన్న ఎలుకగా మారి తుర్రున పారిపోయి రాళ్ళమధ్య కలుగు చేసుకొని దూరాడు. ఒక దంతాన్ని విరుచుకొని విఘ్నేశ్వరుడు ఏకదంతుడు అనిపించుకున్నాడు.

దంతం కూడా కలుగులో దూరి ఎలు కను అలా పొడుస్తూనే వెంబడించింది.

తోకవెంట రక్తం జాడ కడుతుంటే ఎలుక సొరంగం దొల్చుకుంటూ పాతాళానికీ, పాతాళం నుంచి భూమ్మీదకూ వచ్చి పరుగులు తీసి లోకమంతా చుట్టి చివరకు విఘ్నేశ్వరుడి శరణుజొచ్చి, "నా కా చావు రాదు. నీ దంతం గుచ్చిగుచ్చి చంపుతున్నది, బాధ తప్పించు దేవా!" అని వేడుకున్న మూషికాసురుడికి విఘ్నేశ్వరుడు అభయం యిచ్చాడు. దంతం వచ్చి అతని హస్తం అలంకరించింది.

విఘ్నేశ్వరుడు, "మూషికా! చూట్టానికి చిట్టెలుకవే గాని మహాబలుడివి. మహా కూర్మావతారంతో మంథరపర్వతాన్ని, ఆది వరాహావతారంతో భూమిని ఎత్తిన విష్ణువు కంటె బలశాలివి! తగిన వాహనం కుదరక నేను నా లంబోదరంతో నడవలేక అవస్త పడుతున్నాను. నీ లాంటి...." అంటూ చెప్పడానికి సందేహిస్తున్నట్టు నసిగాడు.

విఘ్నేశ్వరుడి పొగడ్తకు మూషికాసురుడు పొంగిపోయి, "స్వామీ! నీ దంతం నా లోని అజ్ఞానాన్ని పారదోలి గుచ్చి గుచ్చి జ్ఞానాన్ని నింపింది. నీకు వాహనం కావడం నా భాగ్యంగా భావిస్తున్నాను," అంటూ ఏనుగంత ఎలుకగా పెరిగాడు.

విఘ్నేశ్వరుడు దానిపై కాలు మోపి కూర్చోబోగా మహా మూషికం కీచుకీచుమంటూ అణుక్కుపోయింది.



విఘ్నేశ్వరుడు, "నాయనా మూషికా, నీవు చిట్టెలుకగా ఉంటేనే నన్ను సునాయాసంగా మోయగలవు. నా ఆకారానికి చిట్టెలుక వాహనమే అన్ని విధాలా అమరుతుంది," అన్నాడు.

మూషికాసురుడు యథాప్రకారంగా చిట్టెలుకగా తగ్గిపోయాడు. విఘ్నేశ్వరుణ్ణి ఎక్కించుకొని చకచకా చుట్టూరా తిరుగుతూ, "ఔను స్వామీ! ఇప్పుడు నిన్ను మోస్తున్నట్టే లేదు!" అన్నాడు.

మూర్ఛనుండి తేరుకొన్న ధవళ విఘ్నేశ్వరుడికి నమస్కరించి, "దేవా! నా భర్త నీకు చిట్టెలుక వాహనంగా ఉంటాడు, నేనుకూడా నీకు శ్వేతఛత్రమై



''ఔను దేవా! నేనూ అలాగే కోరదా మనుకున్నాను. నేను వజ్రదంతుడిగా నా ముందర దేవతలచేత అలాగే చేయి స్తూండేవాణ్ణి. నీ వాహనాన్నై కృతార్థుడి నైయ్యాను!'' అని మూషికుడు అన్నాడు.

ధవళ తెల్లని గొడుగుగా విఘ్నేశ్వరుడిపై నిలిచింది. ఆ దంపతులు చిరంజీవులై వినాయకుణ్ణి అలాగే సేవిస్తూ ఉంటారు. విఘ్నేశ్వరుడు మూషిక వాహనుడయ్యాడు.

విష్ణువు, విఘ్నేశ్వరుడితో, ''ఏకదంతా! మూషికోత్తమ వాహనా! నీ వాహనం చూస్తే నాకు అసూయగా ఉందోయి. ఎంత మంచి వాహనాన్ని సంపాదించావు!!,'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''నీ కల్కి అవతారంలో నా వాహనం నీకు తెల్లని గుర్రమై అంతరిక్షాన్ని దాటి గ్రహాంతరాలకు తీసుకెళ్తుందిలే! మానవులకు కొత్త వలస రాజ్యాలను సమకూర్చు!'' అన్నాడు.

విష్ణువు, ''ఆహాహా! నీ నోటి చలవ వల్ల అలాగే జరగాలి!'' అని ఆనందించాడు.

నారదుడు, ''విజయవిఘ్నేశ్వరా! ఇప్పటికి నీతోబాటే విష్ణువు తొమ్మిది అవతారాలు తెలిశాయి, ఒక్కటి మిగిలింది!'' అన్నాడు.

విష్ణువు నారదుణ్ణి చూసి కన్ను గీటి, ''త్వరలోనే ఆ కళ్యాణ ఘడియ వచ్చి

ఉంటాను, ఈ వరం అనుగ్రహించు,'' అన్నది.

విఘ్నేశ్వరుడు, ''అమ్మా! నీ తెల్లని గొడుగు చల్లనినీడ నాకు రక్ష! నా భాగ్యం కొద్దీ దొరికింది," అంటూ ఎలుకను చూసి, ''వజ్రదంతా, దేవి అనుగ్రహం పొందిన సాధ్వి ధవళ మాటకు తిరుగులేదు. నా వాహనంగా ఉండు, నాతో బాటే నాకు పెట్టేవన్నీ, నువ్వూ తిను! అందరూ మొట్టికాయలు పెట్టుకొని, మూడు గుంజీలు తీసి లెంపలేసుకుంటూంటే, తృప్తిగా ఉంటుంది. నా ముందు, నీ ముందు కూడా అలాగే అంతా చేస్తూంటారు!'' అన్నాడు.

నప్పుడు అదీ తెలుస్తుందిలే! తొందరెందుకు,'' అన్నాడు.

''ఎవరి కళ్యాణం దేవా ?'' అని అడిగాడు నారదుడు.

''మన కళ్యాణ చక్రవర్తి విజయ విఘ్నేశ్వరుడిదే!'' అన్నాడు విష్ణువు.

విఘ్నేశ్వరుడు చిరుకోపంగా చూశాడు. ''వెయ్యి విఘ్నాలు కల్పించుకోక తప్పదు!'' అని గట్టిగా అనుకున్నాడు.

''నాయన్నాయన, అంతటితో సరి పెట్టు! వెయ్యి విఘ్నాలు పూర్తి అయ్యాక అరవిఘ్నం అయినా కల్పించుకోడానికి చెల్లేదిలేదు సుమీ!'' అని విష్ణువు హెచ్చరించాడు.

నారదుడు, ''వెయ్యి విఘ్నాలనగా ఏ మాత్రం? వెయ్యి విఘ్నాల తర్వాత విఘ్నేశ్వరుడి పెళ్లి తప్పదు-తప్పదు!'' సరిసరి మాగరి అని పాడుతూ ముల్లో కాలు తిరిగాడు.

శివుడికి పార్వతిపైగల మోహానురాగం తేజస్సుగా మారింది. అగ్నిదేవుడు దాన్ని తీసుకెళ్ళి శరవణ సరస్సు చేరేలాగ చేశాడు. ఆరు ముఖాలతో కుమారస్వామి అవతరించాడు. ఆరుగురు ఋషి భార్యలు అతణ్ణి పెంచి పార్వతీ పరమేశ్వరులకు అప్పగించారు. కుమారస్వామి పెరిగి పెద్దవాడైయ్యాడు. గరుత్మంతుడు అతనికి నెమలి వాహనం యిచ్చాడు. ఇంద్రుడు అతనికి ఎన్నో ఆయుధాల్ని ఇచ్చాడు. పార్వతి శక్తిబల్లాన్ని ఇచ్చింది. కుమారస్వామి పెరిగి పెద్ద అవుతూంటే తారకాసురుడు తల్లడిల్లిపోతూ భయంతో పీడకలలు కనసాగాడు.

కుమారస్వామి గొప్ప తపస్సు చేసి బ్రహ్మజ్ఞానాన్ని విడమర్చి చెప్పి సుబ్రహ్మణ్యస్వామి అనిపించుకున్నాడు. ఓంకారం గురించిన నిగూఢ రహస్యాల్ని శివుడంతటి, వాడికే గురువై ఉపదేశించాడు. అన్నదమ్ములైన విఘ్నేశ్వరుడు, కుమారస్వామి కైలాసంలో పార్వతీ శివుల కనుల పండుగగా ఎంతో సఖ్యంగా ఆట పాటలతో విహరిస్తున్నారు.





# విఘ్నేశ్వరుడు

ఒకనాడు నారదుడు కైలాసానికి వెళుతున్న దారిలో కంటకముఖి అనే ఒక యక్షిణి పరిహాసంగా, "నన్ను పెళ్లాడవయ్యా, నారదా! బ్రహ్మ చెర తప్పించుకోవయ్యా, బ్రహ్మకొడుకా!" అని అన్నది.

నారదుడు, "నేను కలహభోజనుడిని. కలహం వండిపెట్టగలది దొరకాలి గదా!" అన్నాడు.

"నేను, నీ కంటే జగడాలమారిని!" అంది యక్షిత.

ఆ సమయంలో విఘ్నేశ్వరుడూ, కుమారస్వామీ చెట్టాపట్టాలేసుకొని వస్తున్నారు. నారదుడు, "ఆ వస్తున్న అన్నతమ్ముళ్ళ మధ్య జగడం తేగలవా?" అన్నాడు.

"ఓష్! అదెంత!" అని కంటకముఖి పక్కనున్న దళసరోవరంలోకి దూకి బంగారు తామరపువ్వుగా మారి, "పార్వతీ పరమేశ్వరుల సుపుత్రుడి కోసం వికసించాను," అంటూ కిన్నెర మీటుతున్నట్లు పాట మొదలు పెట్టింది.

అన్నదమ్ములిద్దరూ దాన్ని పట్టుకొని నాది, నాది అని వాదులాడుతూ, "అమ్మ చేసిన బొమ్మవు నీవు, మురికి ముద్దవు!" అని కుమారస్వామి విఘ్నేశ్వరుణ్ణి ఆక్షేపిస్తే, "నువ్వు మురికిగుంట శరవణ శరస్సులోంచి వచ్చావు!" అని విఘ్నేశ్వరుడు కుమారస్వామిని ఎత్తిపొడిచాడు.

కుమారస్వామి పిడికిలి బిగించి పొడవబోయాడు. విఘ్నేశ్వరుడు తొండంతో

7. వేయి విఘ్నాలు




అతనిచేతి మణికట్టు బిగించాడు. ఇద్దరూ కలబడ్డారు. వినాయకుడు కుమారస్వామి నడుము తొండంతో బిగించి పైకెత్తాడు. కుమారస్వామి పైనుంచి బళ్ళాన్ని విఘ్నేశ్వరుడి బొజ్జకు గురిపెట్టాడు.

నారదుడు పరుగు పరుగున వచ్చి వారి కలహాన్ని నివారించి, "మీరిద్దరూ ఏదేనా పందెం పెట్టుకోండి," అన్నాడు.

కుమారస్వామి ఆలోచించి, "ఎవరు విశ్వాన్ని చుట్టి ముందువస్తే వారిదీ స్వర్ణ కమలం!" అన్నాడు.

"బాగుంది,!" అన్నాడు నారదుడు.

కుమారస్వామి వెంటనే నెమలి మీద విశ్వప్రదక్షిణానికి ఎగిరివెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు చతికిలబడి నిట్టూర్చగా నారదుడు, "ఏం విఘ్నేశా! నీ సంగతేమిటి?" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "ఎవరికెంత ప్రాప్తో అంతేగాని స్వర్ణకమలం నాకు రమ్మంటే వస్తుందా, నారదా! నా బొజ్జతో, చిట్టెలుక వాహనంతో, నే నెక్కడ? విశ్వప్రదక్షిణ ఎక్కడ? తమ్ముణ్ణే తీసుకోనీ కమలం!" అన్నాడు.

నారదుడు, "విఘ్నపతీ! విశ్వజననీ జనకులైన పార్వతీపరమేశ్వరులను దర్శిద్దామని వచ్చాను గానీ మళ్ళా వస్తాను," అని చెప్పి వెళ్ళాడు.

విఘ్నేశ్వరుడు చప్పున లేచి వెళ్ళి, ఒక తిన్నెపైకూర్చున్న పార్వతీశివుల చుట్టూరా ముమ్మారు ప్రదక్షిణ చుట్టి తమ్ముడి రాకకు ఎదురుచూస్తూ నిలబడ్డాడు.

చాలా సేపటికి ముప్పతిప్పలుపడి విశ్వప్రదక్షిణం చేసిన కుమారస్వామి నెమలి వాహనం దిగాడు. విఘ్నేశ్వరుడు తమ్ముణ్ణి కౌగలించుకొని, "తమ్ముడా, పాపం చాలా శ్రమలుపడి విశ్వం చుట్టి వచ్చావు; స్వర్ణకమలం నువ్వే వెళ్ళి తీసుకో. గెలవడం నేనే గెల్చానుగాని, నా కది అక్కర్లేదులే!" అన్నాడు.

కుమారస్వామి నివ్వెరపోతూ, "అదెలాగ?" అన్నాడు.

"నీ కంటే ముందు నేనే ముమ్మారు విశ్వప్రదక్షిణ చేసి నిలబడ్డాను, ఎవర్నడుగుతావో అడుగు!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

"విఘ్నేశ్వరుడే గెల్చాడు!" అని ఆకాశవాణి ముమ్మారు పలికింది.

కుమారస్వామి నిజం తెలుసుకొని, వినాయకుడి ముందుమోకరిల్లి, "అన్నా! నేను పెద్ద తపస్సు చేసి బ్రహ్మజ్ఞానం పొందానే కాని, చిన్న విషయంలో అజ్ఞానంలోనే పడ్డాను. నువ్వు కుశాగ్ర బుద్ధివి. నీ ముందు నేను ఎంత, నీ తరువాత వాణ్ణేగద! తారకాసురుడిపై యుద్ధానికి వెళ్తున్నాను, నన్ను ఆశీర్వదించు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు కుమారస్వామిని లేవదీసి, "తమ్ముడూ! నేను పెద్ద అనీ, నువ్వు చిన్న అనీ అనుకోవద్దు, నీవు కారణ జన్ముడివి! నీవు అన్నట్లుగా అమ్మ ఏదో ఆటగా చేసిన బొమ్మనే నేను; నీ కోసమే పార్వతీశివుల కళ్యాణం జరిగింది. వారి అనురాగఫలానివి! నీకు విజయం ఎప్పుడో రాసిపెట్టే ఉంది. తారకాసురుడు నీ చేతనే చావాలని వరం కోరుకున్నాడు. నీవు సుబ్రహ్మణ్యేశ్వరుడివి! నాకు అన్నిచోట్లా మామూలు గుళ్లు ఉంటాయిగాని, నీకు కొన్ని ప్రాంతాల్లో గొప్ప క్షేత్రాలు, పెద్దపెద్ద



ఆలయాలు, గోపురాలు ఉంటాయి. ప్రముఖ దైవమూర్తిగా ఆరాధింపబడతావు. శీఘ్రంగా వెళ్లి తారకాసురుడి బెడద వదిలించు!" అన్నాడు.

కుమారస్వామి దేవతలకు సేనాధిపతిగా తారకాసురుడిపై దాడి వెళ్ళాడు.

యక్షుల అధిపతి కుబేరుడు కంటకముఖిని పట్టి తెప్పించి, "ఓసీ, మాయల మారి పాపిష్ఠిదానా! శివుడి కుమాళ్ళకే కలహం పెట్టావు, పల్లేరువై పడిఉండు!" అని శపించాడు.

కంటకలత ప్రాధేయపడగా, విఘ్నేశ్వరుడి అనుగ్రహంవల్లనే శాపం తొలగుతుంది అని చెప్పాడు, కుబేరుడు. కంటక




ముఖి పల్లేరు ముళ్ల డొంకగా భూమ్మీద మొలిచింది.

కుమారస్వామి దేవతలకు సేనా నాయకుడై తారకాసుర నిర్మూలన చేశాడు. అతనికి దేవేంద్రుని కుమార్తె దేవయానను ఇచ్చి వివాహం జరిపించడానికి సర్వ సన్నాహాలు చేయబడ్డాయి గాని, అన్నకు కానిదే తమ్ముడికెలాగ చేయడం అన్నారు.

పార్వతి విఘ్నేశ్వరుడితో, "ప్రియ నందనా! తమ్ముడి పెళ్ళి జరగాలంటే నువ్వు పెళ్ళి చేసుకోవడం నీ ధర్మం!" అన్నది.

"ఎందుకమ్మా! ఇలాంటి అర్థం లేని నియమాలు? ఎవరి యిష్టానుసారం వారు చేసుకోకుండా తోకతెగిన నక్క సామెతగా నా లాంటి ఏకదంతుల్ని, ఏకాంతుల్ని రొంపిలోకి దింపటం మంచిది అనిపించు కోదు," అన్నాడు విఘ్నేశ్వరుడు తొలి విఘ్నంగా.

విఘ్నేశ్వరుడు యిలా ఎన్నోసాకులూ, విఘ్నాలూ కల్పించుకొంటూ వచ్చాడు.

ఒకసారి చాలా పట్టుదలతో పార్వతి పెళ్లి చేసుకోమని తొందర పెట్టింది. "అమ్మా! నేను తపస్సు చేయాలి! తమ్ముడు చేశాడు గాని నేను చేయ లేదుగా," అని విఘ్నేశ్వరుడు తపస్సుకి బయలుదేరాడు.

ఇంద్రుడు అప్సరసలందర్నీ విఘ్నేశ్వరుడి తపోభంగం చేయండని పంపాడు. అర్క అనే అప్సర నిరాకరించింది. ఇంద్రుడు, "నువ్వు మాలకాకివి, అంట రాని జిల్లేడువై భూమ్మీద మొలు!" అని శపించాడు.

విఘ్నేశ్వరుడు తపస్సు చేయడానికి అనువైనచోటు వెతికివెతికి ఎన్నుకున్నాడు. ఆ ప్రదేశంలో పల్లేరుడొంకలు నేలంతా విస్తరించి ఉన్నాయి. జిల్లేడు పొదలు మొగ్గలు నిండుగా తొడిగి విచ్చుకుంటూ వున్నాయి. విఘ్నేశ్వరుడు తపస్సు సాగిస్తున్నాడు. అప్సరసలు అక్కడకు చేరి నాట్యం మొదలు పెట్టారు.

వాళ్ళ కాళ్ళకు పల్లేరుకాయ ముళ్ళు గుచ్చుకొని పడిపోతుంటే ఒంటినిండా పల్లేరుముళ్ళు గుచ్చుకుంటూంటే మూలుగుతూ ఆర్తనాదాలు చేశారు. విఘ్నేశ్వరుడికి ధ్యానభంగమై జరిగింది చూశాడు. పల్లేరుతీగపట్ల అభిమానం కలిగింది. అప్సరసలు భయంతో పడుతూ లేస్తూ కుంటుకుంటూ పారిపోయారు. పల్లేరుగా మొలిచిన యక్షిణి కంటకముఖి, "స్వామీ! మీ అన్నతమ్ముళ్ళకు తగువు పెట్టి కుబేరుడి శాపం పొంది ఇలా పడి ఉన్నాను, అనుగ్రహించు!" అని వేడుకుంది.

ఆ రోజు సరిగా భాద్రపద శుక్ల చవితి, వినాయకచవితి రోజే. విఘ్నేశ్వరుడు కంటకముఖి శాపం తొలగించి, "వినాయకచవితినాడు నీ పల్లేరు ముళ్ళ కాయలను వికటవినోదంగా ఉపయోగిస్తారులే!" అని చెప్పాడు.

యక్షిణి అలకాపురి చేరుకుంది. అప్పుడు జిల్లేడు, "స్వామీ! నన్ను కూడా అనుగ్రహించండి. ఇంద్రుడి ఆజ్ఞ నిరాకరించి శాపం పొంది అంటరానిదాన్నిగా ఇలా పడి ఉన్నాను. నేనెందుకూ కొరగానిదాన్ని, అర్క అనే అప్సరసను, నీయందు భక్తి శ్రద్ధలు గలదాన్ని!" అంది.

విఘ్నేశ్వరుడు జిల్లేడుతో, "అంటరానితనం అంటూ ఏదీ సృష్టిలో లేదు. నీ మొగ్గల్ని, పువ్వుల్ని నేను ప్రీతితో





మాలగా ధరిస్తాను! నీవు ద్వాపర యుగంలో కుబ్జవై పుడతావు. కృష్ణుడు నిన్ను ఏలుకుంటాడు. నీ శాపం పోయింది. సుఖంగా స్వర్గం వెళ్ళు. ఇంద్రుడి వల్ల గాని మరెవ్వరివల్ల గాని నీ కెటువంటి భయమూ ఉండదు, ఏ శాపమూ తగలదు. జిల్లేడు వేళ్ళు ఆయుర్వేద ఔషధాలకు ఉపయోగపడతాయి. జిల్లేడాకులు సూర్యుడికి ప్రీతిగా ఉంటాయి!'' అని చెప్పాడు.

అర్క అప్సరరూపంతో స్వర్గాన్ని చేరుకుంది.

విఘ్నేశ్వరుడు కైలాసానికి తిరిగి వెళ్ళాడు. ''నాయనా, తపస్సు ముగిసింది కదా,' మరి పెళ్ళి........'' అని పార్వతి అంటూండగా, ''ముగియడమేమిటి? అసలు జరగనేలేదు. తిరిగి తపస్సు కెళుతున్నా!'' అని చెప్పి విఘ్నేశ్వరుడు మరో చోటు ఎన్నుకున్నాడు. ఆ ప్రదేశమంతా పాములపుట్టల మయంగా ఉంది. చుట్టూ వలయంగా పుట్టలున్నట్టు చూసుకొని తపస్సు మొదలుపెట్టాడు. పుట్టల్లోంచి పాములు నిటారుగా లేచి పడగలు విప్పి బుసలుకొడుతూ కాపలా కాయసాగాయి. ఇంద్రుడు మూషికాసురుడి అనుచరులైన రాక్షసులకు, ''మీ యజమానిని వాహనంగా చేసుకొన్న విఘ్నేశ్వరుడు మిమ్మల్నందర్నీ నిర్మూలించడానికి తపస్సు చేస్తున్నాడు. పగ తీర్చుకోండి!'' అని కబురు పెట్టి ఉసిగొల్పాడు.

రాక్షసులు వినాయకుడి మీద దాడి చేయగా మహాసర్పాలు పాతాళం నుంచి కట్టలుగావచ్చి వాళ్ళ పొగరు అణిచాయి. చచ్చినవాళ్ళు చావగా మిగిలినవాళ్ళు తమ తెలివి తక్కువను నిందించుకొంటూ ఇంద్రుణ్ణి తిడుతూ అక్కడి నుంచి పారిపోయారు.

ఇంద్రుడు మంచి ఉల్లాసవంతులైన దేవతా పురుషుల్ని, వారితో అప్సరసలను కలిపి పంపుతూ, ''విఘ్నేశ్వరుడికి రాగోదయం కలిగేలాగ మీ ప్రతాపం చూపండి!''

అని ఆజ్ఞాపించాడు. వాళ్ళ వెనుకనే వజ్రాయుధం పట్టి వెళ్ళాడు.

దేవతలు అప్సరలతో జంటజంటలుగా సురసేవిస్తూ కోలాహలంచేస్తూ ఆటపాటలు మొదలు పెట్టారు, నాగులు బుసకొడుతూ విరుచుకుపడి వాళ్ళను చుట్టుకొని కోరలతో కాట్లువేయసాగాయి. ఇంద్రుడు నాగులపై వజ్రాయుధాన్ని ఝుళిపించాడు. నాగుల కోపం రెచ్చిపోయింది. నాగలోకం నుంచి బిలబిలమని మహాసర్పాలన్నీ వచ్చి దేవతల్ని స్వర్గానికి తరిమాయి. దేవతలకూ నాగులకూ చిన్న యుద్ధం లాంటిది జరిగింది. ఇంద్రుడి వజ్రాయుధాన్నే లక్ష్యపెట్టకుండా నాగులు స్వర్గాన్ని ముట్టడించి గగ్గోలు పుట్టించి మరీ వెళ్లాయి. విఘ్నేశ్వరుడు నాగుల సహాయానికి సంతసించి పాములను ఎత్తుకొని ముద్దాడి, అలంకారాల్లాగ మీద వేసుకొని కైలాసానికి వెళ్ళాడు.

పార్వతి అతని పాముల వాడి వాలకం చూసి నివ్వెరపోయింధి.

"అమ్మా! తండ్రి సొత్తు తనయుడికి సంక్రమించడం సహజమైందేగదా! శంకరాభరణాలు నాకు భూషణాలే! అదీగాక పాములు నాకు ప్రాణమిత్రులై ప్రాణాలకు తెగించి కాపుకాశాయి. ఆప్తమిత్రుల అండదండలే కదా నిజమైన దండకడియాలూ, అమూల్యాభరణాలూను! అందుకే నాగభూషాయ అనిపించుకున్నాను!" అని విఘ్నేశ్వరుడు చెప్పాడు.

శివుడు చిరునవ్వులు ఒలికించాడు. పార్వతి వినాయకుడి వింత చేష్టకు విసుక్కుంది. ఆ విధంగా వినాయకుడు విఘ్నాలు తెచ్చిపెట్టుకుంటూ వచ్చాడు.

పార్వతి మళ్ళీ మరొకసారి బలవంత పెట్టింది. "అమ్మా! ఏదైనా ఘనకార్యం చేస్తేనే గదా సమర్థుడనిపించుకుంటారు! నే నేదైనా చేసి తమ్ముడి లాగ ఘనుడననిపించుకోనిదే ఎలాగ పెళ్లిచేసుకోమంటావు?" అన్నాడు విఘ్నేశ్వరుడు.

"నీకేంతక్కువ నాయనా? సమర్థుడివి కాక వాజమ్మవా ఏమిటి!" అందిపార్వతి.





# విఘ్నేశ్వరుడు

కుమారస్వామికి తన పెళ్ళి ఆగిపోవడానికి కారణమైన విఘ్నేశ్వరుడి మీద గుర్రుగా ఉంది.

ఒకనాడు అతడు తల్లితో, "వాజమ్మ కాక జేజెమ్మ ఎలాగౌతాడమ్మా అన్న! నలుగుముద్ద తిండిముద్దకే గాని ఘన కార్యం చేయగలడా?" అన్నాడు ఎకసక్కెంగా.

వినాయకుడు గుడ్లనీరు పెట్టుకొని, "చూడమ్మా! తమ్ముడు ఎంతలేసి మాటలంటున్నాడో..." అంటూ ఏడ్చినంత పని చేశాడు.

పార్వతికి కూడా కోపం వచ్చింది. వినాయకుణ్ణి అక్కున చేర్చుకొని బుజ్జగిస్తూ, "నాన్నా, నేను చేసిన బొమ్మవని వీళ్లకు అక్కసురా! తండ్రి చంపనే చంపేశాడు, తమ్ముడు ఇలాగ దెప్పుతున్నాడు. పోనీలే, వాళ్ళ అజ్ఞానం వాళ్ళకే తలవంపు!" అంది.

"తమ్ముడు అజ్ఞాని అయితే అవుతాడు గాని, నాన్నకు అజ్ఞానం ఏమిటమ్మా, నీ పిచ్చిగాని...." అన్నాడు గణపతి ఆశ్చర్యంగా.

పార్వతి ఏదో తలంచుకొని, "నాకు కాదురా పిచ్చి, ఆ శంకరమహాదేవుడికే పిచ్చి ఎక్కి విష్ణుదేవుడి జగన్మోహిని అవతారం వెంటబడి నవ్వులపాలవలేదా ఏమిటి!" అన్నది.

"ఆ తర్వాతేం జరిగిందమ్మా?" అన్నాడు గణపతి.

## 8. ప్రమథగణాధిపత్యం

"అదా సంగతి! భార్యారత్నాలు అంటే అంత భయంకరం అన్నమాట, అందుకే నేను పెళ్ళిచేసుకోనమ్మా!" అన్నాడు గణేశుడు.

కుమారస్వామి అందుకొని, "అదే నీ ఘనకార్యం! నేను యిప్పుడేపోయి సూర్యుణ్ణి చుట్టివస్తాను!" అంటూ నెమలి నెక్కి తుర్రుమన్నాడు.

విఘ్నేశ్వరుడు తిన్నగావెళ్లి మేరు పర్వతం ఎక్కి చిట్టచివర శిఖరాగ్రం మీద కూర్చున్నాడు.

మేరుపర్వతం చుట్టూరా సూర్యుడు తిరుగుతూంటాడు, అక్కడ సూర్యాస్తమయం అనేది ఉండదు.

కుమారస్వామి శ్రమపడి సూర్యుడి చుట్టూరా ప్రదక్షిణం చేసి వచ్చి అన్న మేరుపర్వతం ఎక్కి కూర్చున్నాడని తెలుసుకొని, విచారంగా ముఖం వేలవేసి ఊరుకున్నాడు.

"ఏం కుమారా, అలా తల వేలాడదీసుకున్నావు?!" అని పార్వతి ఆశ్చర్యపోతూ అడిగింది.

"అమ్మా! నేను సూర్యుడి చుట్టూరా తిరిగితే అన్న సూర్యుణ్ణే తన చుట్టూరా త్రిప్పుకొంటున్నాడమ్మా! నిజం చెప్పాలంటే అన్న చేసినదే ఘనకార్యం!" అన్నాడు కుమారస్వామి.



"ఏదో ఘోరమే జరిగింది, వాళ్ళిద్దరి మధ్యా ఒక భైరవుడనే కారు చీకటి లాంటి భూతపిల్లడు పుట్టాడట!" అంది తల్లి.

"భైరవు డెక్కడుంటాడమ్మా? వాణ్ణి చూడాలనివుంది!" అన్నాడు కొడుకు.

"ఎక్కడో ఉంటాడు. నల్లటి బట్టలు కడతాడట, వాడి దగ్గిరికి పొరబాటున కూడా వెళ్ళకుమీ, ఝడుసుకుంటావు!" అంది పార్వతి.

"ఝడుసుకోవడమంటే ఏమిటమ్మా? అది కూడా తెలుసుకోవద్దూ?" అన్నాడు గణపతి.

"పెళ్ళాడితే తెలుస్తుంది!" అంది పార్వతి.

కొద్దిరోజుల తర్వాత పార్వతి మళ్ళీ పెళ్ళి ప్రస్తావన తెచ్చింది.

"అమ్మా! సౌందర్యంలో నీకు సమఉజ్జీ అయిన సుందరి కనిపిస్తే పెళ్లాడాలని ఉందమ్మా!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

పార్వతి చురక తగిలినట్లు పెదవి కరుచుకొని, "అలాగైతే ఇంటి మొగసాల కూర్చొని, దారివెంట వచ్చేపోయే వాళ్లను చూస్తూండరా, కుంకా!" అంటూ కదిలింది.

"అలాగే తల్లీ! నీ ఆజ్ఞ!" అని వినాయకుడు వీధిలో కూర్చుని కొంతసేపు తూర్పుకి మరికొంతసేపు ఉత్తరంకూ, అలాగ ఎనిమిది దిక్కులకూ ముఖంపెట్టి చూడసాగాడు.

పార్వతి అతని వింత చేష్టకు వింతగా చూసి, "ఏం నాయనా, కనిపించిందా?" అని అడిగింది.

విఘ్నేశ్వరుడు, "అమ్మా! ఏ దిక్కు చూచినా నాకు మరేదీ కనిపించలేదు. జగజ్జననివైన నీవే ఎనిమిది చేతులతో ఎనిమిది దిక్కులా కనిపిస్తున్నావమ్మా!" అన్నాడు.

పార్వతిఆనందంతో మైమరిచిపోయింది. "నాయనా! విఘ్నరాజా! అందరు దేవుళ్లూ తూర్పుముఖంగా ఉండి పూజలందుకోవాలని నియమం ఉంది గాని, నీవు ఎటు ముఖంపెట్టి ఉన్నా ఆరాధనీయుడవే!" అని వరం యిచ్చింది. అతని పెళ్ళి మాటే మర్చిపోయి, ముద్దులకొడుకు మురిపెంపు





మాటలు శివుడితో ఒకటికి రెండుసార్లు చెప్పి చెప్పి ఆనందించింది.

చివరకు పార్వతి పట్టుబట్టి పెళ్ళి ప్రస్తావన తెచ్చింది. "అమ్మా! తమ్ముడు దేవసేనాధిపతి పదవిలో ఉన్నాడు, అతను ఇద్దర్ని పెళ్ళాడినా తగును. నేను ఊరికే తింటూ కూర్చున్నాను. ఎలా పెళ్ళి చేసుకునేది ?" అన్నాడు విఘ్నరాజు.

శివుడు, "నువ్వు నా ప్రమథగణా లన్నిటికీ గణనాథుడివిగా ఉండు!" అన్నాడు.

"నాన్నగారూ! ఉండమంటే సరా ? అర్హత ఉండాలిగదా! తమ్ముడు ఎలాగూ సేనాధిపత్యంలో ఆరితేరి ఉన్నవాడు, ఉండనే ఉన్నాడుగదా!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

ప్రమథులు కుమారస్వామినే అభిమానించారు. శివుడు, "లేదు, నా గణాలకు గణనాథుడుగా విఘ్నేశ్వరుడే ఉండాలి! కుమారస్వామికి దేవసేనాధిపత్యం ఉండనే ఉంది, అదీగాక రెండు పనులు చూసుకోవడం శ్రమ కూడా!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "నాన్నగారూ, ఏదేనా పరీక్షపెట్టి నెగ్గినవారికే గణనాయకత్వం యివ్వడం సమంజసంగా ఉంటుంది గదా!" అన్నాడు.

దేవతలు, ప్రమథులు కలిసి ఒక షందెం పెట్టారు. ఈ భూమ్మీదున్న అన్ని క్షేత్రాల్ని, తీర్థాల్ని ఎవరు ముందు సేవించి తిరిగివస్తారో వారు గెల్చినట్టు అని.

కుమారస్వామి నెమలి మీద ఎగిరి వెళ్ళాడు. వినాయకుడు చక్కా చతికిల బడి కూర్చున్నాడు.

అప్పుడు విష్ణువు అతణ్ణి ఏకాంతానికి తీసుకెళ్ళి, "నాయనా! మేము నిన్ను అభిమానిస్తున్న వాళ్ళం. నీ ఓటమి మా దేవతలందరి ఓటమీ అవుతుంది. మాకు తల వంపులు తేవడం నీకు భావ్యంకాదు. అదీగాక తండ్రి గొప్పదనం తనయుడు నిరూపించితేనే జన్మసార్థకత అవుతుంది. నువ్వేమీ తిరగనక్కరలేదు. నేను చెప్పి

నట్టు చేస్తే చాలు!" అని విఘ్నేశ్వరుడి చెవిలో రహస్యం ఉపదేశించాడు.

పార్వతి 'హమ్మయ్య' అనుకుంటూ విష్ణువును కృతజ్ఞతగా చూసింది.

విఘ్నేశ్వరుడు మఠం వేసి కన్నులు మూసి శివపంచాక్షరీ మంత్రాన్ని జపిస్తూ కూర్చున్నాడు.

కుమారస్వామి వెళ్ళినచోటల్లా అంత కంటే ముందే విఘ్నేశ్వరుడు ఎలుక మీద వచ్చి తీర్థమాడి సేవించి వెళ్ళినట్లు తెలుసుకొని ఆశ్చర్యపడుతూ హతాశుడై తిరిగి వస్తూనే తాను ఓడిపోయినట్లూ విఘ్నేశ్వరుడిదే విజయమని చెప్పాడు.

విఘ్నేశ్వరుడు తమ్ముడితో చేతులు కలిపి శివుడి వద్దకు తీసుకెళ్లి, "తమ్ముడూ! నేను జయించనూ లేదు, నీవు ఓడనూ లేదు. మనం ఇద్దరం నిమిత్తమాత్రులం. జయించింది నాన్నగారే! శివపంచాక్షరీ మహిమ అలాంటిది. గెలిచినది శివనామం గెలిపించింది విష్ణువు!" అని జరిగింది చెప్పాడు.

విఘ్నేశ్వరుడు కుమారస్వామి చేరో పాదమూ పట్టుకొని తండ్రికి మ్రొక్కారు.

కుమారస్వామి అందరి మధ్య నిలబడి, "విఘ్నేశ్వరుడికి ప్రమథ గణాధిపత్య పట్టాభిషేకం సత్వరమే జరగాలి, శివుని ఆజ్ఞ అందరికీ శిరోధార్యము!" అని నొక్కి చెప్పాడు.

దేవతలు సంతోషించారు. సిద్ధ, సాధ్య, యక్ష, భూత గణాల వారంతా హర్షం





ప్రకటించారు. ప్రమథగణప్రముఖులైన భృంగీశ్వర, శృంగీశ్వర, చండీశ్వర, నందీశ్వరులు మాత్రం వ్యతిరేకించారు. లోగడ పుత్రగణపతి రూపంతో వాళ్ళను విఘ్నేశ్వరుడు శృంగభంగం చేశాడు.

ఆ అక్కసుతో వారు, "కుమారస్వామికి తన బలాలు అంటూ దేవగణ సేనలు ఉన్నాయి, మేము శివుడి నమ్మిన బంట్లుగా శివగణంగా మొదటినుంచీ పరిగణింపబడుతున్నాం. అటువంటప్పుడు విఘ్నేశ్వరుడు మాకు అధిపతి ఎలాగ అవుతాడు? గణపతి అనిపించుకోడానికి కూడా అతనికి తనది అంటూ ఎలాంటి బలగమూ లేదు, గణాధిపత్య పట్టాభిషేకం దేనికి?" అని కుళ్ళు వెళ్ళబోసుకున్నారు.

శివుడు కళ్ళెర్రజేశాడు. "నా నిర్ణయాన్నే అధిక్షేపించగలంత గొప్పవారైపోయారా మీరు!" అని ప్రమథనాయకుల్ని ఈసడించుకున్నాడు.

విఘ్నేశ్వరుడు శాంతంగా, "ఔను, ఔను, నిజమే నా గణాలు ఎక్కడ? ఏవీ? లేవు, లేవు కాబోలు! అన్నట్టు పుత్రగణపతిగా ఉన్నప్పుడు నాకూ కొంత బలగం ఉన్నట్లు అనుమానం, ఆ గణాలు ఎక్కడ? ఎక్కడ?" అని అరిచాడు.

అప్పుడు కోటానుకోట్ల విఘ్నేశ్వరుడిలాంటి వారు దిక్కులు ఈనినట్లు పుట్టుకొచ్చి దిక్కులు పిక్కటిల్లేలాగ జయజయధ్వానాలు చేస్తూ విఘ్నేశ్వరుడి బలాలుగా వచ్చి నిల్చున్నారు.

వారందరికీ తలా నాలుగు చేతులున్నాయి. నాలుగు చేతుల్లో అనేక ఆయుధాలు, పరికరాలు, చిత్రవిచిత్ర వస్తుజాలమూ ఉన్నాయి. కొందరి చేతుల్లో గంటాలు, లేఖినులు, కుంచెలు, రంగులు ఉంటే మరికొందరి చేతుల్లో శూలాలు, విల్లమ్ములు, కత్తులు, గదలు ఉన్నాయి. కొందరు కొడవళ్ళు, సుత్తులు, కత్తులు, రంపాలు, ఉలులు, శేనాలు పట్టుకొని ఉన్నారు. మరికొందరు వీణలు, మృదం

గాలు, వేణువులు, డప్పులు వాయిస్తు న్నారు. మూలికలు, ఔషధాలు, పానీ యాలు, నాగళ్ళు, రాట్నాలు, నవరత్నా భరణాలు, పూలమాలలు, పండ్లూ, తిను బండారాలు మొదలైనవెన్నెన్నో పట్టుకొని ఉన్నారు. వారి మధ్య దేవుళ్ళూ దేవతలూ ప్రమథాదిగణాలవాళ్ళు బియ్యంరాశిలో రాళ్ళలా అక్కడక్కడ కనిపించారు.

విఘ్నేశ్వర రూపులు కొందరు ఆకా శంలో ఎగురుతూ అంతరిక్షానికి దూసుకు పోతున్నారు. ఆ గణాధిపగణాల చేతుల్లో ఛత్రచామరాలు, వీవనలు, వింజామరాలు ఆడుతున్నవి. ఆకాశంలో రెపరెపలాడు తున్న అరుణారుణపతాకాల్ని, ఇంకా అనేక రంగురంగుల ధ్వజాల్ని పట్టుకొని ఉన్నారు. వారు రత్నభూషితమైన పెద్ద భద్రసింహాసనాన్ని తెచ్చారు. విఘ్నేశ్వ రుణ్ణి దానిపై కూర్చుండబెట్టి ఛత్రచామ రాలు పట్టారు. శ్వేతఛత్రం ముత్యాల జాలరులతో ప్రకాశించింది. చిట్టెలుక సింహాసనం కింద చిందులు వేసింది.

పార్వతి మరొకసారి మళ్ళీ మైమరిచి భద్రసింహాసనాశీనుడైన విఘ్నేశ్వరుడికి నమస్కరించబోయింది. "అమ్మా! అమ్మా! వద్దు, నీ ముద్దుల కుమారుణ్ణి." అని విఘ్నేశ్వరుడు వారిస్తూ చేతు లూపేసరికి అంతా అదృశ్యమై, విఘ్నేశ్వ రుడు ఒక్కడూ వినయంగా తల్లికి ప్రణమిల్లాడు.

"విఘ్నేశ్వరా!" అన్న పిలుపు శంఖ ధ్వనిలా వినిపించింది. ఆ పిలిచింది విష్ణువు. విఘ్నేశ్వరుడు అటు చూడ కుండానే, "నువ్వు చెప్పబోయేది నాకు తెలుసు!" అన్నాడు.

"నీకు తెలిసినా, అది అందరికీ కూడా తెలియాలికదా, అదే చెబుతున్నాను!" అంటూ విష్ణువు, "విఘ్నేశ్వరుడి పెళ్ళి వేయి విఘ్నాలసామెతగా విఘ్నేశ్వరుడు కల్పించుకొన్న విఘ్నాలు ఇప్పటికి వెయ్యీ పూర్తయ్యాయి! ఇటు పైని విఘ్నం కల్పించుకోడానికి వీల్లేదు, కల్పించుకొన్నా చెల్లదు!" అని గట్టిగా పలికాడు.





# విఘ్నేశ్వరుడు

గణాధిపత్య పట్టాభిషేకానికి పార్వతి ధగధగమెరిసే రంగుబట్టల్ని ఎన్నిక చేసింది. కాని, విఘ్నేశ్వరుడు తెల్లని వస్త్రాలు ధరించాడు.

"మంచి బట్టలు వేసుకోవలసిన సమయంలో శుక్లాంబరధరుడు అనిపించుకున్నావేమయ్యా?" అన్నది పార్వతి.

"మంచి బట్టలు కదమ్మా వేసుకోవాలి? అవే వేసుకున్నానమ్మా. తెలుపు మంచితనాన్ని, వివేకాన్ని తెలుపుతుంది!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

పట్టాభిషేకం జరిగింది. విఘ్నేశ్వరుడు గణనాథుడు అయాడు. జయలక్ష్మి పేరు గల సిద్ధి, విద్యావతి పేరు గల బుద్ధి విఘ్నేశ్వరుణ్ణి వరించి ఇరుపక్కలా చేరారు. గణనాథుడు సిద్ధి బుద్ధి వినాయకుడు అనిపించుకున్నాడు. అదే సమయంలో ఎనిమిది దిక్కుల నుండి అష్టసిద్ధులు ఎనమండుగురు చక్కని కన్యలై వచ్చి వకుళమాలలు వేసి, వినాయకుణ్ణి వరించారు. విఘ్నేశ్వరుడు సిద్ధివినాయకుడు అనిపించుకున్నాడు. కళ్యాణ మహోత్సవాలు వైభవంగా జరిగాయి.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, "కోటి విఘ్నాలు వచ్చినా వినాయకుడి పెళ్ళి ఆగదు! అనే కొత్త సామెత అమలు జరిగింది. ఓ కళ్యాణగణేశా! ఇక నీ చేతిమీదుగా కళ్యాణాలు జరగాలి. అలా జరిగిన కళ్యాణఫలంగా అవతరించిన జన్మేజన్మ!" అన్నాడు.

9. స్వామి అవతరణ



విఘ్నేశ్వరుడు, "అలాగే జరుగుతుందిలే. కౌసల్యకు రాముడివై అవతరించి రావణదశ అంతం చేద్దువు గాని!" అని అన్నాడు.

మళ్ళీ విష్ణువు, "గజాననా! నీ ప్రసన్న వదనం చూస్తుంటే ఏనుగ అంటే మక్కువగా ఉందోయి!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "మొసలి బారి నుండి గజేంద్రుణ్ణి రక్షించి కరివరదుడు అనిపించుకుందువులే!" అన్నాడు.

ఎనమండుగురు సిద్ధి కన్యలు చామర వింజామరాలు వీస్తూండగా, సింహాసనంపై సిద్ధి బుద్ధులతో చుక్కల్లో చంద్రుడి లాగ విఘ్నేశ్వరుడు ప్రకాశిస్తున్న ఆ సమయంలో, లక్ష్మి ముఖం తిప్పుకొని వెళ్ళిపోబోతూంటే విష్ణువు ఆమెను ఆపి, విఘ్నేశ్వరుడితో, "సిద్ధివినాయకా! లక్ష్మి స్థిరమైనదికాదు అని వాదుపడుతున్నది. నీ ఒడిలో కాస్త కూర్చుండనియ్య! లక్ష్మికి స్థిరత్వం సిద్ధిస్తుందని ఆశిస్తున్నాను!" అని అన్నాడు.

విఘ్నేశ్వరుడు మహానందంతో, "తల్లి మహాలక్ష్మిని ఒడిపట్టే నా అదృష్టం ఎంత గొప్పది!" అని అంటూ లక్ష్మి పాదాలను తొండంతో చుట్టి తన కుడి తొడ మీద కూర్చుండబెట్టుకొన్నాడు.

అప్పుడు విష్ణువు, "ఇప్పుడు విఘ్నేశ్వరుడు 'లక్ష్మిగణపతి'. తల్లి కుమారుణ్ణి ఏవిధంగా కనిపెట్టుకొని ఉంటుందో అలాగే విఘ్నేశ్వరుడి అనుగ్రహం ఉన్న చోట లక్ష్మి స్థిరంగా ఉంటుంది," అని చెప్పాడు.

నారదుడు, "ఓహో, విఘ్నేశ్వరుడికి ఎన్ని పేర్లు! సిద్ధివినాయకుడు, లక్ష్మిగణపతి, శుక్లాంబరధరుడు-ఇంకా ఎన్నో ఎన్నో", అని అంటూ మహతివీణను వాయిస్తూ, "జయ జయ జనగణనాయక జయహే!" అని గానం చేస్తూ లోకాలన్నీ తిరిగాడు.

ఒకనాడు విఘ్నేశ్వరుడు ఎలుక వాహనంపైన ఆకాశమార్గంలో పయనిస్తూ

వింధ్య పర్వతశ్రేణిని దాటి, ఇంకా దక్షిణంగా వెళ్ళి ఒక పెద్ద నల్లని కొండ దగ్గిర దిగాడు. కొండ దిగువనే శబరులు డోళ్లు, డప్పులు కోలాహలంగా వాయిస్తూ పెద్ద సంబరం జరుపుకొంటున్నారు.

విఘ్నేశ్వరుడు తన రూపాన్ని ఉప సంహరించుకొని అందమైన కుర్రవాడి రూపంతో ఉత్సవాన్ని సమీపించాడు.

శబరులు కుర్రవాణ్ణి చుట్టుముట్టి, "దేవర తనకోసం మంచి చిన్నోడిని పంపినాడు!" అంటూ ఎత్తుకుపోయి ఉత్సవం మధ్యలో దింపారు.

అక్కడ రక్తపుచారలతో పెద్ద నల్లని గండశిల ఉన్నది. ఎదురుగా ఒక పసివాడు మూగగా ఏడుస్తూ ఉన్నాడు. ఆ పిల్లవాడి ఒంటి నిండా పసుపు రాసి, మొలకు నల్లని గుడ్డకట్టి, ఎర్రని మందార మాలతో అలంకరించారు.

విఘ్నేశ్వరుడు శబరనాయకుడితో, "మీ దేవరతో నేను మాట్లాడాలి, నన్ను అతని దగ్గిరికి తీసుకెళ్ళండి!" అన్నాడు.

శబరనాయకుడు పకపకా నవ్వుతూ, "బలే చిన్నోడివే! మా స్వామితో నే మాటలాడతావా? మా స్వామి కారు చీకటి లాగ మహాభీకరంగా ఉంటాడు. ఎవరూ చూళ్ళేరు. చూస్తే రక్తం కక్కుకొని అలాగే చచ్చిపోతారు!" అన్నాడు.



విఘ్నేశ్వరుడు నవ్వి, తటాలున వెళ్ళి గండశిలను సమీపించి, "మీ భయాన్నే మీ స్వామికి అంటగట్టి భయంకరంగా ఉంటాడని అనుకుంటున్నారు. భయాన్నే భక్తి అంటున్నారు. మీలో ఉండే క్రూర స్వభావమే బలిగా తయారైంది. ఇదంతా తప్పు! మీరెవ్వరూ మీ స్వామిని చూసి ఎరగరు. మీ స్వామి ఎన్నడూ ఇలాంటి ఉత్సవాల్ని, బలినీ కోరలేదు. మీ స్వామి ఎంతో అందంగా ఇలాగ ఉంటాడు," అని చెబుతూ అరచేత్తో రాతిని తట్టాడు. నల్లని బండరాయి తెల్లని అరటిదవ్వ లాంటి అందమైన స్వామి విగ్రహంగా మారింది. మునుకులపై చేతులు చాచి



కూర్చున్న స్వామి విగ్రహం నవ్వు ముఖంతో మనోహరంగా కనిపించింది. విఘ్నేశ్వరుడు పసివాడి తల నిమిరాడు.

ఆ పిల్లవాడు గొంతెత్తి, "స్వామీ, నీవే శరణం!" అంటూ విగ్రహం ముందు మోకరిల్లి స్తోత్రం మొదలు పెట్టాడు.

నల్లరాయిస్వామి విగ్రహంగా మారడమూ, మూగపిల్లవాడు గొంతెత్తి మాటలు పలకడమూ రెప్పపాటున జరిగాయి.

ఆ ద్భుతాలకు శబరులు నివ్వెరపాటుతో చేతులెత్తి, భయంభయంగా విఘ్నేశ్వరుడికి మ్రొక్కారు.

కుర్రవాడి రూపంతో ఉన్న విఘ్నేశ్వరుడు వారిస్తూ, "నన్ను కాదు మీరు మ్రొక్కవలసింది. మీ స్వామిని భయాన్ని విడిచి ప్రేమతో కొలవండి; మీరు నమ్మిన దేవరను తండ్రిలాగ, అన్నలాగ, స్నేహితుడి లాగ చూసుకోండి. బలులు మొదలైన చెడ్డపనులు మానేసి ఫలపుష్పాలతో, అరటి తోరణాలతో ఆనందంగా పండగలు చేసుకోండి. ఈ మాటలు వచ్చిన పిల్లవాడే మీకు గురువుగా, స్వామి పూజారిగా ఉంటాడు. నేను మీ స్వామి దగ్గరకు వెళ్తున్నాను. మీ స్వామి మీకు దర్శనమిస్తాడు!" అని చెప్పి చరచరా కొండను ఎక్కుతూ వెళ్ళాడు.

శబరులు కొంతవరకు అతనిని అనుసరించి వెళ్ళి ఆగిపోయారు.

విఘ్నేశ్వరుడు కుర్రవాని రూపంతోనే పర్వతాగ్రానికి చేరాడు. అక్కడ భైరవస్వామి తలవాల్చుకొని విచారంగా కూర్చుని ఉన్నాడు. అతని శరీరం కారునల్లగా ఉన్నది.

విఘ్నేశ్వరుడు పరుగున వెళ్ళి భైరవుణ్ణి రెండుచేతులా చుట్టి ఆలింగనం చేసుకొన్న క్షణంలోనే భైరవుడి శరీరం తెల్లగా వెన్నెలకాంతితో ప్రకాశించింది.

దివ్యమంగళరూపాన్ని పొందిన భైరవుడు కుర్రవాణ్ణి ఆనందంతో కౌగలించుకొని, "నీవు విఘ్నేశ్వరుడివి! నాకు తెలుసు. నీ అనుగ్రహంతో నా కారుదనం

పోయి దైవత్వం సిద్ధిస్తుందని నేను అవత రించినప్పుడు ఆకాశవాణి చెప్పింది. ఈ కొండ ఎక్కడానికి ఎవ్వరూ సాహ సించరు. నన్ను చూసి పక్షులు కూడా ధ్వని చెయ్యవు. నన్ను నేనే అసహ్యించు కొంటూ నీ కోసం ఎంతకాలంనుంచో నిరీ క్షిస్తూ ఉన్నాను. నీ నిజరూపంతో నా కన్నులకు విందు చెయ్యి!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు నిజరూపాన్ని పొంది అతనితో, ''ఇకనుండి నీవు దైవంగా ఆరా ధింపబడే స్వామివి! శివకేశవులిద్దరూ నీలో ఉన్నారు. నీ గురించి అమ్మ చెప్పి నప్పట్నించి నిన్ను కలుసుకోవాలని తహ తహ పడుతూనే ఉన్నాను. మోహం చీకటిలాంటిది! శివుడు మోహపరవశుడై జగన్మోహినీ రూపం ధరించిన విష్ణువు వెంటబడ్డాడు. శివ, విష్ణువుల తేజస్సులు ఒకటిగా కలసి నీ అవతరణం జరిగింది. అందువలన నీకు నల్లని రూపు వచ్చింది. ఇప్పుడు నీ అంత దివ్యమంగళ సుందరు డైన స్వామి వేరొకడు లేడు! శబరులకు ఒకసారి కనిపించు!'' అన్నాడు.

తరవాత కుర్రవాని రూపంతో శబరుల దగ్గిరికి వచ్చి, ''మీ స్వామి విగ్రహం ముందు మోకరిల్లి ఏకకంఠంతో 'స్వామీ! శరణం!' అని పిలవండి. మీ స్వామి మీకు కనిపిస్తాడు! పిలిచినప్పుడల్లా



పలుకుతాడు. పంటలు పండించండి. ఇళ్ళువాకిళ్ళు పల్లెలు కట్టుకొని సుఖంగా మనుష్యుల్లాగ జీవించండి. మీ స్వామి అండదండలెప్పుడూ మీకు రక్షగా ఉంటాయి. వెళ్ళండి!'' అని చెప్పి అదృశ్యమయాడు.

శబరులు నివ్వెరపోయి దణ్ణాలు పెట్టి, విగ్రహం దగ్గరకు చేరుకొని స్వామిని నోరారా పిలుస్తూ మ్రొక్కారు. దివ్య సుందరరూపంతో స్వామి వారికి సాక్షాత్క రించి చిరునవ్వులతో అభయముద్ర పట్టి వారిని ఆశీర్వదించి అంతర్ధానమయాడు.

అప్పటి నుంచి శబరులు ఏటేట మార్గ శిరమాసంలో అరటిచెట్టు బోదెను, లేత



ఆకును అనేక విధాలుగా ఉపయోగించి స్వామికి మంటపాలనూ, పందిళ్ళనూ అలంకరణచేసి, బలులు మొదలైనవి మాని సాత్వికారాధనతో స్వామిని భయం లేని భక్తితో అర్చిస్తూ, నాగరికులై విద్యా వంతులై ఉన్నత మానవత్వాన్ని సాధించారు. స్వామి నివసించిన కొండపై గొప్ప ఆలయాన్ని శిల్పకళానిలయంగా నిర్మించి సంగీత నృత్యకవితలతో అలరించి గర్వించదగ్గ మానవజాతిగా రూపొందారు.

కుర్రవాని రూపంలో వచ్చిన దెవరో శబరులకు తెలియదు. వారి దేవర స్వామియే ఆ రూపంలో వచ్చి తమ అజ్ఞానాన్ని తొలిగించి అనుగ్రహించాడని అనుకున్నారే గాని విఘ్నేశ్వరుని లీల అని ఎరగరు. విఘ్నేశ్వరుడు అలాగ ఎరుకపడి ఉంటే విఘ్నేశ్వరుడే దేవుడని ఆరాధన మొదలుపెట్టి, తమ స్వామినే విస్మరించుతారని విఘ్నేశ్వరుడు అజ్ఞాత బాలకుడి గానే ఉండిపోయాడన్న సంగతి స్వామి పదేపదే తలంచుకొని మనసారా విఘ్నేశ్వరుణ్ణి స్మరిస్తూండేవాడు. కైలాసానికి వెళ్ళి విఘ్నేశ్వరునితో, కుమారస్వామితో ఆనందం పంచుకోవాలని ఉవ్విళ్ళూరేవాడు.

విఘ్నేశ్వరుడు శబరులను సంస్కరించి మూషిక వాహనుడై ఆకాశ మార్గంలో క్రిందకు చూస్తూ ఉత్తరదిశగా తిరుగు ప్రయాణం చేస్తున్నాడు. కొండచరియలన్నీ కీకారణ్యాలతో నిండి ఉన్నాయే గాని భూమి అంతా బీడుపడిన మైదానంలాగ కనిపించింది. జలసమృద్ధి ఉంటే కనులపండుగగా పైరుపచ్చగా ఉండవలసింది కాని, నీటి కొరత తీర్చే నదులు లేక సౌభాగ్యశూన్యంగా భూములు వెలవెల పోతున్నవి. ప్రజలు ఆకాశాన్ని మబ్బుల్ని నమ్ముకొని ఏదో ఒకలాగ జీవయాత్ర సాగిస్తున్నారు.

"గంగమ్మ లాంటి నది కలిగిన ఉత్తరదేశ ప్రజలు ఎంత పుణ్యం చేసి పుట్టారో! అంత గంగ మనకు లేకపోయినా

అందులో ఒక పాయ మనకు ఏ దేవుడైనా కనికరించి ఇవ్వగూడదా? ముక్కోటి దేవుళ్లున్నారంటారు, ఎందుకూ? ఒక్కరికీ జాలిలేదు," అంటూ సామాన్యప్రజలు అనుకుంటున్న మాటలు వినిపిస్తూనే ఉన్నాయి విఘ్నేశ్వరుడి పెద్ద చెవులకు.

అటు పడమటి దిక్కున ఎత్తైన పర్వత శ్రేణులు, ఇటు తూర్పున చిన్న చిన్న కొండల బారుతో నిండి ఉన్న భూభాగాలు విశాలంగా తూర్పు సముద్రం వరకూ ఊరికే వున్నాయి. ఎక్కువమంది జనులు జంతువుల్నీ, పక్షుల్ని వేటాడి తింటూ ఆటవిక జీవనం సాగిస్తున్నారు. సేద్యం మీద ఆధారపడ్డవారు అగచాట్లు పడుతూనే ఉన్నారు. సముద్రం మీద ప్రాణ భీతి విడిచి చేపలుపట్టే జాలరులు విశేషంగా కనిపించారు. చాలీచాలని మేతతో పశుగణాలు బక్కచిక్కి దీనంగా కనిపించాయి. తూర్పు తీరం పొడవునా జాలరిపల్లెలే కనిపించాయి గాని మంచి ఊళ్ళు లేవు.

ఉత్తరభూమితో పోల్చి చూస్తే విఘ్నేశ్వరుడికి చాలా విచారం కలిగింది. హిమాచల సీమలో ఎటు చూసినా సుందర జలపాతాలతో, రమణీయ సరోవరాలతో, నదీ నదాలతో మనోహరంగా కనిపించే పచ్చని ప్రకృతి కళకళలాడుతూ ఆనంద దాయకంగా ఉంటుంది. ఇక్కడ పడమటి పర్వతాలు దిష్టిబొమ్మల్లాగ బోడిగా ఉన్నాయి.

ఆ పర్వతశ్రేణి నడుమ సహ్యాద్రి చేరువనున్న లోయలో గౌతముడి ఆశ్రమం మసిబొగ్గుల్లో మరకతం లాగ ఆకుపచ్చగా మెరుస్తున్నది. విఘ్నేశ్వరుడికి ఏదో ఆలోచన వచ్చినట్లుగా తలపంకించాడు. ఎలుకను వేగం పెంచమని హెచ్చరికగా తట్టి దక్షిణాదిని, వింధ్యను దాటి ఉత్తరాదిని చేరుకున్నాడు. ఉత్తరభూమి దూరానికి అంతా ఏదో కొత్తగా ఉన్నట్టు కనిపించింది.

సమీపించేసరికి అక్కడ అంతా అయోమయంగా ఉంది.





# విఘ్నేశ్వరుడు

గంగా పార్వతుల మధ్య ద్వేషం వర్ధిల్లుతుండగా, గంగాపుష్కరం వచ్చింది.

నారదుడు పార్వతితో, "ముక్కోటి దేవతలు వారి వారి మహత్తులు, శక్తులు గంగాజలానికి సంక్రమించేలాగ పుష్కర స్నానాలు చేస్తున్నారు. అమ్మా గౌరీ! నీవు కూడా అలాగ చేస్తే, విశాల హృదయం గల మంచిదానివి నీవేనని, లోకం నిన్నే మెచ్చుకుంటుంది!" అని చెప్పి అలాగే వెళ్ళి, గంగతో, "గంగాభవానీ! నిన్ను పావనం చేద్దామని పార్వతి విజయం చేస్తున్నది, తెలుసా!" అన్నాడు.

"అలాగా! దయాదాక్షిణ్యాలు చాటుకుందామని వస్తున్నదా, రానీ చెపుతాను," అన్నది గంగ.

పార్వతి పూలు జల్లి గంగలో దిగబోతూంటే, "ఆగు! నన్ను మలిన పర్చకు!" అని గంగ ఆటంకపరిచింది. ఇద్దరికీ గొప్ప వివాద సంవాదం జరిగింది.

"కుమారస్వామిని శరవణ సరస్సు కన్నది; నీ అవిటి చేతుల్లో నలిగిన బొమ్మ బాబు, పాపం, గజముఖుడయ్యాడు; నీవు మాత్రం ఒట్టిగొడ్రాలివి!" అన్నది గంగ.

"నేనెవర్నో తెలుసా, పరమశివుని అర్ధాంగిని, భాగేశ్వరిని!" అన్నది పార్వతి.

"తెలియకేం, కట్టుకున్న అమాయకుణ్ణి సగం తినేసిన పరమ పాతకివి?" అన్నది గంగ.

"జారిపడిన భ్రష్టురాలివి నువ్వు!" అన్నది పార్వతి.

## 10. గోదావరి అవతరణ



"హాలాహలం గొంతు దిగకుండా మింగిన తాపాన్ని చల్లార్చితే మెచ్చి, నచ్చి, మనోహరకుసుమసుకుమారిగా తలను దాల్చిన జగద్రక్షకుడికి ఇష్టురాలినో, భ్రష్టురాలినో లోకానికి తెలుసు!" అంది గంగ.

"ఎవరో పిలిస్తే వస్తూ చిక్కులుపడిన అర్భకురాలివి, పల్లమాలిన సుకుమారితనం దేనికి?" అన్నది పార్వతి.

"నువ్వలాగే అంటావులే! బలులు కోరే జాలిలేని అమ్మతల్లివి! వామాచారిణివి, మలినవు, అంటరాని మాతంగివి, మోటుదానివి, శక్తివి!" అని గంగ గడగడా అనేసింది.

"బాగా గుర్తు చేశావు గంగా! ఔను, నేను శక్తిని, మహాశక్తిని!" అంటూ పార్వతి ఆవేశం పొందింది. ప్రళయ ప్రభంజనాలు వీచాయి. చీకట్లుకమ్మాయి. మెరుపులతో ఆకాశం గర్జించింది. పిడుగులుపడ్డాయి. భూమి కంపించింది. మంచుశిఖరాలు కరిగాయి.

పార్వతి ఆవేశానికి గంగ పరిహాసం చేస్తూ, "చాల్లే! చల్లనిదాన్నికదా అని నన్ను చిన్నచూపు చూశావే కాని, నేను జలశక్తిని అన్న సంగతి మరిచావు; నన్ను రెచ్చగొట్టిన పాపం నీదే!" అంటూ గంగ హిమాలయ శిఖరాగ్రాల ఎత్తున పొంగింది. గంగానది పరవళ్లు తొక్కుతూ ఉత్తరభూమిని జలమయం చేసింది.

దేవతలు బారులు తీర్చి ఆకాశం మీది నుంచి జరిగిన బీభత్సాన్ని చూస్తూ, "అమ్మలు ఆడిపోసుకోవడం కాదుగాని ప్రళయం తెచ్చిపెట్టారు!" అని నిట్టూర్చి, కలహబీజం నాటిన నారదుణ్ణి ఒక్కుమ్మడిగా నిందించారు.

విఘ్నేశ్వరుడు దక్షిణం నుంచి తిరిగి వస్తూ, నారదుణ్ణి చూసి, "కలహభోజనా, కడుపు నిండిందా? ఎంత ఉపద్రవం తెచ్చిపెట్టావయ్యా!" అన్నాడు.

నారదుడు, "ఇలాంటి ఉపద్రవాలు వచ్చినప్పుడే కదా కడుపు నిండిన వినాయ

కులెవరో, లోకకళ్యాణం కోసం నడుము బిగించి పాటుపడే నాయకుడెవరో తెలిసేది!'' అని ఛలోక్తి విసురుతూ వెళ్లాడు. విఘ్నేశ్వరుడు కైలాసం చేరాడు.



కైలాసంలో పార్వతి పశ్చాత్తాపంతో తనలోతాను, ''మళ్లీ మరొక భగీరథుడు తర్లించుకుపోతేనేగాని గంగ ఉధృతం తగ్గదు!'' అని గట్టిగా అనుకున్నది.

ఆ మాటలు విఘ్నేశ్వరుడు విన్నాడు. ఏమీ ఎరగనట్టు పార్వతి ముంగిటకు వచ్చి పాదాభివందనం చేసి, ''అమ్మా, ఒక మంచి పని తలపెట్టాను, ఆశీర్వదించమ్మా!'' అన్నాడు.

''విఘ్నేశ్వరుడు తలపెట్టితే అడ్డేమిటి, నాయనా! ఇంతకూ నువ్వేదో దక్షిణంగా వెళ్లివచ్చినట్లున్నావు. విశేషమేమిటి?'' అన్నది పార్వతి.

విఘ్నేశ్వరుడు, ''ఏం చెప్పమంటావు? వింధ్యకు దిగువ అంతా శూన్యంగా ఉన్నది. ఆ ప్రదేశం అంతా పైరు పచ్చగా, నీ అన్నపూర్ణ నామధేయాన్ని పొందితే ఎంత బాగుంటుంది! అనిపించిందమ్మా. గంగమ్మ కాస్త అటు వెళ్ళి చల్లగా చూస్తేకాదా, ఏమంటావమ్మా?'' అన్నాడు.

పార్వతి, ''నేననేదేముందబ్బా, అంతా ఆ విశ్వనాథుడిదేకదా భారం!'' అన్నది.

విఘ్నేశ్వరుడు, ''అలా అని మనం ఊరికే చూస్తూండవలసిందేనా? మన ప్రయత్నం ఉండాలా వద్దా?'' అన్నాడు.

''తప్పకుండా ఉండాలి. అందునా నీలాంటివాడు పూనుకుంటే జరగనిదేముంది!'' అంది పార్వతి.

''ఆ మాట చాలునమ్మా, వెళ్ళి వస్తాను,'' అని పార్వతి పాదాలు తొండంతో కళ్ళకద్దుకొని వెళ్ళిన విఘ్నేశ్వరుడు, తిన్నగా గౌతమమహర్షి ఆశ్రమ ప్రాంతానికి చేరుకున్నాడు.

గౌతముడు పడమటి కనుమలనడుమ ఆశ్రమం ఏర్పరుచుకొని, అవసరం మట్టుకు సేద్యం చేసుకుంటూ ఉన్నాడు.



విఘ్నేశ్వరుడు చూలుతో ఉన్న ఆవుగా మారాడు.

పెరిగిన చేను తొక్కుకుంటూ మేస్తున్న ఆవును అదలించి తరిమే ప్రయత్నంగా గౌతముడు కమండలం నీరు అరచేత్తో విసిరాడు. ఆ నీటిచుక్కలు పడీపడ్డంతో ఆవు పడిపోయి గిలగిల తన్నుకొని కొయ్య బారింది. గౌతముడు తన సుకృతాన్నీ, తపస్సునూ ధారబోసినా మాయదారి గొడ్డు మూసినకన్ను తెరవలేదు.

నారదుడు దేవేంద్రుణ్ణి ఉసిగొలిపాడు. ఇంద్రుడికి గౌతముడి మీద తీరని పగ ఉంది. బ్రహ్మ అపూర్వసుందరిగా అహల్యను సృష్టిచేశాడు. ఇంద్రుడు చాలా ఆశపడ్డాడు. ఇంకా చాలామంది పోటీ పడ్డారు. భూదేవిని ప్రదక్షిణం చేసి ఎవరు ముందువస్తే, అహల్య అతనిదవుతుందని బ్రహ్మ పందెం పెట్టాడు.

గౌతముడు ప్రసవిస్తున్న ఆవు చుట్టూరా తిరిగి వచ్చి బ్రహ్మతో వాదించి ఒప్పించి అహల్యను భార్యగా గెల్చుకున్నాడు.

గోవు సాక్షాత్తూ భూదేవితో సమానమని చెప్పిన ఆ గౌతముడి చేతి మీదుగా గోహత్య జరిగింది! పగ తీర్చుకోడానికి మంచి అవకాశం వచ్చిందని ఇంద్రుడు గొప్ప మునిపుంగవుడి వేషంతో తిరిగి తిరిగి, "గౌతముడు గోహత్య చేసిన మహాపాపి! అతని ఆశ్రమం మైలపడిపోయింది. గౌతముడిని చూసినా, ఆశ్రమంలో అడుగు పెట్టినా మహాపాతకం చుట్టుకుంటుంది! గంగాజలాలు ఆశ్రమసీమలో ఆవు మీద నుంచి ప్రవహించాలే తప్ప వేరే పరిహారం ఏదీ లేదు!" అని లోకమంతా చాటి, సాటి మహర్షులను రెచ్చగొట్టాడు. ఋషులు గౌతముణ్ణి వెలివేశారు. ఆశ్రమవాసులంతా వెళ్ళిపోయారు.

ఎక్కడి గంగానది! ఎక్కడి పడమటి కనుమలు! అయినప్పటికీ గౌతముడు భగీరథుణ్ణి ఆదర్శంగా పెట్టుకొని గంగాదేవిని గూర్చి హిమాలయాల్లో గొప్ప తపస్సు చేశాడు.



కపిలమహాముని కోపాగ్నికి బూడిద పోగులైన తన తాతలను తరింపజేయ డానికి భగీరథుడు జలాధి దేవతయైన గంగాదేవిని తపస్సు చేసి మెప్పించి దివి నుండి భువికి దింపాడు. శివుడు తన జటాజూటంలో గంగను ధరించాడు, గంగ గంగాభవాని అనిపించుకుంది. గంగను ఒదలమని భగీరథుడు శివుణ్ణి ప్రార్థించాడు. శివుడు జడల ముడి సడలించి గంగను కొద్దిగా ఒదిలాడు. గొప్ప వేగంతో గంగ చిమ్ముకొచ్చి నలుదెసలా హిమాలయాల్లో పడింది. భగీరథుడి వెంట గంగ ప్రవాహంగా తూర్పు ముఖంగా వెళ్లింది. గంగకు భాగీరథి అని పేరు వచ్చింది.

హిమాలయాల్లో పడిన గంగ కొంత హిందూకుశ శిఖరాల మీదుగా పడమరకు ఇందు నదిగా ప్రవహించింది. ఇందు నదినే సింధునది అన్నారు. భరతఖండానికి వాయువ్యంగా ఉన్న సింధునది మూలంగా హిందూదేశ మనే పేరు వచ్చింది.

భగీరథుడి వెంట మహా వేగంగా వెళ్తూన్న గంగను తన ఆశ్రమం పాడవకుండా జహ్నుమహాముని తాగేశాడు. భగీరథుడు జహ్ను మునిని ప్రార్థించి గంగను విడుదల చేయించాడు. జహ్ను మహా ముని చెవి నుండి గంగ వెలికి వచ్చినందువల్ల గంగకు జాహ్నవి అనే పేరు కూడా వచ్చింది. తరవాత కపిలాశ్రమం చేరి, భగీరథుడి పితరుల మీదుగా ప్రవహించి తరింపజేసి భగీరథుడి ప్రయత్నాన్ని ఫలింపజేసింది.

భగీరథుడు కూడా అంత గొప్ప తపస్సు చేయలేదని గౌతముణ్ణి మెచ్చుకొని గంగ ప్రసన్నురాలై అదే విధంగా గౌతముడి వెంట బయలుదేరింది. దారి పొడవునా గంగాదేవి అడుగు జాడల్లో ఎన్నో యేర్లు, వాగులు పుట్టాయి.

గౌతమాశ్రమం చేరుతూనే గంగ నదీ ప్రవాహమై గౌతముడు దారి చూపుతూ ముందు నడుస్తూంటే, ఆవు మీది నుంచి

జలజలా పారి గలగలా ప్రవహించి గౌతమి అని పేరు పొందింది. మాయదారి ఆవు దిగ్గున లేచి నాలుగడుగులు వేసి, అలా పైకెగసి ఆకాశంలో అదృశ్యం కాగా విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించాడు.

విఘ్నేశ్వరుడు గంగకు నమస్కరించి, "అమ్మా! తనయుణ్ణి మన్నించు. నీ దయామృత జలాలతో వింధ్యకు దిగువ నున్న భూభాగమంతా సుభిక్షం కావాలని యింత పని చేశాను. దక్షిణ గంగగా అవత రించిన నీవు, గోవును బ్రతికించి ఇచ్చి నందువల్ల గోదావరి అని పేరు పొందు తావు!" అని చేతులెత్తి మ్రొక్కి అదృశ్య మయ్యాడు.

గోదావరి అనేక ఉపనదులతో తూర్పుగా పయనించి తూర్పు మైదా నాల్ని సస్యశ్యామలం చేసింది. సప్త ఋషులు, దేవతలు గోదావరిలో జలక మాడారు. గౌతముణ్ణి ఎన్నోవిధాల శ్లాఘించి అపర భగీరధుడు అన్నారు. గోదావరి సప్తగోదావరిగా చీలి తూర్పు సముద్రాన్ని చేరింది.

గంగ గోదావరి ప్రవాహంగా మారు తున్నప్పుడు, ఆమె నల్లని వేణీభరము విరజిమ్ముకొని పడమటి కనుమల్లో చిక్కు పడింది. విష్ణువు తన చేతి వ్రేళ్ళతో ఆ చిక్కు విడదీశాడు. కృష్ణవర్ణుడైన



విష్ణువు వ్రేళ్ల సందుల నుంచి కొప్పులోని నీరు జారుతూ కృష్ణవేణి, కృష్ణానది అని పిలువబడుతూ మరొక గొప్ప నది ప్రవహించింది.

అలాగే గంగాజలం ఆకాశంలో ఎగిరి, దక్షిణంగా ఉన్న కవేరమహాముని ఆశ్ర మంలో కమండలంలో పడి, కన్యగా పెరిగి, అగస్త్యుని వెంట అరణ్యాల్లో విహరిస్తూ, కావేరీ నదిగా మారి, అంద మైన జలపాతాలతో దక్షిణసీమలో ప్రవ హించింది.

ఆ విధంగా గౌతమమహర్షి తెచ్చిన గంగ మరొక మూడు గొప్ప నదులుగా దక్షిణ భారతభూమిని సుభిక్షం చేసింది.

గంగ, గోదావరి, కృష్ణ, కావేరి అని నదుల పేర్లు చెప్పుకోవడం పరిపాటి అయింది.

గౌతముని ఆశ్రమం తిరిగి కళకళ లాడింది. గోదావరి పొడవునా అనేక క్షేత్రాలు వెలిశాయి. గౌతముడి కీర్తి కూడా వ్యాపించింది. గంగ పడమటి కనుమలకు ప్రవహించడం అనేది అసంభవమైనది గనుకనే ఇంద్రుడు ఆ విధంగా పరిహారం చెప్పాడేగాని, అసంభవాన్ని సాధించి సంభవంగా మార్చిన గౌతముడి గొప్పదనాన్ని గుర్తించి క్షమాపణ వేడుకొన్నాడు.

గౌతముడికి మాత్రం సంతోషం లేక పోయింది. అదివరకే ఇంద్రుడి మోసం కారణంగా అహల్యను బండరాయిగా పడి ఉండమని శపించి, ఉత్తరదేశం నుంచి వింధ్య దాటి పడమటి చరియలో ఆశ్రమం కట్టుకుని ఒంటరిగా ప్రశాంతంగా తపస్సు చేసుకొంటున్నాడు. గోదావరి అవతరణంతో పడమటి కనుమల్లోని మునుల ఆశ్రమాలు మరింత శోభించాయి. అత్రి మహాముని త్రిమూర్తుల అంశలతో పుత్రవంతుడయ్యాడు. అనసూయ అతిథులకు నిరతాన్న దానం చేస్తూన్నది.

గౌతముడి ఆశ్రమం చుట్టూరా కూడా సస్యసమృద్ధి విశేషంగా ఉన్నా అహల్య లేని కొరత కనిపిస్తూనే ఉన్నది. తొందర పడి అహల్యను శపించినందుకు గౌతముడు మనస్సులో విచారిస్తున్న సమయంలో విఘ్నేశ్వరుడు కనిపించి, "గౌతమా! త్వరలోనే విష్ణువు రాముడై తన పాదం మోపి, నీ భార్యను మనిషిగా చేస్తాడు. పాషాణి పునీత అవుతుంది! గోదావరి అవతరణానికిగాను, నీకు చాలా శ్రమ ఇచ్చాను. గోదావరికి గౌతమి నామం చిరస్థాయిగా ఉంటుంది!" అన్నాడు.

గౌతముడు ఆ మాటలకు సంతోషంతో, "విఘ్నేశ్వరా! అంతా నీ సంకల్ప బలం వల్లనే కదా జరిగింది! గోదావరి జలాలూ, విఘ్నేశ్వరుని కృపా ఎల్లకాలమూ రక్షిస్తూ ఉంటాయి!" అన్నాడు.






# విఘ్నేశ్వరుడు

ఒకానొకప్పుడు లక్ష్మి మానససరోవరంలో జలకమాడుతూండగా, పార్వతి విష్ణువు వేషం ధరించి లక్ష్మిని సమీపించింది. నవమోహనంగా కనిపించిన నారాయణుని లక్ష్మి చూచింది. నారాయణుని వేషంలో ఉన్న పార్వతికి కూడా లక్ష్మి సౌందర్యం మనోహరంగా కనిపించింది. ఇద్దరూ సాభిప్రాయంగా చూసుకున్నారు. ఆ చూపుల కలయికలో సరోవరంలో ఒక స్వర్ణకమలం లేచింది. అందులో ధగధగ మెరిసిపోతున్న పసిపాప ఉన్నది.

లక్ష్మి, నారాయణుని దగ్గిరచేరి కౌగలించుకున్నది. పార్వతి పగలబడి నవ్వుతూ, "నేను నారాయణుడిని కాను, లక్ష్మి!" అని నిజరూపంతో కనిపించింది. లక్ష్మి, "అన్నకుతగ్గ చెల్లెలివే, నారాయణి అనిపించుకున్నావులే!" అన్నది.

పార్వతి, "అప్పుడు విష్ణువు మోహినీ రూపంతో శివుణ్ణి మాయబుచ్చినదానికి ఇది చెల్లువేసుకో!" అన్నది.

స్వర్ణకమలంలోని పసిదాన్ని చూసి ఇద్దరూ మురిసిపోయారు. అపార ప్రేమ పుట్టి చేతుల్లోకి తీసుకున్నారు. అప్పుడు విఘ్నేశ్వరుడు వచ్చి, "తల్లులారా! మీ ఇద్దరి అంశలతో అవతరించిన ఈ బిడ్డ పార్వతి పరంగా జయ, లక్ష్మి పరంగా శ్రీ కలిసి జయశ్రీగా పెరుగుతుంది. ఈమెకు వరుడు కూడా శివకేశవుల అంశలతో అవతరించి ఉన్నాడు!" అని చెప్పి, పసిదానితో ఉన్న స్వర్ణకమలాన్ని



కావేరీనదిలో ఉంచి రమ్మని వాయుదేవుడికి చెప్పాడు. వాయుదేవు డలాగే జయశ్రీని కావేరినదికి చేర్చాడు.

దక్షిణప్రాంతాన్ని పాలించే చక్రవర్తి స్వర్ణకమలంలో కనిపించిన బాలికను, వరప్రసాదంగా లభించిన పుత్రికగా తీసుకువెళ్ళి, నామకరణ మహోత్సవం జరిపించుతూండగా, ఆకాశవాణి "జయశ్రీ అని పిలవండి!" అని పలికింది. జయశ్రీ రాకుమారిగా పెరిగి ముల్లోకాల్లో అంత సౌందర్యవతి, సాహసవంతురాలు ఉండదనిపించుకొన్నది.

జయశ్రీకి రాజభవనం కంటె ప్రకృతి సౌందర్యంతో నిండి ఉండే అరణ్యాల్లో విహరించడమే యిష్టంగా ఉండేది. విల్లమ్ములు ధరించి, వన్యమృగాలను అదుపులో ఉంచుతూ తిరుగుతూండేది.

హరిహరాంశలతో అవతరించిన స్వామి కైలాసం వెళ్ళి, విఘ్నేశ్వరుణ్ణి, కుమారస్వామిని కలుసుకోవాలని ఎన్నాళ్ళుగానో అనుకుంటున్నాడు. ఒకనాడు అలాగే వెళ్ళాడు, స్వామి. విఘ్నేశ్వరుడు, కుమారస్వామి ఆనందంగా ముచ్చటలాడుతూ, మానససరోవర జలవిహారం చేస్తూండగా, విఘ్నేశ్వరుడు, "ఈ మానససరోవరంలోనే లక్ష్మి పార్వతుల తేజస్సులతో స్వామికి కాబోయే దేవేరి ఉదయించింది!" అని ఊరుకున్నాడు.

స్వామికి కుతూహలం కలిగినా అణుచుకొని, మరి కొంతకాలం అక్కడ గడిపి, వెళ్ళబోతున్నప్పుడు విఘ్నేశ్వరుడు, "స్వామీ! మా కంటె పెద్దవాడివైన నీవు బ్రహ్మచారిగా ఉండటం బాగా లేదు, సత్వరంగా నీకు కళ్యాణం తప్పదు!" అన్నాడు.

కుమారస్వామి, విఘ్నేశ్వరుడు స్వామికి ఘనంగా వీడ్కోలు యిచ్చారు. స్వామి నిజనివాసానికి చేరుకున్నాడు.

ఒకనాడు స్వామి వినోదంగా పెద్దపులి మీద స్వారి చేస్తూ అరణ్యంలో తిరుగుతూండగా, పులిని కదలనివ్వకుండా

మట్టూరా బాణాలు రివురివ్వున నాటుకున్నాయి. స్వామి బాణాలు వచ్చిన దిశగా కోపంగా చూశాడు. కోపం పటాపంచలైంది. విల్లమ్ములతో ఠీవిగా నిల్చుని చిరునవ్వు విసరిన జయశ్రీ కనిపించి, స్వామి గుండెలో బాణంలాగ గుచ్చుకొన్నది. స్వామి అంతర్ధానమయ్యాడు.

జయశ్రీకి స్వామిని గురించి విఘ్నేశ్వరుడు కలలో అదివరకే చెప్పి ఉన్నాడు. అతనికోసమే అరణ్యాల్లో తిరుగుతున్నది.

నారదుడి ఆదేశంతో, చక్రవర్తి జయశ్రీకి స్వయంవరం ఏర్పాటు చేశాడు. రాజాధిరాజులుగా మారు రూపాలతో ఇంద్రాది దేవతలు కూడా వచ్చారు. స్వామి ఒక సాధారణ శబరయువకుడి రూపంతో విల్లమ్ములు ధరించి, పెద్ద నల్లని కుక్కను వెంటబెట్టుకొని వచ్చాడు.

రాజాధిరాజులు ఠీవి ఒలకబోస్తూ శబర యువకుణ్ణీ, అతని పెంపుడు కుక్కనూ ఎకసక్కెం చేశారు.

స్వామి సింహద్వారానికి అడ్డంగా, అందర్నీ కారాగారంలో బందీలు చేసినట్లు కుక్క మీద కూర్చున్నాడు. కుక్క పెద్ద పులిగా మారింది. భయంకరంగా గాండ్రుమన్నది. జయశ్రీ స్వామిని గుర్తించి చరచరావచ్చి వరమాలవేసి వరించింది. స్వామి జయశ్రీని పులి మీద ముందు కూర్చుండబెట్టుకొన్నాడు. దేవతలకు కోపం వచ్చింది. శబరయువకుడి మీద ఒక్కుమ్మడిగా విరుచుకుపడి, ఆయుధాలు





తేశారు. స్వామి విల్లమ్ములు తీసి అంపర్నీ ఎదుర్కొన్నాడు.

అతని బాణప్రయోగధాటికి దేవతలు చెల్లాచెదరై, నిజరూపాలతో అస్త్రాలు ప్రయోగించారు. స్వామిని ఎలాంటి అస్త్రమూ తాకలేకపోయింది. ఇంద్రుడి వజ్రాయుధం కూడా పనికిమాలినదైంది. అప్పుడు స్వామి తన నిజరూపంతో హరి హర స్వామిగా సాక్షాత్కరించాడు. దేవతలు చేతులు మోడ్చారు, "శరణం స్వామీ!" అన్నారు.

స్వామి జయశ్రీల కళ్యాణం దేవాది దేవతల మధ్య మహా వైభవంగా జరిగింది. జయశ్రీతో స్వామి నిజనివాసానికి వెళ్లాడు.

త్రేతాయుగంలో ఆర్యావర్తంలో కోసలుడు, కేకయుడు, వసుమిత్రుడు అనే రాజులు ముగ్గురూ ఆప్తమిత్రులుగా ఉండేవారు. కోసలుడికి కౌసల్య, కేకయుడికి కైకేయి, వసుమిత్రుడికి సుమిత్ర అనే కుమార్తెలున్నారు. అయోధ్యను పాలించే దశరథుడికి తమ కుమార్తెలను యిచ్చి పెళ్ళి చేయాలని ముగ్గురు రాజులకూ ఏకాభిప్రాయం కలిగింది దశరథుడు అంగీకరించాడు.

ముగ్గురు రాజులూ జైమినిమహర్షి చేత వివాహానికి లగ్నం పెట్టించారు. జైమిని ముహూర్తం నిర్ణయించి, "నేను పెట్టిన ముహూర్తబలం ఎటువంటిదంటే, విఘ్నేశ్వరుడి సాక్షిగా ఈ ముగ్గురి వివాహం దశరథుడితో జరిగి తీరుతుంది! అయితే, వివాహం జరిగే ముందు రాకుమార్తెలకు రాక్షసగండం కనిపిస్తున్నది. కనుక, ముగ్గుర్నీ జాగ్రత్తగా ఉంచాలి!" అని చెప్పాడు.

ముగ్గురు కన్యలనూ రాజులు ఒక పెద్ద పెట్టెలో భద్రంగా దాచారు.

నారదుడు రావణాసురుడితో, "లంకేశ్వరా! అతి త్వరలోనే దశరథుడికి వివాహం కాబోతున్నది. దశరథుడి కుమారుడు నిన్ను హతమారుస్తాడు!" అని చెప్పాడు.



రావణుడు రాకుమార్తెలను ఎత్తుకు రమ్మని మహోదరుడు అనే గొప్ప రాక్షసుణ్ణి పంపాడు. మహోదరుడు కన్యలను పెట్టెలో భద్రపరిచినది కనిపెట్టి, ఆ పెట్టెను మింగేశాడు. వాడు ఆకాశ మార్గంగా సముద్రం మీదుగా లంకకు వెళ్తూండగా, కడుపునొప్పి వచ్చి పెట్టెను కక్కేశాడు. సముద్రంలో పడి పెట్టె కెరటాల మీద కొట్టుకుంటూ పోయింది.

దశరథుడు సముద్రం మీద దూర తీరాలకు వెళ్ళి పెద్ద నౌకలో తిరిగి వస్తున్నాడు. ప్రయాణం ఆలస్యమైంది. అనుకున్ననాటికి చేరలేకపోతున్నందుకు విచారిస్తూ, దశరథుడు సముద్రాన్ని చూస్తూండగా, నౌకవైపే కొట్టుకొని వస్తున్న పెద్ద పెట్టె కనిపించింది. పెట్టె నౌకను ఢీకొని పైకప్పు ఊడిపోయింది అందులో రాకుమార్తెలు కనిపించారు. తాళ్ళ నిచ్చెనలతో వాళ్ళను నౌక మీదకు రప్పించాక, ఆ ముగ్గురూ తాను వివాహం చేసుకోనున్న పెండ్లికుమార్తెలేనని దశరథుడు తెలుసుకున్నాడు. సరిగ్గా అదే సమయానికి జైమిని మహర్షి ముహూర్తం పెట్టాడు. అప్పుడు అక్కడ విఘ్నేశ్వరుడు ప్రత్యక్షమై, ముగ్గురు రాకుమార్తెలతో దశరథుడి వివాహం జరిపించి, అంతర్ధానమయ్యాడు. ముగ్గురు వధువులతో దశరథుడు ఆనందంగా స్వదేశం చేరుకున్నాడు.

చిరకాలానికి దశరథుడికి నలుగురు కుమారులు పుట్టారు. పెద్దవాడైన రాముడు కైకేయి కారణంగా సీతతో, లక్ష్మణుడితో అరణ్యవాసం వెళ్ళాడు. రావణుడు సీతను ఎత్తుకుపోయి లంకలో పెట్టాడు. రాముడు హనుమంతుడు, సుగ్రీవుడు మొదలైన వానరుల సహకారంతో లంకను ముట్టడించి, రావణసంహారం చేశాడు. సీతతో పుష్పకవిమానంలో బయలుదేరి, వారధి కట్టడం ప్రారంభించిన సముద్ర తీరంలో ఆగి, అక్కడ శివపూజ జరిపి, అయోధ్యకు వెళ్ళాలనుకున్నాడు.

శివలింగ ప్రతిష్ఠకు తగిన లింగాన్ని తీసుకురమ్మని హనుమంతుడిని కైలాసానికి పంపాడు. హనుమంతుడు మనోవేగంతో కైలాసం చేరుకొని, అక్కడ ఉన్న శివలింగాల్లో పెద్ద లింగాన్ని చూసి రెండు చేతులతో ఎత్తబోయాడు. లింగం కొంచమైనా కదల్లేదు. దానికంటె చిన్న లింగాన్ని తీయబోయాడు, అదీ కదల్లేదు. చివరికి అన్నిటికంటె చిన్న లింగాన్ని కూడా ఎత్తలేకపోయాడు.

కాలం మించిపోతున్నది. తన అసమర్థతకు హనుమంతుడు విచారిస్తుండగా, బుడిబుడి నడకలతో అక్కడికి ఒక పిల్లవాడు వచ్చాడు. "ఎవరయ్యా నీవు? హనుమంతుడి లాగే ఉన్నావు, కాని కావు!" అన్నాడు పిల్లవాడు.

"నేను హనుమంతుడినే! ఒక శివ లింగాన్ని తీసుకురమ్మని రాముడు పంపాడు. ఇంతకూ, నీవెవరవోయి, బాలుడా?" అన్నాడు హనుమంతుడు.

"ఇక్కడి లింగాలను ఎవరూ ఎత్తుకుపోకుండా నన్ను కాపలా ఉంచారు గాని, నీవు హనుమంతుడవని చెబుతున్నావు. హనుమంతుడు శివుని అవతారమే అనీ, పంచముఖాంజనేయుడనీ విన్నాను. నీ పంచముఖాలు ఏవీ?" అన్నాడు బాలుడు.



అప్పుడు హనుమంతుడు గరుడ, వరాహ, సింహ, అశ్వముఖాలను కలుపుకొని, పంచముఖాంజనేయుడై, ఉన్నతంగా పెరిగి పిల్లవాడితో నవ్వుతూ, "విఘ్నేశ్వరా! నా వంతు అయింది. పంచముఖ విఘ్నేశ్వర రూపంతో కనిపించడం నీ వంతు!" అన్నాడు.

అప్పుడు బాలుడి రూపంలో ఉన్న విఘ్నేశ్వరుడు, ఐదు తలలతో సమాన ఎత్తున పెరిగి విశ్వరూపంతో కనిపించాడు.

హనుమంతుడు పంచముఖ విఘ్నేశ్వరుడికి నమస్కరించి, "పిల్లవాడి రూపంతో వస్తున్నప్పుడే విఘ్నేశ్వరుడివని గ్రహించాను. శివలింగాలు కదలకుండా

చేసింది నీవేకదా? నీవే ఒక లింగాన్ని ప్రసాదించు!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "హనుమా! నీ పంచముఖ రూపం చూడాలని నేను ఇలా చేశాను. నీవు శివాంశతో పుట్టినవాడవు. నీకు అడ్డేమిటి? అయినా అడిగావు గనక విశేషాంశలు గల లింగాన్ని నీకు యివ్వాలనే, ఎంచి ఉంచాను, తీసుకువెళ్ళు," అని చెబుతూ, హనుమంతుడి దోసిట్లో గొప్పదైన జ్యోతిర్లింగాన్ని ఉంచాడు.

హనుమంతుడు మామూలు రూపంతో దోసిట్లోని లింగాన్ని పదిలంగా పట్టుకొని, రివ్వున ఎగిరి వెళ్ళాడు. అప్పటికి కాలాతిక్రమణ జరిగింది.

సమయం మించిపోకుండా సీతాదేవి ఇసుకతో శివలింగాన్ని చేసింది. రాముడు జలాభిషేకం చేసి, పూజకు ఉపక్రమించబోతూండగా, హనుమంతుడు లింగంతో అక్కడ వాలాడు.

హనుమంతుడు జరుగుతున్నది చూసి, తోకతో సైకతలింగాన్ని చుట్టి తీసి వేయబోయాడు. కాని ఇసుకలింగం చెక్కు చెధరలేదు. హనుమంతుడు మరింత తోక గట్టిగా బిగించి లాగితే తోక నొప్పి పెట్టిందే గాని లింగం కదల్లేదు.

అప్పుడు రాముడు హనుమంతుణ్ణి శాంతపరిచి, "హనుమా! బుద్ధిమంతులు కూడా ఒకొక్కప్పుడు పొరపాటు పడుతూంటారు సుమీ! అన్నీ తెలిసిన వాడివి, సైకతలింగమైనా, అది శివునికి ఆనవాలు కదా? ఇంతకూ, ఇప్పుడేం మించి పోయింది గనక, నీవు తెచ్చిన లింగాన్ని సైకతలింగం దాపునే ప్రతిష్ఠించి, పూజించి మరీ వెళతాను!" అని చెప్పాడు.

హనుమంతుడు తను తెచ్చిన లింగాన్ని రాముడికి యిచ్చి, లెంపలు వేసుకొని సైకతలింగానికి మ్రొక్కాడు.

రాముడు హనుమంతుడు తెచ్చిన లింగాన్ని ప్రతిష్ఠించి, యథావిధిగా పూజాక్రమం సీతతో కలిసి జరిపిన పిమ్మట, అందరితో పుష్పకం మీద అయోధ్యకు చేరి, పట్టాభిషిక్తుడయ్యాడు.





# విఘ్నేశ్వరుడు

వినాయకచవితి నాటి మునిమాపు వేళ విఘ్నేశ్వరుడు తన దంతం లాగే ఉన్న చంద్రుణ్ణి చూస్తూ, నిండు బొజ్జతో మందంగా అడుగులు వేస్తున్నాడు. చిట్టెలుక వెంట వస్తున్నది.

నెలవంక విఘ్నేశ్వరుడి సంకేతం అంటారు. విఘ్నేశ్వరుడి నుదుట తెల్లని మంచి గంధంతో తీర్చిదిద్దిన బాలచంద్ర తిలకం, ఆకాశం మీది చవితి చంద్రుడి ప్రతిబింబంలాగ ప్రకాశిస్తున్నది. ఫాల చంద్రుడు, బాలచంద్రుడు అని కూడ విఘ్నేశ్వరుడికి పేర్లున్నవి.

కాలి బొటన వ్రేలికి చిన్న రాయి తగిలి వినాయకుడు అమాంతంగా బోర్లా పడ్డాడు. కడుపు పగిలిపోయింది. తిను బండారాలు వెలికివచ్చి నేల విరజిమ్ముకున్నాయి. అదే అదనుగా ఎలుక వాటిని గబగబా తినసాగింది. ఆ వినోదానికి, ఆకాశపు చిరునవ్వులా ప్రకాశించే చందమామ పకపకా నవ్వాడు. దేవతలు మొదలైన వారంతా వచ్చి, పెద్ద సర్పంతో వినాయకుడి బొజ్జ కలిపి కుట్టారు.

పార్వతికి చంద్రుడి మీద చాలా కోపం వచ్చింది. ఆమె, ''వినాయకచవితి నాడు చంద్రుణ్ణి చూస్తే, నీలాపనిందలు వచ్చి పడతాయి!'' అని శపించింది.

అది మొదలు పిల్లల్ని సైతం చూడనివ్వకుండా వినాయకచవితి నాడు చంద్రదర్శనం కాకుండా, అంతా జాగ్రత్త పడుతూ వచ్చారు.

12. కృష్ణవినాయకీయం



ద్వాపరయుగం వచ్చింది. దేవకీ వసుదేవులకు చెరసాలలో పుట్టి, గోకులంలో యశోద ముద్దుల పట్టిగా పెరుగుతున్న బాలకృష్ణుడు పూతన, శకటాసురుడు, తృణావర్తుడు అనే రాక్షసుల్ని అప్పటికే చంపేశాడు, బాగా మాటలు నేర్చాడు.

ఆ రోజు వినాయకచవితి. యశోద పాలు పితుకుతున్నది. బాలకృష్ణుడు యశోద వీపుమీద నుంచి వంగి పాత్రలోని పాలలో ప్రతిబింబించిన చంద్రవంకను చూసి, "చందమామ! పాలల్లో చందమామ!" అంటూ చప్పట్లు చరిచాడు.

యశోద గతుక్కుమని, "ఎంత పని చేశావు కన్నా! ముందు, ముందు ఎన్ని నీలాపనిందలు పడవలసివస్తుందో మరి," అని నొచ్చుకుంది.

"నీలాపనింద అంటే ఏమిటమ్మా?" అన్నాడు కృష్ణుడు.

"ఉత్తినే నిన్ను దొంగ అంటారు!" అన్నది యశోద.

"విచారించకమ్మా! పాలు, వెన్న దొంగతనం చేస్తుంటానమ్మా, అప్పుడది నీలాపనింద అవదుగా!" అన్నాడు కృష్ణుడు.

"అరి పిడుగా! నీ నోట బ్రహ్మాండాలు విరుచుకు పడా!" అని అంటూ గోపమ్మ బుగ్గలు నొక్కుకున్నది.

"బ్రహ్మాండాలు చూశావామ్మా?" అని కృష్ణుడడిగాడు.

యశోద, "బ్రహ్మాండాలకేం గాని, పెద్దయినా నీ మీద అభాండాలు పడ్డం ఖాయం!" అంటూ సున్నితంగా బాలుడి తల మీద మొట్టికాయ పెట్టింది.

"అప్పుడు మళ్ళీ ఇలాగే చందమామను చూడాలి కదూ?" అన్నాడు కృష్ణుడు.

"పెద్దయ్యాక చూస్తే మరీ తప్పు!" అంది యశోద. మనసులో, "విఘ్నేశా! అశుభం శుభం తెలియని పసివాడు, నీడ చూశాడు, అంతే. మన్నించు!" అని అనుకుంటూ.

ఆ మర్నాడు బలరాముడు గబగబా వచ్చి యశోదతో, "అమ్మా! తమ్ముడు మన్ను తింటున్నాడు. అబద్ధం కాదు, వాడి నోరు చూడు!" అని చెప్పాడు. యశోద చరచరా వెళ్ళింది.

కృష్ణుడు మట్టి ముద్దలు వరసగా పేరుస్తున్నాడు. యశోద కృష్ణుడి చెవిపట్టి, "ఏదీ నోరు తెరు!" అన్నది.

"నన్ను నీచేత కొట్టించాలని ఎవరో ఏదో చాడీ చెప్పినట్టుంది. నీలాపనిందలు పడతాయని నిన్ననే కదా నువ్వు చెప్పావు? మట్టితో, ఉండ్రాళ్ళు లడ్లు చేస్తున్నానమ్మా. మట్టితో చేసిన వినాయకుడు మన్నుతో చేసినవైతేనే నిజంగా తింటాడమ్మా!" అన్నాడు కృష్ణుడు.

యశోద లెంపలు వేసుకుంటూ, "తప్పు నాయనా, తప్పు! మన్నుతో చేసినా, రాయితో చెక్కినా దేవుడు దేవుడే! అపచారం స్వామీ! విఘ్నేశా! పిల్లవాడి మాటలు ఏ మాత్రం పట్టించుకోకు!" అని ధ్యానించింది.

"అయితే వచ్చే వినాయక చవితికి వెన్న ఉండ్రాళ్ళు, నేతి లడ్లూ బోలెడన్ని చెయ్యి. ఎన్ని తింటాడో చూస్తా. తినకపోతే తినిపించుతా!" అన్నాడు కృష్ణుడు.

"ముందు నీ నోరు చూపించు!" అంటూ యశోద వంగి చూడబోతూంటే



కృష్ణుడు "ఆఁ" అంటూ బార్లా నోరు తెరిచాడు.

యశోద అలా చూస్తూనే ముచ్చెమటలు పట్టి చతికిల కూలబడింది. కృష్ణుడి నోటిలో బ్రహ్మాండాలు, నక్షత్రమండలాలు, సూర్యుళ్ళు, చంద్రుళ్ళు, సముద్రాలు, పర్వతాలు; సమస్తమూ కనిపించాయి. పాలు పితుకుతున్న యశోద వీపున వాలి, మెడ చుట్టూరా చిట్టిచేతులుచుట్టి, పాలల్లో చందమామను చూపిస్తున్న కృష్ణుడు కనిపించాడు. యశోద కల అనుకుని గిల్లుకొని కళ్ళు నులుముకొంది. కల కాదు, ఏ దేవతో, వినాయకుడో తనను మాయలో ముంచేస్తున్నాడని అనుకుంటూ చుట్టూరా



చూసింది. యశోద వెర్రిచూపులతో చుట్టూ చేరిన పిల్లవాళ్ళు కేరింతాలు కొడుతున్నారు. స్తంభం చాటున బలరాముడు ముసి ముసి నవ్వులు నవ్వుతున్నాడు.

కృష్ణుడు యశోద ముఖం మీదకు వంగి, "చూడమ్మా చూడు! మన్ను కనిపించిందా? బాగా చూడు!" అంటూ తెరిచిన నోరు మరింత దగ్గిరగా చూపుతుంటే, యశోదకు దేవాదిదేవుళ్ళు కనిపించారు. కృష్ణుడు పిల్లనగ్రోవి ఊదుతూంటే, విఘ్నేశ్వరుడు తాండవం చేస్తూ కనిపించాడు. కృష్ణుడు పెద్ద నల్లని సర్పం తలల మీద తంతున్నాడు. అది కృష్ణుణ్ణి చుట్టివేస్తున్నది.

యశోద కెవ్వన అరిచి మూర్ఛపోయింది.

యశోద తిరిగి కళ్ళు తెరిచేసరికి మంచం చుట్టూరా గొల్లభామలూ, గొల్ల అవ్వలూ కనిపించారు.

"నాకేమైంది?" అని ఆశ్చర్యంగా అడిగింది యశోద.

ఆమెకు ఏదీ జ్ఞాపకం లేదు. ఏమీ జరగనట్టే అంతా మరిచిపోయింది.

"నీకేమైందో మాకు తెలీదు గాని, మా ఇళ్ళల్లో దొంగతనాలు జరిగాయి. ఆ దొంగ నీ ముద్దులకొడుకే! వెన్న, మీగడ, పాలు, పెరుగులు కుర్రమూకకీ, కోతులకూ పంచి పెడుతుండగా కళ్ళారా చూశాము!" అని చెప్పారు గోపకాంతలు.

యశోద, "ఏమిటేమిటీ! అవన్నీ మీ ఇళ్ళల్లోవని ఎలాగ అనుకున్నారు? మా ఇంట లేవనుకున్నారా? గోకులం ఊళ్ళోని ఇళ్ళన్నీ కలిపి, మా ఇంట వున్న వాటిలో సగానికైనా రావు; వెళ్ళండి, వెళ్ళండి!" అంటూ వాళ్ళను సాగనంపింది.

కృష్ణుడు మెల్లగా వచ్చి, "ఏం జరిగిందమ్మా?" అనడిగాడు.

"ఏం జరుగుతుందన్నానో అదే జరిగింది! నీ మీద నీలాపనింద పడింది!" అన్నది యశోద.

"నీలాపనింద తప్పించేసుకున్నా నమ్మా. వాళ్ళు చెప్పిందంతా నిజమే నమ్మా!" అన్నాడు కృష్ణుడు.

యశోదకు పట్టరాని కోపం వచ్చింది. పెద్ద తాడుతో కృష్ణుణ్ణి పెద్ద రోలుకు వేసి కట్టింది. కృష్ణుడు ఆ రోటిని ఈడ్చుకుంటూ వెళ్ళి, జంటగా పెరిగిన రెండు మద్ది మాన్నుల సందున దూరి రోటిని లాగాడు. మహా వృక్షాలు రెండూ వ్రేళ్లతో పెళ్లగించుకొని కూలాయి. శాపవిముక్తులైన గంధర్వులు కృష్ణుణ్ణి నుతించి ఆకాశాని కెగిసి, అదృశ్యులయ్యారు.



ఏడాది తిరిగింది. వినాయకచవితి వచ్చింది. రంగురంగుల పెద్ద వినాయక విగ్రహాన్ని నందుడు చేయించాడు. యశోద పాలమీగడతో పిండి కలిపి ఉండ్రాళ్ళు, వెన్న అప్పాలు, నేతిలడ్లు, పాలతో జిల్లేడుకాయలు దండిగా చేసింది.

నైవేద్యాలన్నీ పళ్ళెలనిండా నింపి, పూజామందిరంలో అమర్చి తలుపు చేరవేసి, యశోద అలా వెళ్ళింది.

కృష్ణుడు మెల్లగా పూజామందిరం ప్రవేశించి తలుపు మూసి, తినుబండారాల్ని వినాయక విగ్రహానికి అందిస్తూ, "తినవయ్యా తిను!" అంటూ ప్రతిమ బొజ్జ నిమిరాడు.

ప్రతిమ విఘ్నేశ్వరుడై తొండంతో అందుకొంటూ, "కృష్ణా! నేనందించేవి నువ్వు తినాలి! విఘ్నేశ్వర చరిత్రలో ఇది సుందరకాండ!" అంటూ వెన్నతో చేసిన తినుబండారాల్ని కృష్ణుడి నోట కుక్కాడు. పళ్లాలు ఖాళీ అవుతున్నాయి.

యశోద పూజామందిరానికి వస్తూ గవాక్షం గుండా లోపల జరుగుతున్న సుందరకాండ చూచి కొయ్యబారి పోయింది. ముచ్చెమటలు పట్టాయి. మళ్లీ తమాయించుకొని, "అబ్బే, నే నేదో భ్రమపడుతున్నాను, నా కళ్ళకేదో మాయ తెగులు పట్టుకుంది!" అని సర్ది చెప్పుకుంటూ తలుపు తెరిచి వచ్చింది.



వినాయక విగ్రహం విగ్రహం లాగే వున్నది. అమర్చిపెట్టిన తినుబండారాలు కనిపించటం లేదు. కృష్ణుడు బిక్క మొహం పెట్టి చూస్తున్నాడు.

"నీ తిండి తగలడా! పూజ కాకుండా అంతా పాడుచేశావు," అంటూ యశోద కృష్ణుడి వీపు మీద గట్టిగా నాలుగు చరిచింది.

కృష్ణుడు ఏడుస్తూ, ఎవరికీ చిక్కకుండా పరుగు తీసి, కాళిందిమడుగు చేరాడు. ఆ వెనుకనే యశోదతోబాటు గోకులంలోని వారంతా ఆదుర్దాగా వెళ్లారు.

కాళిందిమడుగులో ఉంటున్న కాళీయ మహా సర్పం వల్ల గోకులవాసులకు ఎన్నో విధాలుగా హాని జరుగుతూ వస్తున్నది. కృష్ణుడు మడుగు ఒడ్డునే ఉన్న చెట్టెక్కి, మడుగు మధ్యకు వ్యాపించి ఉన్న కొమ్మ మీది నుంచి, మడుగులోకి దూకి, కాళీయ నాగుడి నెత్తి మీద పిడుగులాగ పడ్డాడు. గజ్జెలందెలు ఘల్లుఘల్లుమనగా కృష్ణుడు కాళీయుడి తలల మీద తాండవం చేశాడు. అద్భుతంగా కాళీయమర్దనం జరిగింది. కాళీయుడి శాపం తీరింది. కుమార్తెలను తీసుకెళ్లి పాతాళంలో వాసుకికి అప్పగించి, కాళీయరూపం ఉపసంహరించుకొని, విఘ్నం విఘ్నేశ్వరుడి అధీనమైంది.

కొడుకు నెత్తుకొని యశోద ఇంటి కొచ్చి చూసేసరికి, పూజామందిరంలో పళ్లాలన్నీ నిండుగా ఎలాగ పేర్చినవి అలాగే ఉన్నాయి. బాలకృష్ణుడి వీపు మీద మాత్రం యశోద వ్రేలి తట్లు కనిపిస్తున్నాయి. యశోద వాటిని చూసి, "నా చేతులు పడిపోను! నా కళ్ళకేదో మాయ రోగం వచ్చి నిష్కారణంగా కొట్టాను. పాపిష్టిదాన్ని!" అని వలవలా ఏడ్చింది.

"అమ్మా! బోలెడు వేళ ఉంది, పూజ చెయ్యవూ మరి!" అన్నాడు కృష్ణుడు. నందుడు యశోద కృష్ణుడిచేతే పూజ చేయించారు. నైవేద్యాల్ని ఊరందరికీ పంచారు. ఆ తినుబండారాల్లో

అమృతం ఉందనిపించింది. గోకుల మంతా ఆనందం పొంగిపొర్లింది.

కృష్ణుడు బాగా యెదిగాడు. గోవర్ధన గిరిని ఎత్తి ప్రళయ భీకరమైన జడివాన నుండి గోవులనూ, గోపకులనూ కాపాడి, ఇంద్రుడికి గర్వభంగం చేశాడు.

గోవర్ధన ప్రాంతంలో ఒకనాడు కృష్ణుడు ఆవులను కాస్తూండగా, చంకను పెద్ద మద్దెల పెట్టుకొని వస్తున్న ఒక పెద్ద మనిషి, "అబ్బాయీ, ఇక్కడ కృష్ణుడు అనే అబ్బాయి ఉన్నాడట. మురళి చాలా గొప్పగా వాయిస్తాడని చెప్పుకుంటున్నారు. ఆ మురళీ గానం ఏపాటిదో చూద్దామని వచ్చాను. అతడి ఉనికి చెప్పగలవా?" అన్నాడు కృష్ణుడితో.

"స్వామీ, ఆ కృష్ణపరమాణువును నేనే! తమరెవరో చాలా గొప్ప మృదంగ విద్వాంసుల్లాగ ఉన్నారు. తమరెవరో తెలియని వాణ్ణి, కాస్త సెలవియ్యండి, స్వామీ!" అని కృష్ణుడు చేతులు జోడిస్తూ అన్నాడు.

"నన్ను మృదంగకేసరి అని పిలుస్తారు. మాది దక్షిణ దేశం. మధురానగరానికి వెళ్తున్నాను. కంసుడు ధనుర్యాగం చేస్తాడుట. అప్పుడు నా మద్దెల విద్వత్తును ప్రదర్శిద్దామని వెళ్తున్నాను," అన్నాడు మృదంకేసరినని చెప్పుకొన్న పెద్దమనిషి.

అతని కాలికి రత్నఖచితమైన గండపెండెరం, చేతులకు కెంపులు తాపిన సింహ తలాటాలు, మెడలో బంగారు నిమ్మకాయల దండ, చెవులకు పెద్ద కుండలాలు ధగధగా మెరుస్తున్నవి. మద్దెల నిండా నవరత్న స్వర్ణ పతకాలు తాపి ఉన్నవి.

కృష్ణుడు వాటిని చూసి అబ్బురపడుతూ, "స్వామీ, నేను ఆవుల్ని కాసే సామాన్య గోపకుణ్ణి. నా పిల్లనగ్రోవి సాదా వెదురుబొంగు ముక్క! మీ దక్షిణదేశ విద్వాంసులు, తాళానికి ప్రసిద్ధులు. ఇహ నేను ఏదో ఒక రాగాన్ని ఊది, ఆవుల్ని పాలించుకోవడం తప్పితే, మరేదీ తెలియని గాలిపాటగాణ్ణి మాత్రమే!" అన్నాడు.





# విఘ్నేశ్వరుడు

కృష్ణుడిమాటలకు నవ్వి, మృదంగ కేసరి, "అలాగని తప్పించుకోబోతున్నావా? వీల్లేదు! నీ మురళీగానం గొప్పదో, నా మృదంగ వాయిద్యం గొప్పదో ఇప్పుడే తేలిపోవాలి!" అన్నాడు.

కృష్ణుడు గడగడలాడుతూ, ఊదడానికి మురళి తీశాడు. మృదంగకేసరి మఠం వేసి మద్దెల వాయించ మొదలుపెట్టాడు. కృష్ణుడు యమునాకళ్యాణి రాగాన్ని వాయిస్తూ మృదంగకేసరిని తికమక పెట్టి తక్కున హంసధ్వని రాగాన్ని అందుకొని అద్భుతంగా వాయిస్తూంటే, మృదంగకేసరి పరవశించి మైమరిచి మద్దెల విడిచి నృత్యం చేయడం మొదలుపెట్టాడు.

కృష్ణుడు హంసధ్వని రాగాన్ని చిత్రవిచిత్ర గతులతో స్వరాలు మరింత దురితంలో పలికిస్తూంటే, మృదంగకేసరి రూపు విడిచి విఘ్నేశ్వరుడు విఘ్నేశ్వరుడై తొండమెత్తి, బొజ్జ ఊపుకొంటూ తాండవం చేశాడు. మద్దెల మాయమై ఎలుక గంతులు వేసింది.

విఘ్నేశ్వరుడు తనకు ప్రియతమమైన హంసధ్వని రాగానికి పులకరించిపోతూ, తాండవం చేస్తూ అలసిపోతూంటే కృష్ణుడు తక్కున మురళి వాయించటం ఆపి, విఘ్నేశ్వరుడు పడిపోకుండా ఒడిసి పట్టుకొని, "పార్వతీనందనా! మళ్లీ బోర్ల పడ్డావంటే, మీ అమ్మ మురళీగానాన్ని వినకూడదని శపించి పోతుందేమోనన్న



భయంతో, నిన్ను కింద పడిపోకుండా పట్టుకున్నాను, మరేం అనుకోకు, లంబోదరా!'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''కృష్ణా, నీ మురళీగానాన్ని వినాలనే ఇలా వచ్చాను. మన కృష్ణవినాయకీయం నిజంగా సుందరకాండే!'' అన్నాడు.

కృష్ణుడు, ''విఘ్నేశా! పాపం, నీ వాహనం మద్దెలదరువులు బాగా తిన్నదే!'' అని అంటూ ఎలుకను ముద్దుగా నిమిరాడు.

విఘ్నేశ్వరుడు, ''కృష్ణా! కంసుడికి అంత్యకాలం సమీపించింది. ధనుర్యాగం సాకుతో నిన్ను తీసుకురమ్మని, అక్రూరుణ్ణి పంపుతాడు, వెళ్ళు! విజయోస్తు!'' అని చెప్పాడు.

కృష్ణుడు, ''అంతా నీ దయ, స్వామీ!'' అని చేతులు మోడ్చి మ్రొక్కాడు.

విఘ్నేశ్వరుడు, ''అవతారమూర్తివి! నా దయ కాదు, నీ లీల! అన్నట్టు అర్క కుబ్జ రూపంతో నీ కోసం ఎదురు చూస్తూ ఉంటుంది, అనుగ్రహించు!'' అని చెప్పి ఎలుక వాహనం ఎక్కి, ఆకాశానికి రివ్వున వెళ్లి అంతర్ధానమయ్యాడు.

అక్రూరుడు కృష్ణబలరాములను మధురాపురానికి రథం మీద తీసుకువెళ్ళాడు. అష్టవంకరలతో ఉన్న కుబ్జ కృష్ణుడికి ఎదురొచ్చి, పాదాలకు మ్రొక్కి చందనం పూసింది. కృష్ణబలరాములకు పూలమాలలు వేసింది.

కృష్ణుడు ఆప్యాయంగా కుబ్జను రెండు చేతులతో లేవనెత్తాడు. కుబ్జ రూపం పోయి అప్సరసరూపంతో అర్క దేవలోకం చేరుకుంది.

కంసుడు తనను చంపాలని చేసిన కపటోపాయాలన్నిటినీ చిత్తు చేసి, కృష్ణుడు, కంసుణ్ణి పట్టుకుని సింహాసనం నుంచి ఈడ్చిలాగాడు. కంసుడు మరణించాడు.

దేవకీ వసుదేవులను కారాగార విముక్తులను చేసి, కృష్ణుడు ఉగ్రసేనుడిని

కూడా కారాగారం నుండి విడిపించి, అతని సింహాసనం అతని పరం చేశాడు.

కృష్ణబలరాములు పెద్దవాళ్ళయ్యారు. కృష్ణుడు అనేక మంది దుర్మార్గులను, రాక్షసులను నిర్మూలించాడు. సముద్రం లోకి చొచ్చుకొని దుర్భేద్యంగా ఉండేలాగ ద్వారకానగరాన్ని నిర్మాణం చేయించి, అన్న బలరాముణ్ణి యాదవులకు పెద్దగా చేసి రాజరికాన్ని నెలకొల్పాడు.

కృష్ణుడు రుక్మిణిని తెచ్చుకొని వివాహం చేసుకొన్నాడు.

సర్వసంపదలతో తుల తూగుతున్నా, కృష్ణుడు ఎప్పటివలెనే ఆవులను కాస్తూ, పాలు పితుకుతూ గోపాలకృష్ణుడుగానే ద్వారకలో ఉంటున్నాడు.

ద్వారకానగరం పక్కనే సత్రాజిత్తు అనే ప్రముఖుడు రాజువలె సంస్థానం ఏర్పరచుకొని భోగభాగ్యాలతో తులతూగు తున్నాడు. తాను సూర్యవంశ క్షత్రియు డనని సగర్వంగా చెప్పుకుంటూ, సూర్యో పాసకుడై గొప్ప తపస్సు చేశాడు. సూర్యుడు ప్రసన్నుడై శమంతకమణి అనే పెద్ద వజ్రాన్ని అతనికి ప్రసాదిం చాడు. శమంతకమణి నుండి వెలువడే కాంతి కిరణాలు బంగారు కణికలై ప్రతి రోజూ అతనికి అంతులేని బంగారం సమకూరుతూండేది.



సత్రాజిత్తు ప్రముఖులనిపించు కుంటున్న వారికి ఆహ్వానాలు పంపి మరీ వచ్చినవారందరికీ మణినిచూపించి, మణి ప్రభావాన్ని వర్ణిస్తూ మురిసిపోతూండేవాడు. కృష్ణుడికి కూడా ఆహ్వానం పంపించాడు గాని కృష్ణుడు రాలేదు, ఎప్పుడో వీలు చూసుకొని వస్తానని తిరుగు కబురు పంపించాడు. గర్విష్ఠి అయిన సత్రాజిత్తు కృష్ణుడిపై ద్వేషం పెట్టుకున్నాడు. కృష్ణుడి గురించి ఎన్నో విశేషాలు విన్నా, ఒక యాదవ ప్రముఖుడిగా తప్పితే కృష్ణుడిపై అతనికి పెద్ద అభిప్రాయం ఏర్పడలేదు.

సత్రాజిత్తుకు సత్యభామ అనే అసమాన సౌందర్యవతియైన కుమార్తె ఉన్నది.



శమంతకమణితో బాటు సత్యభామ సౌందర్యం కూడా విఖ్యాతి కెక్కింది; జరాసంధుడిలాంటి రాజాధిరాజులు సైతం సత్యభామను చేబట్టాలని కాచుకొని ఉన్నారు.

సత్యభామకు విఘ్నేశ్వరుడిపై ఎనలేని భక్తి విశ్వాసాలున్నవి. ఆమె ప్రతి వినాయక చవితికి విఘ్నేశ్వరుణ్ణి భక్తి శ్రద్ధలతో పూజించి కృష్ణుణ్ణి తన అధీనుడిగా చేయవలెనని కోరుకుంటూండేది. కృష్ణుడు ఆ దారిన వచ్చినప్పుడల్లా సౌధాగ్రంమీద నిల్చొని చూసి చూసి, ఒకసారైనా అతడు తలపైకెత్తి తన్ను చూడలేదుకదా అని నిరాశతో విఘ్నేశ్వరుడి ముందు మోకరిల్లి, తన ఆశ ఫలింపజేయుమని మరీ మరీ ధ్యానిస్తూండేది.

సత్రాజిత్తుకు కుమార్తె మనసు తెలిసినా తెలియనట్టే ఉండేవాడు. ఒకనాడు సత్య విఘ్నేశ్వరుడి ముందు మోకరిల్లి ఉండగా చూసి, "ప్రత్యక్ష దైవమైన సూర్యభగవానుడి అనుగ్రహం మనపై ఉండగా, ఇలాంటి మొక్కుబడులు దేనికమ్మా?" అన్నాడు.

సత్యభామ చివాలున లేచి, "అలా అనకూడదు, నాన్నా! మనోవాంఛితాన్ని సఫలం చేయగల దేవుడు విఘ్నేశ్వరుడు ఒక్కడే!" అన్నది.

"ఏమిటి నీ మనోవాంఛితం? రుక్మిణితో పాలు పంచుకోవడమేనా?" అన్నాడు సత్రాజిత్తు.

"పాలు పంచుకోవడమేమిటి? కృష్ణుణ్ణి నా అధీనంలో పెట్టుకొంటాను!" అన్నది సత్యభామ.

సత్యభామ పట్టుదల ఎలాంటిదో సత్రాజిత్తుకు తెలియనిది కాదు. అయినా వక్ర బేల అని తనకు తాను సరిపెట్టుకొంటూ వెళ్లాడు.

మర్నాడే కృష్ణుడు సత్రాజిత్తు దగ్గిరికి వచ్చాడు. రాక రాక వచ్చిన కృష్ణుడి కళ్ళ పడాలని సత్య సంబరపడుతూ ముస్తాబు సవరించుకొని సభామందిరానికి

వెళ్లేసరికి కృష్ణుడు అప్పుడే వెళ్లిపోయాడు. సత్రాజిత్తు శమంతకమణిని గుప్పెట్లో భద్రంగా పట్టుకొని ఉగ్రంగా కృష్ణుడు వెళ్ళిన వేపే చూస్తూ ఎంతోదిగులుగా నిల్చున్నాడు.

సత్యభామ తండ్రితో, "ఏమిటి నాన్నా అలాగ ఉన్నారు? వచ్చిన వాడు నన్ను తనకు యిమ్మని అడగలేదు గద!" అన్నది.

"అలా అడిగినా నేనంతగా పట్టించుకోను గాని, ఏమడిగాడో తెలుసా? శమంతకమణిని యిమ్మన్నాడు. తన లాంటి వాడి దగ్గిర ఉంటే, ప్రజలందరి శ్రేయస్సుకీ ఎన్నోవిధాల ఉపయోగపడుతుందని కూడా అన్నాడు!" అని సత్రాజిత్తు చెప్పాడు.

సత్యభామ చిరుకోపంతో, "ఇంతకూ, నా కంటే శమంతకమణే నీకు ఎక్కువైనది కదూ?" అంటూ చరచర వెళ్లబోతూంటే సత్రాజిత్తు బుజ్జగింపుగా, "అలా అనుకోవద్దమ్మా! ఆ కృష్ణుడి పేరాసకు విస్తుబోతున్నాను, అంతే!" అంటూ నసిగాడు.

"అతడు మణి యిచ్చే బంగారాన్ని దాచుకుంటానని అనలేదుగదా, అతనిది పేరాస ఎలా అవుతుంది, నాన్నా? కృష్ణుడంతటివాడు అడిగినప్పుడు సంతోషంతో



యిచ్చి వేస్తే ఎంత బాగుండేది, నాన్నా!" అన్నది సత్యభామ.

సత్రాజిత్తు కంపించిపోతూ, "ఇవ్వను, ప్రాణాలతో ఉండగా నా దగ్గిర్నుంచి మణిని ఎవ్వరూ తీసుకోలేరు! మణి నా ప్రాణం, నా సర్వస్వం!" అంటూ గట్టిగా అరిచాడు.

సత్యభామ ముఖం జేవురించుకొని, "ఔను! మణి నీకు అంత గొప్పది! నా కంటే గొప్పది! ఆ శమంతకమణి గొప్పదో, నేను గొప్పో ఆ కృష్ణుడే రుజువు చెయ్యాలి!" అంటూ చరచరా వెళ్లింది.

కొద్ది రోజుల తరవాత వినాయక చవితి వచ్చింది. సత్యభామ యథావిధిగా విఘ్నే



శ్వరుణ్ణి అర్చించి, ఆ సాయంత్రం పల్ల కిలో ద్వారకానగరానికి బయలుదేరి వెళ్లింది.

ఆ సాయంత్రం ఆకాశం దట్టంగా మబ్బు పట్టింది. చీకటి అవుతున్నది. కృష్ణుడు ఆవుపాలు పితుకుతున్నాడు. ఒక్కసారిగా మబ్బు విడిపోయి చవితి చంద్రవంక పాలల్లో తళుక్కున ప్రతి బింబించి కృష్ణుడికి కనిపించి క్షణంలో మబ్బుక్రమ్మి మాయమైంది.

వినాయక చవితినాడు చంద్రుడు కంట బడినందుకు కృష్ణుడు నొచ్చుకుంటూ, పూజా మందిరంలోకి వెళ్లి అక్షతలు తల మీద చల్లుకొని, విఘ్నేశ్వరుని ముందు నిల్చుని కన్నులు మూసి, "దేవా! ప్రతి బింబమే అయినా చూశాను, అంతా నీ దయ!" అని ధ్యానించాడు. అతను అలా ధ్యానిస్తున్నప్పుడు "కృష్ణా! నీవు చూడాలని చూడలేదుగా! నీలాపనింద పడినా మబ్బు విడిపోయినట్లే విడిపో తుంది! ఇదీ ఒక లాభానికే అనుకో వయ్యా!" అంటూ విఘ్నేశ్వర ప్రతిమ లోంచి వెలువడినట్లుగా మాటలు విని పించాయి.

కృష్ణుడు కన్నులు తెరిచి, "స్వామీ! అంతా నీ లీల!" అన్నాడు.

అదే సమయంలో రుక్మిణి పూజా మందిరం ప్రవేశిస్తూ విఘ్నేశ్వరుని ముందు నిల్చుని ఏదో జపిస్తున్న కృష్ణుణ్ణి ఆశ్చర్యంతో చూసి, "శ్రీవారు విఘ్నేశ్వ రులవారితో ఏదో మంతనాలు జరుపు తున్నట్లున్నదే!" అన్నది.

కృష్ణుడు, "ఇదే వేళ ఒకానొక వినాయకచవితినాడు నన్ను పెంచిన యశో దమ్మతో నేను అన్న మాటలు గుర్తు కొచ్చాయి, అంతే!" అన్నాడు.

"ఆ ముద్దుమాటలేమిటో నాకు కూడా వినిపించవా, స్వామీ!" అన్నది రుక్మిణి.

కృష్ణుడు, "యశోదమ్మ పితుకుతున్న పాలలో చవితి చంద్రుడి బింబం చూసి కేరింతాలు కొట్టాను. ఎన్ని నిందలు

పడతావో కదా. అని యశోదమ్మ నొచ్చుకున్నది. పెద్దయ్యాక అయినా నింద తప్పదన్నది. దానికి నేను, అమ్మా, అప్పుడు మళ్ళా చూడాలికదూ అని అన్నాను.'' అని చెప్పాడు.

రుక్మిణి, ''మరి అప్పుడు నీలాపనింద సంగతి ఏమైంది?'' అనడిగింది.

''మన్ను తింటున్నానని అన్నయ్య చెప్పనే చెప్పాడు!'' అన్నాడు కృష్ణుడు.

రుక్మిణి, ''మళ్లీ ఇప్పుడు చంద్రుణ్ణి చూడలేదుకద! చూడాలన్నా కనిపించడులెండి, బాగా మబ్బుపట్టి ఉంది!'' అని అంటూ ఏదో చెప్పబోతున్నట్లు చూసింది.

''రుక్మిణీ! ఏదో చెప్పవచ్చినట్టున్నావే, ఏమిటి విశేషం?'' అనడిగాడు కృష్ణుడు.

''విశేషమే! సత్రాజిత్తులవారి ఇంటి మణి మన ఇంటికి విచ్చేసింది!'' అన్నది రుక్మిణి.

కృష్ణుడు, ''శమంతకమణి మన ఇంటికి రావడమేమిటి?'' అన్నాడు ఆశ్చర్యంగా.

''ఆ మణికాదు. సత్రాజిత్తులవారి కన్యకామణి-సత్యభామామణి వచ్చింది. చాలాసేపుగా ఇక్కడే మాట్లాడుకుంటూ ఉన్నాము. చూసి చూసి ఇప్పుడే పల్లకిలో వెళ్లింది. ఆమెను సాగనంపి ఇలా వచ్చాను. మీరు కనిపించారు!'' అన్నది రుక్మిణి

కృష్ణుడు తలపంకించి, ''అలాగా! మన ఇంటి విఘ్నేశ్వరదేవుణ్ణి కూడా చూడాలని వచ్చి ఉంటుంది. చూసింది కదా!'' అన్నాడు.

రుక్మిణి, ''విఘ్నేశ్వర దేవుణ్ణి చూడాలని వచ్చిందో, మీ కన్నుల్లో పడాలని వచ్చిందో మరి! ఇక్కడ వున్నంతసేపూ ఆమె చూపులు మిమ్మల్నే తెగ వెతికి వెతికి వేసారాయని మాత్రం నాకు రూఢిగా తెలుసు!'' అన్నది.

''ఏమిటీ వింత! మాటలు రావనుకున్న రుక్మిణీదేవి, ఈ రోజు చతురంగా మాట్లాడుతున్నదే!'' అని కృష్ణుడు అన్నాడు.






కృష్ణుడి ఆశ్చర్యానికి రుక్మిణి చిరునవ్వుతో, "ఔను, నాథా! ఈ రోజు నాలో ఆనందం పొంగి పొర్లుతున్నది. ఆ కన్యకామణికి మీ మీద ఎంత ఆశ! అమాంతంగా మిమ్మల్ని నిధిని దాచుకున్నట్లు తన గుప్పెట్లో ఉంచుకోవాలన్నంత మమత నాకు కనిపించింది!" అన్నది.

"మరి, నీ సంగతి చెప్పలేదు!" అన్నాడు కృష్ణుడు.

"మీ లోపల ఒక అణువునై ఇమిడి ఉండిపోవడమే నాకు కావలసిందల్లా! మీరు ఎవరి గుప్పెట్లో ఉన్నా నేను మీలోనే ఉంటానుగదా!" అన్నది రుక్మిణి.

"రుక్మిణీ! ఎంతో గొప్ప భావాల్ని ఎంత సూక్ష్మాతి సూక్ష్మంగా నిర్వచించావు! అందుకే నిన్ను కోరికోరి ఎత్తుకు వచ్చాను!" అన్నాడు కృష్ణుడు.

"నాకు నిజమని తోచింది చెబుతున్నాను. నా కంటే సత్యభామదే గొప్ప మమత, బలమైనది! ఆ మమతలో, అనంతమైన ప్రకృతిశక్తి అంతా ఉంది. స్వామీ! నాలో ఉన్నది భక్తిప్రధానమైనది మాత్రమే!" అని చెబుతున్న రుక్మిణిని వారించి, కృష్ణుడు చిరునవ్వు చిందిస్తూ, "రుక్మిణీ, వేదాంతం మాట్లాడకు!" అన్నాడు.

కొద్ది దినాలు గడిచాయో లేదో, "కృష్ణుడు శమంతకమణిని అపహరించాడు!" అనే వార్త కార్చిచ్చులా అంతటా వ్యాపించింది. ఆ విధంగా అందరితో చెప్పి




సత్రాజిత్తే మణిని పోగొట్టుకున్న దుఃఖంతో పిచ్చివాడై వీధివీధులా తిరిగి అరుస్తూ విశేష ప్రచారం చేశాడు.

తన మీద మోపబడ్డ అభాండానికి చింతించి ప్రయోజనం లేదని కృష్ణుడు దిటవు తెచ్చుకొని, ''విఘ్నేశ్వరా! ఇదంతా నీ లీల, తరువాత నీ దయ!'' అని ధ్యానించి, మణిని అన్వేషించడానికి అరణ్యాల్లోకి వెళ్ళాడు.

జరిగినదేమంటే: సత్యభామను సత్రాజిత్తు వరుసకు తనకు మేనల్లుడైన శతధన్వుడనే రాజుకిచ్చి వివాహం చేసే నిర్ణయానికొచ్చి, తన తమ్ముడు ప్రసేనజిత్తును, శతధన్వుడితో మాటామంతీ చేసి రమ్మని పంపాడు. ప్రసేనుడు శ్యమంతక మణిని ధరించి అరణ్య మార్గంలో వెళ్తూండగా, ఒక సింహం మణి చేత ఆకర్షింపబడి అతణ్ణి చంపింది. ఆ సింహాన్ని జాంబవంతుడు చంపి, మణిని తీసుకుపోయి, తన కుమార్తె జాంబవతికి యిచ్చాడు.

మణిని ధరించి వెళ్లిన తమ్ముడు తిరిగి రాకపోవడంతో, ఒకప్పుడు మణిని అడిగిన కారణంగా కృష్ణుడే తన తమ్ముణ్ణి సంహరించి మణిని అపహరించాడని సత్రాజిత్తు చాటాడు. సత్యభామను పెళ్లాడ్డానికి ఉవ్విళ్ళూరుతున్న శతధన్వుడు, జరాసంధుడు మొదలైన కృష్ణుడి శత్రువులైన రాజులు సత్రాజిత్తును బలపరిచి పగ తీర్చుకోడానికి సాయపడతామంటూ కబురు పెట్టారు.

మణిని అన్వేషిస్తూ వెళ్ళిన కృష్ణుడు, అరణ్యంలో ఒకచోట చచ్చిపడి ఉన్న ప్రసేనుడినీ, సింహాన్నీ, జాంబవంతుడి అడుగుజాడలనూ చూసి జాంబవంతుడి గుహకు వెళ్ళాడు.

గుహలో నవ యవ్వనవతి, సుందరి అయిన జాంబవతి మణిని బంతిలాగ ఎగరవేసి పట్టుకొంటూ ఆడుకొంటున్నది. జాంబవతి పసిపిల్లగా అరణ్యంలో జాంబవంతుడికి దొరికిన అనాథ రాజపుత్రిక.

అతడామెను తన ముద్దుల కూతురుగా పెంచుకొచ్చాడు.

మణిని తీసుకొనడానికి కృష్ణుడు ఆమె చేతిని పట్టుకొన్నాడు. జాంబవతి చేతిని విడిపించుకోవడానికి ప్రయత్నించకుండా తల వాల్చి సిగ్గుదొంతరలతో క్రీగంట కృష్ణుణ్ణి చూస్తున్న సమయంలో జాంబవంతుడు గుహకు వచ్చి, కృష్ణుడిపై లంఘించాడు. ఇద్దరికీ పన్నెండు రోజులు గొప్ప యుద్ధం జరిగింది. కృష్ణుడు పిడికిటితో జాంబవంతుడి గుండెమీద బలంగా పొడిచాడు. ఆ పోటుతో రాముడే కృష్ణుడుగా అవతరించాడని జాంబవంతుడు గుర్తించాడు.



జాంబవంతుడు కృష్ణుడికి ప్రణమిల్లి, ''కృష్ణా! జాంబవతి చేతిని పట్టనే పట్టావు, జాంబవతి నీదే!'' అంటూ శ్యమంతకమణినీ, జాంబవతినీ కృష్ణుడికి సమర్పించాడు.

జాంబవతితో జాంబవంతుడు వెంట రాగా కృష్ణుడు మణితో ద్వారకకు వచ్చి, సత్రాజిత్తుకు మణిని అందజేశాడు. జాంబవంతుడు సత్రాజిత్తుకు జరిగినదంతా చెప్పాడు.

సత్రాజిత్తు పశ్చాత్తాపం పొంది కృష్ణుడితో, ''కృష్ణా! సొమ్ము పోయినవాడు పాపాత్ముడు అనే విధంగా నేను మహాపరాధం చేశాను. నన్ను నీ యిష్టమొచ్చినట్లు దండించు!'' అన్నాడు.

కృష్ణుడు సత్రాజిత్తుతో, "నీ పశ్చాత్తాపమే నీకు దండన!'' అన్నాడు.

అప్పుడు సత్రాజిత్తు తన అపచారానికి పరిహారంగా, మన్ననగా శ్యమంతకమణినీ, సత్యభామనూ కృష్ణుడి ఎదుట ఉంచి స్వీకరించమని వేడుకొన్నాడు.

కృష్ణుడు సత్యభామను స్వీకరిస్తూ, శమంతకమణిని సత్రాజిత్తునే ఉంచుకోమని తిరిగి యిచ్చివేశాడు. అప్పుడు సత్యభామ, కృష్ణుడు తనను స్వీకరించిన ఆనందం పొంగిపొర్లుతుండగా, ''చుశావా, నాన్నా! నేను గొప్పదాన్నో, మణి గొప్పదో



యిప్పుడు తెలిసిందా!" అన్నట్లు సగర్వంగా సత్రాజిత్తును చూసి, "నాన్నా! ఒకప్పుడు విఘ్నేశ్వరుడి మహత్తును గుర్తించలేనివాడివై ఏమో అన్నావు. నేను విఘ్నేశ్వరుణ్ణే నమ్ముకొన్నదాన్ని. నా అభీష్టం నెరవేరింది!" అంటూ విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించి చేతులెత్తి మ్రొక్కింది.

అప్పుడు విఘ్నేశ్వరుడు ఆకాశంలో లీలగా కనిపించి, "భగవంతుడు తనకు అత్యంత ప్రియమైన సత్యానికి ఎల్లప్పుడూ వశవర్తిగా ఉంటాడు. సత్యమే అతని సొత్తు!" అనే అర్థం స్ఫురించేలాగ, "సత్యభామా పరిణయంతో కృష్ణుడు సత్యాపతిగా పేరు పడతాడు!" అని చెప్పాడు.

సత్రాజిత్తు భక్తితో విఘ్నేశ్వరుడికి మ్రొక్కి, "నా అపచారాన్ని మన్నించు దేవా!" అంటూ లెంపలు వేసుకొన్నాడు.

కృష్ణుడు, "విఘ్నేశా! అంతా నీ లీల, నీ దయవలన అపవాదు తొలగించుకొని మణికంటే అమూల్యమయిన సత్యభామా మణిని సంపాదించాను!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "శ్యమంతకమణి కథ విన్నవారికి అపనిందలు అంటవు," అని చెపుతూ అంతర్ధానమయ్యాడు.

సత్రాజిత్తు కృష్ణుడి కాళ్ళు కడిగి కన్యాదానం చేసే తన అదృష్టానికి పొంగిపోతూ, కృష్ణుడితో సత్యభామ వివాహాన్ని మహా వైభవోపేతంగా జరిపించాడు. తరువాత కృష్ణుడు జాంబవతిని వివాహం చేసుకొన్నాడు. జాంబవంతుడు కృష్ణుడితో, "కృష్ణా! నీవు రామావతారంలో ఉన్నప్పుడు నీతో యుద్ధం చేయాలని అభిలాషను వ్యక్తం చేశాను. నీ వంటి అల్లుడిని పొందిన జనకమహారాజు అదృష్టానికి అసూయ పడుతున్నానని కూడా అన్నాను. ఆ రెండు కోరికలూ యిప్పుడు తీర్చావు. నేను ధన్యుణ్ణి, జీవన్ముక్తుణ్ణి!" అని చెప్పి తపస్సు చేసి తరించడానికి అరణ్యాల్లోకి వెళ్ళిపోయాడు.

కొంతకాలం తరువాత శతధన్వుడు కసితో సత్రాజిత్తును చంపి మణిని తీసు

కుని కృతవర్మ, అక్రూరులు తోడుగా పారిపోయాడు. కృష్ణుడు సత్యభామను ఓదార్చి శతధన్వుడిని యుద్ధంలో సంహరించాడు. అక్రూర కృతవర్మలు మణితో పారిపోయారు. వారిని వెదకిపట్టి కృష్ణుడు మణిని తీసుకొచ్చి, తండ్రి జ్ఞాపకచిహ్నంగా ఉంచుకోమని సత్యభామకు ఇచ్చాడు.

కృష్ణుడు మిత్రవింద, కాళింది, భద్ర, నాగ్నజితి, లక్షణ అనేవారిని కూడా వివాహం చేసుకొన్నాడు. ఎనమండుగురు భార్యలతో కృష్ణుడు భోగభాగ్యాలతో తుల తూగుతూ ప్రతి ఏటా వినాయకచవితిని భక్తిశ్రద్ధలతో జరుపుతూ వచ్చాడు.




శ్యమంతకమణి ప్రభావంవల్ల సత్యభామ అంతఃపురం అంతులేని బంగారంతో నిండిపోయింది. ఆ బంగారంతో సత్యభామ రత్నరాసులనూ, అమూల్యాభరణాలనూ, చీనిచీనాంబరాలనూ కోకొల్లలుగా తన ఇంట నింపుకొంది. అష్టమహిషులలో తానే ఐశ్వర్యవంతురాలననే సంపద్గర్వంతోబాటు, తానే అధికురాలననీ, కృష్ణుడికి ఇష్ట భార్యననే అహంభావం క్రమక్రమంగా పెరిగింది.

కృష్ణుని అష్టమహిషులలో జాంబవతి గొప్ప వైణిక విద్వాంసురాలు. నారదుడు తన మహతివీణను వాయించుతూ గగన మార్గంలో పయనిస్తూండగా పరిహాసం చేస్తూన్నట్లుగా పకపకమంటూ నవ్వు వినిపించింది.

నారదుడు నివ్వెరపోయి, "ఎవరా నవ్వేది? ఎందుకు నవ్వుతున్నావు?" అంటూ నలుదెసలా చూశాడు.

"నారదా! యింకా నీవు చాలా నేర్చుకోవలసి ఉంది. నీ వీణావాదానికి నీవు నీలో పొంగిపోతూంటే నవ్వు వచ్చింది!" అని అశరీరవాణి పలికింది.

నారదుడు, "ఎవరి వద్ద యింకా నేర్చుకోవాలి?" అని అనుకుంటూండగా విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి, "జాంబవతి వద్ద వీణావాద్యంలోని మెళుకువలన్నీ క్షుణ్ణంగా తెలుసుకో!" అని చెప్పాడు.



ఆ విధంగా నారదుడు కృష్ణుడి అనుగ్రహంతో జాంబవతి వల్ల వీణావాదంలోని మెళుకువలన్నీ తెలుసుకున్నాడు.

ఒకనాడు కృష్ణుడు రుక్మిణి అంతఃపురంలో ఉండగా నారదుడు పారిజాత పుష్పాన్ని అతని కిచ్చాడు. కృష్ణుడు దాన్ని రుక్మిణి కిచ్చాడు. అది విని సత్యభామ అలిగింది. కృష్ణుడు సత్యభామను బుజ్జగించి ఆమెతో గరుడ వాహనంపై ఇంద్రుడి స్వర్గానికి వెళ్ళి, నందనవనంలోని పారిజాత వృక్షానికి వృక్షాన్నే తీసుకువచ్చి సత్యభామ ఇంటి పెరట్లో నాటాడు. అయినప్పటికీ కృష్ణుడికి తనపై గురి తగ్గిపోతూన్నదేమోననే దిగులు పట్టుకొన్నది సత్యభామకు. కృష్ణుడిని తన చెప్పుచేతల్లో తన మందిరంలో ఉండి పోయేలాగ చేసుకోవాలన్న తాపత్రయం పెంచుకొన్నది.

నారదుడు ఒకనాడు సత్య ఇంటికి వచ్చి, పుణ్యకవ్రతం ఆచరిస్తే కృష్ణుడు ఆమె అధీనంలోనే ఉంటాడని చెప్పాడు. సత్యభామ వ్రత నియమం ప్రకారం కృష్ణుణ్ణి నారదుడికి దానం చేసింది. నారదుడు కృష్ణుణ్ణి ఎత్తుకెత్తు బంగారమిచ్చి కొనుక్కోవచ్చునని అమ్మకానికి పెట్టాడు. సత్యభామ తన ఇంటనున్న అంతులేని బంగారాన్ని కృష్ణతులాభారంలో పెట్టింది, శ్యమంతకమణిని కూడా వేసింది. కాని కృష్ణుడు కొంచెమైనా తూగలేదు. అప్పుడు సత్యభామ గర్వాన్ని విడిచిపెట్టి, రుక్మిణిని కృష్ణుణ్ణి విడిపించుకొనే మార్గం చెప్పమని వేడింది.

రుక్మిణి, "చెల్లీ! కృష్ణుడితో సరితూగగల సంపద భక్తి ఒక్కటే! భక్తిపూర్వకంగా వేసిన ఒక్క తులసీదళం చాలును!" అని చెప్పి సత్యభామకు చిన్న తులసిఆకు యిచ్చింది.

సత్యభామ ఆ తులసీ దళాన్ని కన్నుల కద్దుకొని, భక్తిపూర్వకంగా తక్కెడలో వేసింది. కృష్ణుడు కూర్చున్న సిబ్బె పైకి లేచి సమానంగా తూగింది. అప్పుడు

నారదుడు తులసిదళాన్ని మాత్రమే తీసుకొని కళ్ళకు అద్దుకొని, కృష్ణుణ్ణి సత్యభామ పరం చేసి వెళ్ళిపోయాడు.

కృష్ణ తులాభారంతో సత్యభామకు జ్ఞానోదయం అయింది. ఐశ్వర్యంమీద, మణిమీద వ్యామోహం నశించి కృష్ణుడే తన పెన్నిధిగా భక్తిభావం కలిగింది.

మణివలన లభించిన బంగారాన్ని అంతటినీ కృష్ణుడు చెప్పినట్లుగా యాత్రికులకూ, బాటసారులకూ భోజన వసతి సౌకర్యాలు గల ధర్మశాలలనేకం, దేశమంతటా తండ్రి స్మృతి చిహ్నాలుగా కట్టించింది. ఆ ధర్మశాలలు సత్రాజిత్తు పేరు స్ఫురించేలాగ సత్రములు అని పిలువబడ్డాయి.

అటు పిమ్మట కొంతకాలానికి కృష్ణ బలరాముల చెల్లెలైన సుభద్రకు అర్జునుడితో వివాహం జరిగినప్పుడు, సత్యభామ శ్యమంతకమణిని సుభద్రకు అరణంగా పెట్టింది. ఆ విధంగా మణి పాండవులను చేరింది.

మణి కూర్చిన బంగారం ధర్మరాజు రాజసూయ యాగం చేయడానికి బాగా ఉపయోగపడింది. తరువాత ధర్మరాజు జూదమాడి తనతో బాటు తమ్ములనూ, ద్రౌపదినీ, రాజ్యాన్ని ఓడిపోయాడు. రాజసూయయాగం చూచి దుర్యోధనుడికి కన్ను కుట్టింది. ద్రౌపదిని పరాభవించాలనే దుశ్చింత రేపింది. పాండవుల పురోహితుడైన ధౌమ్యుడు తొలినుండి అనేక అనర్థాలకు కారణమవుతూ వచ్చిన శ్యమంతక మణిని విసర్జించమని చెప్పగా అర్జునుడు మణిని వింటికి సంధించి బలంగా భూమికేసి కొట్టాడు. మణి భూగర్భంలో నిక్షిప్త పడిపోయింది.

పాండవులు జూదంలో కౌరవులకు ఓడి అరణ్య వాసం చేస్తూండగా, ఒకనాడు నారదుడు వారి వద్దకు వచ్చి, రాజ్య ప్రాప్తికి భక్తిశ్రద్ధలతో విఘ్నేశ్వరుణ్ణి ఆరాధించి గణేశవ్రతాన్ని చేసి, తరవాత అజ్ఞాత వాసానికి వెళ్ళమని చెప్పాడు.





# విఘ్నేశ్వరుడు

పాండవులు నారదుడు చెప్పిన విధంగానే విఘ్నేశ్వరుణ్ణి భక్తి శ్రద్ధలతో అర్చిస్తూ, ధౌమ్యుడు పురోహితుడుగా గణేశవ్రతాన్ని చేసి, మారు వేషాలతో విరాటరాజు కొలువులో అజ్ఞాతవాసం జయప్రదంగా ముగించారు.

కృష్ణుని అండతో పాండవులు కౌరవులతో యుద్ధం చేసి విజయం పొందారు. హస్తినాపురంలో ధర్మరాజు పట్టాభిషిక్తుడై రాజ్యపాలన చేస్తూ, అశ్వమేధ యాగాన్ని చేయడానికి తలపెట్టాడు.

యాగాశ్వం వెంట సైన్యసమేతంగా అర్జునుడు బయలుదేరాడు. పాండవుల పురోహితుడైన ధౌమ్యుడు కూడా అతనితో ఉన్నాడు.

యాగాశ్వం అనేక రాజ్యాల మీదుగా వెళ్ళింది. రాజులనేకులు ధర్మరాజు పాలనకు వినయవిధేయతలు ప్రకటించారు. గుర్రం వెళ్తూ, వెళ్తూ ఒక ప్రాంతంలో ఆగిపోయి మరి ముందడుగు వేయలేదు. అర్జునుడు ఆశ్చర్యపోయి ధౌమ్యుణ్ణి ఎందుకిలా జరిగిందని అడిగాడు. ధౌమ్యుడు 'చెపుతా పద' అన్నట్లు చూసి దారి తీశాడు. కొంత దూరం వెళ్ళగా ఒక మహానగరం కనిపించింది. ఆ నగర మధ్యంలో బ్రహ్మాండమైన విఘ్నేశ్వరుని విగ్రహం ఉన్నది. ఒక పెద్ద కొండరాతిని మలచిన శిల్పం అది. అత్యంత కళాశోభితమై విరాజిల్లుతున్నది.

15. వాతాపిగణపతి



"అర్జునా! విఘ్నేశ్వర దేవుడిని అర్చించి ప్రణామములు అర్పించు. తరవాత వాతాపిగణపతిగా పేరుపొందిన ఈ దేవుని గురించి, వాతాపినగరం గురించి సవిస్తరంగా చెప్తాను," అని అన్నాడు ధౌమ్యుడు.

అర్జునుడు పూజాక్రమం జరిపి, వాతాపి గణపతిని భక్తి ప్రపత్తులతో ఆరాధించాక ధౌమ్యుడు వాతాపి నగరంలోకి దారి తీశాడు. అతని వెనుక అర్జునుడు వెళ్ళి నగరాన్ని చూశాడు. ఒకప్పుడు ఆ నగరం మహా వైభవంతో వెలిగిన ఛాయలు గోచరించాయి. కాని ఇప్పుడు నగరం ఆలనా పాలనా లేక బీడుపడి ఉన్నది. లెక్కకు రాని కొద్ది మంది పౌరులు కనిపించారు. అర్జునుడి రాకకు వారు సంతోషంతో స్వాగతం పలికి, పాలనావ్యవస్థ ఏర్పరిచి నగరాన్ని పునరుద్ధారణ చేయమని ప్రార్థించారు.

"అర్జునా! ఇది వాతాపినగరం. నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వరుడు అగస్త్య మహామునిచే నెలకొల్పబడిన అద్భుత శిల్పం. ఇది వాతాపిగణపతి క్షేత్రంగా పిలువబడుతున్నది. విశేషాలు చెప్తాను విను!" అంటూ ధౌమ్యుడు చెప్పడం ప్రారంభించాడు:

గంగ, కవేరుడు అనే రాజర్షి కమండలువులో పడి కావేరిగా రూపు ధరించి, అతని కుమార్తెగా ఆశ్రమంలో పెరిగింది. అగస్త్యుడు ఆ కన్యను చూసి వివాహం చేసుకుంటానని కవేరుడితో చెప్పాడు.

కవేరుడు తన సమ్మతిని తెలిపి, "అగస్త్యా! కావేరి అభిమతం కూడా తెలుసుకుంటే మంచిది గదా!" అన్నాడు.

అగస్త్యుడు ఆశ్రమంలో కావేరితో చనువుగా ఉంటూ ఉండగా ఒకనాడు కావేరి అతనితో సహ్యపర్వతం మీద వనవిహారం చేయాలని ఉందని చెప్పింది. అగస్త్యుడు కావేరిని తీసుకెళ్ళాడు.

వనవిహారం చేస్తూ ఒక చిన్న మడుగులో తామరపువ్వును చూసి

ముచ్చటపడుతూ, కావేరి చరచరా వెళ్ళి, దాన్ని తీసుకోడానికి మడుగులో అడుగు పెట్టింది. నీటితాకిడితో ఆమె అమాంతంగా జలరాశిగా మారిపోయి, వరదలా పొంగి సహ్యపర్వత శిఖరాల నుండి జలజలా జారుతూ కావేరి నదిగా పరవళ్లు తొక్కుతూ ప్రవహించింది.



అగస్త్యుడు కావేరినే తలచుకొంటూ చాలాకాలం బ్రహ్మచారి గానే ఉండి పోయి, గొప్ప తపస్సు చేసి ఋషి శ్రేష్ఠుడు అనిపించుకున్నాడు. ఒకనాడతడు అరణ్యంలో చెట్టుకొమ్మకు తల క్రిందులుగా వ్రేలాడుతున్న పితృ దేవతలను చూసి, ఎవరు మీరు? ఎందుకిలా ఉన్నారని అడిగాడు.

వారు నిట్టూర్పులు విడుస్తూ, "మా వంశీకుడు అగస్త్యుడు ఒక ఇంటివాడై సంతానం కనేవరకూ ఇలాగే ఉంటాము!" అని చెప్పారు.

అగస్త్యుడు తన దివ్యదృష్టితో విదర్భ రాజుకు కావేరి అంశతో కుమార్తె పుట్టి, లోపాముద్ర పేరుతో పెరిగి యుక్త వయస్కురాలై ఉన్నట్లు తెలుసుకొని వెళ్లి, ఆమెను తన కిచ్చి వివాహం చేయవలసిందని విదర్భరాజును కోరాడు.

కందమూలాలు తింటూ నార కట్టుకు తిరిగే మునికి సుకుమారి రాకుమారిని ఎలా యివ్వడం? యివ్వకపోతే శపిస్తాడేమో అని రాజు సంశయపడుతూ వ్యాకుల చిత్తుడై ఉండగా, లోపాముద్ర అగస్త్యుడితో నిరభ్యంతరంగా వెంటనే తన వివాహం జరిపించమని చెప్పింది.

విదర్భరాజు ఆ విధంగానే లోపాముద్రను అగస్త్యమహర్షి కిచ్చి అతనితో పంపాడు.

అగస్త్యుడు లోపాముద్రతో తన ఆశ్రమానికి వచ్చాక ఒకనాడు, "నా పితృ దేవతలను పున్నామనరకం నుండి తరింప జేయడానికి నీ వలన సంతానం కనాలని నిన్ను వివాహం చేసుకున్నాను!" అని లోపాముద్రతో అన్నాడు.



అప్పుడామె తన ముతక చీర చూసుకొని విచారిస్తూ, ''వివాహం చేసుకోగానే సరా! నేను రాజపుత్రికగా పుట్టి పెరిగినదాన్ని. నాకు తగ్గ మంచి బట్టలు, రత్నాభరణాలు సమకూర్చడం నీ విధి. అందుకు కావలసినంత ధనం సంపాదించుకురావడం నీ కర్తవ్యం!'' అన్నది.

అగస్త్యుడు భార్య మాటల్లోని వాస్తవాన్ని గ్రహించి, ధనసేకరణకు బయలుదేరాడు. అతడు చాలామంది రాజుల దగ్గిరికి వెళ్ళి, రాజ్యపాలనకు సరిపడగా మిగిలిన ధనాన్ని తనకిమ్మన్నాడు. ఏ రాజు కూడా మిగులు చెప్పలేదు సరికదా ఎంతో లోటు పడుతూన్నట్లుగా చెపుతూ, తమకు కూడా ఏమైనా ధనలాభం కలిగే మార్గం చూపమని వేడుకున్నారు.

అగస్త్యుడు హతాశుడై అరణ్యమార్గంలో వెళ్తూ, ఒకచోట ఉన్నతమైన ఒక మహాశిలను చూశాడు. ఆ రాయి లంబోదరుడైన విఘ్నేశ్వరుడిని పోలినట్టుగా కనిపించింది. ఆ మహాశిలనే విఘ్నేశ్వరుడిగా భావిస్తూ అగస్త్యుడు నమస్కరించి, ''గణపతీ! తపస్సు తప్పితే రెండో ధ్యాస లేనివాణ్ణి. ధన సంపాదనకు విద్య లేవీ నాకు తెలియవు. ధనం నాకు ఎలాగ లభిస్తుంది? నీవైనా నాకు ఒకదారి చూపవా?'' అంటూ వేడుకున్నాడు.

అప్పుడు, ''ఏమిటి, మహర్షీ! శిలతో మంతనాలాడుతున్నావు!'' అంటూ విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించాడు.

అగస్త్యుడు ప్రణమిల్లి మ్రొక్కి తన మొర వినిపించాడు.

విఘ్నేశ్వరుడు, ''అగస్త్యా! రావలసిన చోటుకే వచ్చావు, రావలసినవాడివే వచ్చావు. కొంచెంసేపట్లో ఇల్వలుడు నిన్ను భోజనానికి పిలుస్తాడు, వెళ్ళు! ఇల్వలుడి దగ్గిర అంతులేని ధనరాశి మూలుగుతూ ఉంది. నీ వలన కాగల కార్యం కూడా ఉంది!'' అన్నాడు.

అగస్త్యుడు, ''గణపతీ! ఈ మహాశిలలో నీ పోలికలు నాకు కనిపించాయి.



అందుచేత, ఈ శిల అపూర్వ గణపతి విగ్రహంగా రూపొందాలనే నా కోరిక కూడా సఫలంచెయ్యి!'' అని కోరాడు.

విఘ్నేశ్వరుడు, "అలాగే అవుతుందిలే!" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

అగస్త్యుడు చాలా అలసి ఉన్నాడు. ఆకలిగా కూడా ఉంది. ఆయాసంగా మహా శిలను అనుకొని కూర్చొని అలా చూస్తూండగా, అతిథులను వెంటబెట్టుకొని వస్తున్న ఇల్వలుడు కనిపించాడు. అగస్త్యుడికి విషయమంతా తృటిలో తెలిసిపోయింది.

ఆ అరణ్యంలో వాతాపి, ఇల్వలుడు అనే గొప్ప మాయావులైన రాక్షసులు ఋషులను, యాత్రికులను, బాటసారులను చంపి ధనాన్ని దోచుకొని, పెద్ద రాతిదుర్గంలో పోగుచేస్తున్నారు. ధర్మమూర్తీభవించిన మహారాజు వేషంతో ఇల్వలుడు ఆతిథ్యానికి తీసుకువచ్చిన వారికి వినయవిధేయతలతో మర్యాదలు కుశలప్రశ్నలు జరుపుతున్న సమయంలో, వాతాపి బాగా కొవ్వుపట్టిన మేకపోతుగా మారుతాడు. ఇల్వలుడు ఆ మేకను తెచ్చి చంపి వండించి, మేకమాంసంతో భోజనం పెడతాడు.

అతిథులు భుక్తాయాసంతో విశ్రమిస్తున్న సమయంలో ఇల్వలుడు గొంతెత్తి, ''వాతాపీ!'' అని పిలుస్తాడు. వాతాపి అతిథుల పొట్టలు చీల్చుకొని వస్తాడు. ఆ దుర్మార్గులు చేస్తున్న పనికి అగస్త్యుడి ఒళ్ళు మండిపోయింది.

ఇల్వలుడు అగస్త్యుణ్ణి సమీపించి, వీడెవడో చాలా గొప్ప ఋషిలా ఉన్నాడు. ఇలాంటి వాళ్ళను ఎంతమందిని హతమార్చితే అంత మంచిది, అని అనుకుంటూ సవినయంగా భోజనానికి ఆహ్వానించాడు.

అగస్త్యుడు ఆకలితో అలమటించిపోతూన్నవాడిలాగ పరమానందం కనబరిచి, ''ఓ ధర్మదాతా! నీ లాంటి వాళ్ళుండబట్టే యీ భూమండలం అనంతాకాశంలో యిలా నిలిచి ఉంది. పద!'' అంటూ ఇల్వలుడి వెంట రాతి

దుర్గానికి వెళ్ళి, "ఓ అన్నదాతా! చాలా రోజులుగా తిండి లేదు, ఆకలి దహించేస్తున్నది. వెయ్యి యజ్ఞాలు జరిపించినవాణ్ణి కావడంవల్ల, మేకమాంసం తప్పితే మరేదీ అరగని రోగం ఒకటి పట్టుకున్నది. అంచేత, ముందు నాకు ఆ మాంస భోజనం పెట్టి నన్ను పంపించు," అన్నాడు.



ఇల్వలుడు, "స్వామీ! మీ కోసమే రాసిపెట్టి ఉన్నది కాబోలు, మా ఇంట చిరకాలంనించీ ఒక మేకపోతు పెరుగుతూ బాగా కొవ్వుపట్టి ఉన్నది!" అని చెబుతూ వెంటనే మేకరూపంలో ఉన్న వాతాపిని చంపించాడు.

అగస్త్యుడు మేకను చూసి, "ఆహా! ఏం మేక, ఏం మేక! వెయ్యి యాగాలు చేయించానన్న మాటే గానీ ఇలాంటి మేకను రుచిచూడలేదు, నాయనా! ముందు దీని గుండెకాయ మొదలైన మేలు ముక్కలన్నీ నాకు పెట్టి, ఆ తర్వాత మిగతాది అతిథులకు పెట్టు! ముందే చెబుతున్నాను, మరేం అనుకోకు. మాంసం తప్ప మరేదీ నేను తినలేను సుమా! నేను తినగలిగినంతా నాకు వడ్డించాలి, మర్చిపోకు!" అన్నాడు.

ఇల్వలుడు అగ్నిలో మేకను కాల్చి, మాంసం వండించి అగస్త్యుడికి పెట్టాడు. ఎంత వడ్డించినా తినేస్తూ అగస్త్యుడు పూర్తి మేకపోతు మాంసం ఆరగించి త్రేన్చాడు. ఇల్వలుడు ఆశ్చర్యంతో పాటు కొంచెం భీతి కూడా పడుతూ, "స్వామీ! తమరు మంచి ఘనాపాఠీల్లాగున్నారే!" అన్నాడు.

అగస్త్యుడు చిరునవ్వి, "ఘనాపాఠీల్లో ఘనాపాఠీగా మన పేరు ముల్లోకాలకూ తెలుసునోయీ! ఏదీ, కాస్త మద్యం తెప్పించు! ఒక కుండెడు చాల్లే!" అన్నాడు.

ఇల్వలుడు మరింత నివ్వెరపోతూ, "కుండెడు మద్యం తాగుతారా, స్వామీ!" అన్నాడు.

అగస్త్యుడు, "మన పొట్టకు సముద్రాలే చాలవు!" అన్నాడు.

ఇల్వలుడు, "అలాగే తాగుదురుగాని. మా వాడు వాతాపి తెప్పిస్తాడు!" అని చెబుతూ, "వాతాపీ!" అంటూ గొంతెత్తి కేక వేశాడు.

అగస్త్యుడు నెమ్మదిగా, "ఇంకెక్కడి వాతాపి! వాతాపి మరి రాడు. జీర్ణం, జీర్ణం, వాతాపి జీర్ణం!" అంటూ కడుపు నిమురుకుంటూ, "వాతాపి హరించి పోయాడు!" అన్నాడు.

ఇల్వలుడు ప్రాణభీతితో గజగజ వణికి పోతూ జాడలేకుండా పారిపోయాడు. ఆ విధంగా వాతాపి ఇల్వలుల దారుణ హత్యాకాండల మాయా నాటకం అంతమైంది.

ఆ తరువాత అగస్త్యుడు మిగతా అతిథులకు జరిగిందంతా చెప్పి, రాతి దుర్గంలో కుప్పతెప్పలుగా పడి ఉన్న అస్తిపంజరాల్నీ, కపాల రాసులనూ చూపించాడు. వారంతా గుండెలు బాదు కుంటూ, బ్రతికి బయట పడ్డందుకు అగస్త్యుడికి ప్రణమిల్లి మ్రొక్కారు.

ఆ దుర్గంలో పదిలంగా భద్రపరిచి ఉన్న ధనరాసుల్ని అగస్త్యుడు చూశాడు. తనకు కావలసినది పోగా మిగిలిన ధనంతో ఒక మహానగరం నిర్మించవచ్చు. వేలాది మంది సుఖంగా జీవించవచ్చు నని ఆయనకు తోచింది.

వెంటనే అగస్త్యుడు అందరికీ ధనాన్ని పంచడం మొదలు పెట్టాడు. ఆ సంగతి విని, సమీప రాజ్యాల నుండి ఎంతో మంది ప్రజలు అక్కడకు చేరుకొని, అగస్త్యు డిచ్చిన ధనంతో ఇళ్ళు కట్టుకొని స్థిరపడ్డారు.

అగస్త్యుడికి విఘ్నేశ్వరుడి ఆకారం లాగ కనిపించిన మహాశిల కేంద్రంగా చుట్టూరా ఒక మహానగరం తయారైంది. వాతాపి జీర్ణంతో ఏర్పడిన ఆ నగరం వాతాపి నగరంగా పేరు పొందింది. అగస్త్యుడు స్వపరిపాలనా సూత్రాలను శిలాఫలకాల మీద చెక్కించి, నగరంలో పెట్టించాడు. ప్రజలే పాలకులుగా ఆదర్శప్రాయమైన ప్రజారాజ్యం ఏర్పడింది.






వాతాపినగర మధ్యంలో ఉన్న మహాశిల విఘ్నేశ్వర శిల్పంగా రూపొందాలనే కోరిక అగస్త్యుడికి మిగిలిపోయింది. లోపాముద్ర చిత్రకళా ప్రవీణురాలు. ఆమె అక్కడకు వచ్చి మహాశిలను పరిశీలించి, అది ఏ విధంగా రూపొందాలో అలాంటి విఘ్నేశ్వరుని రూపరేఖా చిత్తరువును తయారుచేసింది.

రేఖాచిత్రమైతే తయారైంది గాని, ఆ ప్రకారంగా మహాశిలను మలచగల శిల్పులు, శిల్పాచార్యుడు ఎంత ప్రయత్నించినా లభించలేదు. అగస్త్యుడు చింతాక్రాంతుడై మహాశిల ఎదురుగా కూర్చొని, చిత్రపటాన్నీ, శిలనూ పదేపదే చూసుకుంటూ కాలం గడుపుతున్నాడు.

వచ్చిన శిల్పాచార్యు లందరూ చిత్రం చూసి, "ఇలాంటి శిల్పం మలచటం దేవశిల్పి విశ్వకర్మకో, దానవశిల్పి మయుడికో తప్ప ఇతరులకు సాధ్యం కాదు!" అంటూ వెనక్కు జంకారు.

శిల్పులు ఉలులను మహాశిల మీద పరీక్షించి, "ఇది వజ్రపాషాణం. దీన్ని చెక్కడానికి మామూలు ఉలి పనికేరాదు, వజ్రపు ఉలులుండాలి. దేవతలో, యక్షులో వచ్చి చెక్కవలసిందే కాని, మానవమాత్రుల తరంకాదు!" అంటూ చెప్పారు.

ఆ సమయంలో దేవశిల్పి విశ్వకర్మ భార్య విష్ణుమానస పుత్రిక విశ్వకళ అలిగి పుట్టింటికి వెళ్ళి వున్నది. విశ్వకర్మ మతి

16. విఘ్నేశ్వర మహాశిల్పం



స్థిరం పోగొట్టుకున్నాడు. దానవశిల్పి మయుడు అతని అప్సర భార్య హేమ తిరిగి దేవలోకానికి వెళ్ళిపోగా, పిచ్చివాడై జాడలేకుండా ఎక్కడో తిరుగుతున్నాడు. విశ్వకర్మనో, మయుణ్ణో పిలుద్దామన్నా వారి స్థితి అంత అధ్వాన్నంగా ఉంది.

అగస్త్యుడికి మహాశిలను విఘ్నేశ్వర విగ్రహంగా రూపొందించడం సమస్యగా నిలిచిపోయింది. నిద్రాహారాలు మాని అతడు శిల కెదురుగా అలాగే దివారాత్రాలు కూర్చొని విఘ్నేశ్వరుణ్ణి ధ్యానిస్తూ, "గణపతీ! నా కోరిక కోరికగానే ఉంచేశావు. ఇక నీదే భారం!" అని స్మరణ చేస్తూ దిక్కులు చూస్తూ నిరీక్షించసాగాడు.

ఒకనాటి సంధ్యాసమయంలో దోరపు బొజ్జ ఊపుకొంటూ గుజ్జుగా ఉన్న ఒక బాలప్రాయంవాడు అటు వస్తున్నాడు. అతని చేతిలో ఏదో ఉలి లాంటిది పిడితో ధగధగా మెరుస్తున్నది. కండలు తేరి ఉన్నాడు, శిల్పి లాగ కనిపించాడు.

అగస్త్యుడు ఆశగా అతని చేత నున్న దాన్ని బాగా పరికించి చూడగా, అది ఏనుగుదంతం కొనముక్క పిడిలో బిగించి నట్టుగా తెలుసుకుని ఆశ్చర్యపోయాడు.

ఆ తరుణశిల్పి, అగస్త్యుణ్ణి సమీపించి, "ఏమిటో మహర్షులవారు మహాశిల ముందు మంతనాలాడుతూ కూర్చున్నారు; ఏమైనా పని దొరుకుతుందేమో నని యిలా తిరుగుతున్నాను!" అన్నాడు.

అతని మాటలు మధురంగా అగస్త్యుడికి పారవశ్యాన్ని కలిగించాయి.

"చిరంజీవీ! ఈ మహాశిలను గణపతి దేవుడి విగ్రహంగా చూడాలని ఎన్నో దినాలుగా ఉవ్విళ్ళూరుతున్నాను," అంటూ తన దగ్గిరున్న రేఖాచిత్రాన్ని శిల్పికి చూపించి, "ఇంతకూ నువ్వెవరు? ఏం పని చేస్తావు?" అని అడిగాడు.

"నేను చేసే పనుల్లో మొదటిది పుష్టిగా తినడం, తర్వాత శిల్పం చెక్కటం. నన్ను బాలశిల్పాచార్యుడు అని పిలుస్తాంటారు!" అని బాలశిల్పి చెప్పాడు.



అగస్త్యుడికి అతడి మాటలతీరు మేను పులకరించే నవ్వు పుట్టించాయి. ఆయన అతణ్ణి సందేహంగా చూస్తూ, "మహా శిలను మహాశిల్పంగా రూపొందించే మహా శిల్పి కోసం పడిగాపులుపడి ఉన్నాను. శిల్పి నంటున్నావు గాని, బాలశిల్పివి; శిల బ్రహ్మాండమైనదీ, మహోన్నతమైనదీను! నీవేమో పొట్టి వాడివి. అలాంటప్పుడు, మహాశిల్పాన్ని మలచ గలవా అని ఏమని అడగ్గలను!" అన్నాడు నిట్టూరుస్తూ.

బాలశిల్పి నవ్వి, "బాలశిల్పి నైనంత మాత్రాన నా శిల్పం మహాశిల్పం కాదని అనుకోకు! మహా అని అన్నంతమాత్రాన గొప్పేమీ కాదు. మన ఉలికి సాధ్యంకానిదేదీ లేదు!" అంటూ ఉలిని తీసి చూపించాడు. అది ధగధగా వజ్రం లాగా మెరుపులు విరజిమ్ముతున్నది.

అగస్త్యుడు చూస్తూండగా బాలశిల్పి దంతం ఉలిని మహాశిల మీదకి విసిరాడు. ఉలి మొన తాకిడితో పెద్ద మెరుపు, కాంతి, ఉరిమిన శబ్దమూ వెలువడ్డాయి. అక్కడ శిలకు ఒక రంధ్రం ఏర్పడింది.

"అది నాభిస్థానము. మూర్తి శిల్పానికి నాభిస్థానము చాలా ముఖ్యమైనది; అందునా లంబోదరుడి నాభి! లంబోదరంతో శిల్పం ప్రారంభమవుతున్నదన్న మాట!" అని బాలశిల్పి చెప్తూంటే, రాతినుండి 'లంబోదర లక్ష్మీకరా....' అంటూ మాళవ రాగంలో సన్నగా పాట అగస్త్యుడికి వినిపించింది.

"ఇది అయస్కాంతరాయి! చెక్కుతున్నప్పుడు ప్రచండమైన విద్యుత్తు వెలువడుతుంది. గనక శిల్పం చెక్కడం పూర్తయ్యేవరకూ, ఈ చుట్టు పక్కల పిట్ట మనిషి ఉండకూడదు. గొప్ప ధ్వనులు కూడా వినిపిస్తాయి. నగరవాసులు భయపడి కంగారుపడ నవసరం లేదు. ఓ మహర్షీ, ఇక నీవు వెళ్ళవచ్చు. వెళ్ళి నిశ్చింతగా నిద్రతీయి. తెల్లవారు



ఝాముకి శిల్పం పూర్తవుతుంది!'' అని చెప్పాడు బాలశిల్పి.

అగస్త్యుడు ఆశ్చర్యపడ్డాడే గాని, అంతకు మించి మరేమీ అతనికి తోచ లేదు. అతని బుద్ధి ఏదో నిద్రలో పడ్డట్టుగా ఉంది! కొంచెం తేరుకొని అగస్త్యుడు రేఖా చిత్ర పటాన్ని తీసి బాలశిల్పికి యివ్వ బోతుంటే, ''ఇదివరకే చూపించావుగా, ఒక్కసారి చూస్తేచాలు. పదే పదే చూసు కుంటూ చెక్కేరకం మహాశిల్పిని కాను, శిల్పం ఒక ఆటలాగ చెక్కుకొనే కేవలం బాలశిల్పిని! అంతా అయ్యాక చిత్రం గీచిన వారిని వచ్చి చూసుకోమను, సరిగ్గా ఉందో లేదో! చిత్రానికి ఎంత యిచ్చావే ఏమో గాని, నా కేమాత్రం ప్రతిఫలం ముట్ట జెపుతావో చూడాలి!'' అని బాల శిల్పి అన్నాడు. చివరి మాటలు అగస్త్యు డికి దిగులు పుట్టించాయి.

తన భార్య లోపాముద్ర కోరికమేరకు తీసి ఉంచిన ధనం తప్పితే తన అధీ నంలో యింకేమీ లేదు, అంతా పంచి పెట్టేశాడు. శిల్పికి పారితోషికంగా ఆ కొద్ది పాటి ధనమూ యిచ్చివేయక తప్పదు. లోపాముద్రకు ఏమని చెప్పడం? అలా అనుకుంటూ అగస్త్యుడు వెళ్ళేసరికి లోపాముద్ర ముఖం తేజోవంతంగా దీపం లాగ వెలిగిపోతున్నది. ఏమిటి సంగతి? అన్నట్లు భార్యవంక చూశాడు.

లోపాముద్ర పొంగిపొర్లే ఆనందంతో, ''అగస్త్యులవారు నన్ను మన్నించాలి! ఋషిపత్ని ఋషిపత్ని లాగే ఉండాలనీ, అదే ధర్మమనీ నాకు తొలుత నుండీ తెలిసినదే. నగలు, మంచి బట్టలు కావా లని, ధనం సేకరించుకు రమ్మని నేను ఎందుకన్నానో, నాకే ఆశ్చర్యంగా ఉంది ఇప్పుడు. ఏదో ఒక మహత్కార్యం నెరవేరడానికి అనిర్వచనీయమైన ఏదో శక్తి నా నోట ఆ మాటలు పలికించినట్లు తోస్తున్నది. నాకు ఏ ఆభరణాలూ వద్దు, ఏ పట్టుచీరలూ వద్దు, ఏ ధన సేకరణా వద్దు! నాలో తాత్కాలికంగా ప్రవేశించిన

అజ్ఞానం యిప్పుడిప్పుడే తొలగిపోయింది!'' అని అన్నది.

ఆమె మాటలకు అగస్త్యుడు లోలోపల సంతసించాడు.

''శిల్పి కుదిరాడు శిల్పం తయారౌతున్నట్లే, తెల్లవారేసరికి పూర్తి అవుతుం దట!'' అన్నాడు ఋషి.

''ఏమిటేమిటీ! తెల్లారేసరికి ఆ మహాశిల, శిల్పం అవుతుందా? ఆ శిల్పి మానవుడా, దేవుడా?'' అన్నది లోపాముద్ర.

''మానవమాత్రుడే, బాలుడు కూడా. ప్రతిఫలం ఎలా యివ్వాలో, ఎంతివ్వాలో ఏమీ తోచకుండా ఉంది,'' అన్నాడు అగస్త్యుడు.

''నా నిమిత్తంగా తీసి ఉంచిన ధనం ఉందిగా, అది చాలదా?'' అన్నది లోపాముద్ర.

''సరే, తెల్లవారాక ఎదో ఒకలాగ సరిపెట్టవచ్చు,'' అన్నాడు అగస్త్యుడు.

''అన్నట్టు, రేపు భాద్రపద శుద్ధ చతుర్థి, వినాయకచవితి రోజు! శిల్పం ధ్యాసలోపడి మీరు నెలలు, తిథులు మరిచినట్లున్నారు,'' అన్నది లోపాముద్ర.

''ఏమిటీ! రేపు వినాయకచవితి, విఘ్నేశ్వర శిల్పం తయారవడం! చిత్రంగా ఉందే!'' అంటూ అగస్త్యుడు ఆశ్చర్య పడుతూంటే, లోపాముద్ర, ''ఆ శిల్పి




బాలుడూ కాడు, మానవమాత్రుడూ కాడు!'' అన్నది.

భార్య మాటల్లో ఎదో అద్భుత సత్యం ఉందనిపించింది, అగస్త్యుడికి. చాలా రాత్రయింది, నిద్ర పట్టలేదు, కుతూహలం పెరిగింది, ఏం జరుగుతున్నదో చూడాలని అగస్త్యుడు బయలుదేరాడు.

అగస్త్యుడు మహాశిల సమీపాన్ని చేరే సరికి కనిపించిన దృశ్యానికి అతని ఒళ్లు జలదరించింది. అలాగే అక్కడ చతికిల బడిపోయాడు. కొన్ని వందల ఉలులు శిల్పాన్ని వాటంతట అవే చెక్కుతున్నవి. రంగు రంగుల విద్యుత్కాంతులు మిరుమిట్లు గొల్పుతున్నవి. ఖణఖణ ధ్వను




లతో హోరుమంటూ శబ్దం వెలువడుతున్నది. ఉలులన్నీ ఏనుగుదంతం కొనముక్కల్లాగ వజ్రాల్లా మెరిసిపోతున్నవి. అది స్వప్నమో నిజమో తెలియని విభ్రాంతిలో మైకం కమ్మి, అగస్త్యుడు అలాగే సొమ్మసిల్లి నిద్రలో పడిపోయాడు.

అలా నిద్రపోయిన ఋషి కళ్ళు తెరిచే సరికి ఎదురుగా తట్టి లేపుతున్న బాలశిల్పి కనిపించాడు. తూర్పు తెల్లనవుతున్నది.

"ఏమిటి, మహర్షీ! ఇక్కడ ఇలా నిద్రిస్తూ కలగంటున్నావు? యోగవిద్యాపారంగతుడవైన నీకు యీ కలల నిద్ర ఏమిటి! శిల్పం పూర్తయింది. చిత్రం గీచిన వారిని వచ్చి చూసుకోమను; చిత్రించినదంతా సరిగ్గా శిల్ప రూపం పొందిందో లేదో!" అని బాలశిల్పి అంటూండగా, పళ్ళెరం నిండా కుడుములూ, జలమూ, పూలు పట్టుకొని లోపాముద్ర వచ్చింది.

అగస్త్యుడు సంభ్రమాశ్చర్యాలతో స్ఫటికం లాగ మెరిసిపోతూన్న విఘ్నేశ్వర మహా శిల్పాన్ని చూస్తూండగా, బాలశిల్పి అతనితో, "నాకు ప్రతిఫలం ఏమిస్తావో యివ్వుమరి," అన్నాడు.

అగస్త్యుడు మాట తడబడుతూ, "మహా శిల్పి! నీకు ఏమిచ్చినా చాలదు, అయినా చంద్రుడికో నూలుపోగన్నట్లు కొద్దిపాటి ధనం తీసి ఉంచాను, తెస్తాను!" అన్నాడు.

బాలశిల్పి, "సరే, ఇంతకూ రేఖాచిత్రరచన చేసినందుకు ఏమిచ్చావో అది చెప్పు ముందు? శిల్పం చెక్కడం శ్రమ మాత్రమేగాని గొప్పతనమంతా శిల్పాకృతికి మూలమైన రేఖాచిత్రానిదే. చిత్రణ ఊహాసంపన్నమైన మేధస్సుతో కూడిన కళ!" అన్నాడు.

"అయ్యా, బాలశిల్పాచార్యా! చిత్రించిన వారికి వేరే ఏమీ యివ్వనవసరం లేదు. ఆ చిత్రం తయారుచేసింది నా భార్యే!" అంటూ లోపాముద్రను చూపిస్తున్నట్లుగా ఆమె వంక చూశాడు

అగస్త్యుడు. లోపాముద్ర ఏదో తన్మయా వస్థలో మునిగి ఉన్నది.

"ఏమి మాట మహర్షీ! నేనే అయితే ఒక మహానగరాన్ని నిర్మించడానికి సరిపడే ధనాన్ని చిత్రణకు యిచ్చి ఉందును. అంత గొప్ప రేఖాచిత్రమది. ఆ ధనం ఆ యమ్మకే చెందుతుంది!" అన్నాడు బాలశిల్పి.

అగస్త్యుడు, "అసలు ఆ ధనాన్ని ఆమె కోసమనే తీసి ఉంచాను!" అని నోరుజారి అన్నాడు.

బాలశిల్పి ఆశ్చర్యంగా, "ఏమిటీ! ఇంతకూ అది స్త్రీ ధన మన్నమాట! చెప్పావు గనక సరిపోయింది. నువ్వి చ్చినా, నేను పుచ్చుకున్నా ఎంత అన్యాయం మూట గట్టుకొనే వారమో కదా! అందులోది చిల్లిగవ్వ కూడా నాకు అక్కరలేదు," అంటూ లోపాముద్ర వంక చూసి, "అమ్మా! నీ చేత్తో ఒక్క బిళ్ళ కుడుము నాకు పెట్టు, నా కదే చాలు! చెక్కిందానికి బొక్కిందే కూలి అని బ్రహ్మ శిల్పుల నుదుట ఎప్పుడో రాసి పెట్టేశాడు!" అని అన్నాడు.

ఆ మాటలు వినడంతోనే లోపాముద్ర కుడుముల పళ్ళెరాన్ని అతని ముందు పెట్టి, సాష్టాంగపడి బాలశిల్పి పాదాలు పట్టుకొని, "విఘ్నేశా! నీ అనుగ్రహంతో, మా జన్మలు తరించాయి!" అన్నది. బాలశిల్పి అదృశ్యమయ్యాడు.

అగస్త్యుణ్ణి ఆవరించిన మాయ విడి పోయింది. విఘ్నేశ్వర మహా శిల్పం ముందు ప్రణమిల్లి, "విఘ్నేశ్వరా! నేనెంతో గొప్ప యోగబలం గల వాడి ననీ, తపశ్శాలిననీ గర్వపడుతూండే వాడిని. కాని, నీ ముందు పడి అజ్ఞానినై పోయాను. ఎంతటి వాడైనా, నీ మాయకు అతీతుడు కాడు!" అంటూ నమస్కా రాలు చేస్తూ లెంప లేసుకుంటూంటే, శిల్పంలోని దేవతా విగ్రహాలన్నీ పాడు తూన్నట్లుగా, 'వాతాపి గణపతిం భజే హం!....' అనే కీర్తన హంసధ్వని రాగంలో మారుమ్రోగుతూ వినిపించింది.





# విఘ్నేశ్వరుడు

విఘ్నేశ్వర శిల్పంలోని దేవతావిగ్రహాల గానానికి తన్మయుడైన అగస్త్యుడు, ''వాతాపి గణపతీ! నీ అద్భుత శిల్పాన్ని నీవే మలచుకొన్నావు! ఇటువంటి మహోన్నత శిల్పం చెక్కడం ఎవరితరం!'' అన్నాడు.

అప్పుడు విగ్రహంలోనుంచి, ''అగస్త్య మహర్షీ! నా కోసమని నేను శిల్పం మలచుకోలేదు, నీ తృప్తి కోసం నీ కోరిక నెరవేర్చాను, అంతే! అందువల్ల ఈ మహా శిల్పం కొంతకాలం మాత్రమే ఉంటుంది, అటు పిమ్మట అదృశ్యమౌతుంది! ద్వాపరంలో ధర్మరాజు అశ్వమేధయాగ సందర్భంలో, ఇదే స్థానంలో మరొక పెద్ద విగ్రహం ప్రతిష్ఠింపబడుతుంది!'' అంటూ విఘ్నేశ్వరుని మాటలు వినిపించాయి - అని ధౌమ్యుడు అర్జునుడితో చెప్పి, ''అర్జునా! ఆ మహా శిల్పాన్నే మనం చూస్తున్నాం,'' అని ఆగాడు.

అర్జునుడు మహాశిల్పం చుట్టూరా పలుమార్లు ప్రదక్షిణాలు చేసి, భక్తిశ్రద్ధలతో పరిశీలించాడు. మహాశిల్పం విఘ్నేశ్వరుడే. ఆ విఘ్నేశ్వరుడిని అంటిపెట్టుకొని త్రిమూర్తులు, జగదంబ, లక్ష్మిపార్వతీ సరస్వతులు, నవగ్రహాలు మొదలుకొని అనేకమంది దేవతలు మనోహరశిల్పాలుగా మలచబడ్డారు. విఘ్నేశ్వరుని రెండు పాదాల ఇరుకున విఘ్నం బంధింపబడి ఉన్నది, ఎలుకరాజుతో క విగ్రహం చుట్టూరా వలయం చుట్టి ఉన్నది. శిల్ప



శోభ తిలకించడానికి వేయికళ్ళున్నా చాలవు అనిపిస్తున్నది. తనివితీరా చూశాక అర్జునుడు ధౌమ్యుడితో, "ఆచార్యదేవా! ఇంతటి మహనీయశిల్పం చుట్టూరా నెలకొన్న వాతాపినగరం మహోన్నతదశ అనుభవించి యిప్పుడెందుకిలా ఉంది? వాతాపినగర గాథ వినాలని కుతూహలపడుతున్నాను!" అన్నాడు.

ధౌమ్యుడు తిరిగి చెప్పడం ప్రారంభించాడు :

అగస్త్యుడు లోపాముద్ర ఆదేశానుసారం ఏమీ మిగుల్చుకోకుండా, ఉంచిన ధనాన్ని అందరికీ పంచేసి, ప్రజారాజ్య పాలనా బాధ్యతలను పౌరధర్మాలను అనుసరిస్తూ సుఖజీవనం గడపండని ప్రజలకు చెప్పి, కట్టుబట్టలతో లోపాముద్రతో తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.

విఘ్నేశ్వర మహాశిల్పమే ప్రజారాజ్య మకుటంగా ఆరాధించుతూ వాతాపినగర ప్రజలు చిరకాలం క్రమబద్ధంగా సుఖజీవనం చేశారు. తరాలు మారాయి. ఆదర్శరాజ్యంగా, ప్రజారాజ్య మార్గదర్శకంగా దినదిన ప్రవర్ధనమానమై విస్తరించిన వాతాపినగరం దేశదేశాంతరాల్లో పేరు పొందింది.

అగస్త్యుడు తన్ను కూడా హతమారుస్తాడనే చావు భయంతో పారిపోయి, వింధ్యాటవుల్లో ఊరూ పేరూ లేని చీకటి బతుకు బతుకుతున్న ఇల్వాలుడు వాతాపినగరం పేరు ప్రఖ్యాతులు విని, అగస్త్యుడు అక్కడ లేడని తెలుసుకొన్న మీదట నయవంచనతో సాధించాలనే తలంపుతో, ప్రజాసేవనే జీవిత పరమార్థంగా పెట్టుకొన్న వాడిలాగ రూపు మార్చుకొని, వాతాపినగర ప్రజల మధ్యకు చేరాడు. అప్పటి పరిస్థితి కూడా ఇల్వాలుడికి అనుకూలంగా ఉంది.

క్రమక్రమంగా కాలమహిమ వల్ల, వాతాపినగర ప్రజల్లో స్వార్థచింత అంకురించి పెరగసాగింది. కలిమిలేములు ప్రారంభమయ్యాయి. ప్రజల్లో భేదాభి



ప్రాయాలు, పొరపొచ్చాలు తలదాల్చాయి. తెలివితేటలు, తెలివి తక్కువ వారిని వంచించడానికి పనికివచ్చాయి.

అలాంటి పతనదశ ప్రారంభంలో, ఇల్వలుడు ఒక ప్రజానాయకుడుగా తయారై ఇంద్రజాల విద్యలతో ఒక మహా పురుషుడుగా ప్రజలను ఆకట్టుకున్నాడు.

నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వర మహాశిల్పం మీద ప్రజలకు గురి ఉన్నంత కాలం అగస్త్యుణ్ణి, అగస్త్యుడు చెప్పిన నైతిక సూత్రాల్ని మరచిపోరనే విషయం గుర్తించాడు. తాంత్రిక విద్యలు, మద్య పానీయాలు ప్రజలకు రుచిచూపించాడు. అగస్త్యుడు నాటించిన ప్రజా రాజ్య సూత్రాల శిలాఫలకాలను ఊడబెరికించి, కొత్తకొత్త సూత్రాలు నూరిపోశాడు. ఒకరి నొకరు దోచుకోవడంలో ఉన్న ఆనంద విశేషాన్ని ప్రచారం చేశాడు. గిరిగీసుకొని కూచోడం మనిషిలక్షణం కాదనీ, కొత్త కొత్త సుఖాలు తెలుసుకోడానికే బ్రతకడం, అనే సిద్ధాంతానికి ప్రజల్ని మళ్ళించాడు. ప్రచ్ఛన్న వేషాలతో చాలామంది రాక్షసులు ఇల్వలుడికి తోడైనారు. ప్రజా సేవకుడుగా అవతరించి, ప్రజానాయకుడుగా తయారైన ఇల్వలుడు మహా నాయకుడై, ప్రజలపై అంకుశంగా మారాడు. అంతఃకలహాలు రేపాడు. వాతాపినగరం కొట్లాటలతో నిండి పోయింది. దుర్మార్గులు అమాయకులను వేటాడుతున్నారు. నగరం అల్లకల్లోలమై పోయింది. చాలామంది ప్రజలు నగరం విడిచి వెళ్ళిపోయారు.

ఇల్వలుడు నగర మధ్యంలో ఉన్న విఘ్నేశ్వర మహాశిల్పాన్ని నేలమట్టం చేయాలని ప్రయత్నాలు ఆరంభించాడు. శతఘ్నుల్ని చుట్టూరా గురిపెట్టించాడు. శిల్పం అడుగు నేలలో ప్రేలుడుమందు దట్టింపించి, అగ్గి ముట్టించడమే తరవాయిగా ఉన్న సమయంలో, అతి విచిత్రంగా అద్భుతం జరిగింది. నిప్పు తగిలించకుండానే మందుగుండు



వాతాపినగరం క్రమంగా తన పూర్వ వైభవాన్ని కోల్పోయి, కొద్ది మంది మనుష్యులతో మాత్రమే ఇప్పుడిలా బీడు పడిపోయింది, అని ధౌమ్యుడు చెప్పడం ముగించాడు.

అర్జునుడు అంతా విని అటు తిరిగి చూసి, ఆశ్చర్యంతో నోటమాట రాక అలా ఉండిపోయాడు. విఘ్నేశ్వర మహాశిల్పం కనిపించలేదు!

''అర్జునా, ఆశ్చర్యపడకు! మహా శిల్పం అదృశ్యమైపోతుందని యిదివరకే వింటివి కదా!'' అని ధౌమ్యుడు అంటూండగా ఆ చుట్టుపక్కల ఉన్న ఒక ముళ్ళపొదలో, ఒక పండుముసలి వికృతరూపుడు ఒక చేయి, ఒక కాలుతో నేల మీద శరీరాన్ని యీడ్చుకొని వస్తూ కెవ్వున అరిచి, మహాశిల్పం ఉండిన వేపు చేతులు చాచి జోడించి గిలగిలలాడుతూ చనిపోయాడు.

అర్జునుడు అది చూసి ఆశ్చర్యపోతూ, ''గురుదేవా! వాడే కదా ఇల్వలుడు!'' అన్నాడు.

ధౌమ్యుడు, ''ఔను, ఎప్పటికైనా దుర్మార్గులు అలాగే నశిస్తారు!'' అన్నాడు.

వార్తాహరుల చేత వాతాపి నగరానికి బయలుదేరి రమ్మని అర్జునుడు ధర్మరాజుకు కబురుపంపాడు.

ప్రేలింది. శతఘ్నిశకటాలు అటు నుంచి ఇటు వెనక్కు తిరిగి ప్రేలి గుండ్లవర్షం కురిపించాయి. ఆ అగ్నివర్షంలో దుర్మార్గులంతా మరణించారు. చాలా మంది వికలాంగులయ్యారు. వారిలో ఇల్వలుడు కూడా ఒకడు. ఇల్వలుడి ఒక కాలు, ఒక చేయి పోయింది. రక్తసిక్తమైన దేహంతో నేల దొర్లుతూన్న సమయంలో, ఇల్వలుడికి విగ్రహం నుంచి మాటలు వినిపించాయి.

''ఓరీ, ఇల్వలా! అంగవైకల్యంతో, ముసలితనంతో చివికి చివికి కుళ్ళుతూ చిరకాలం జీవించు! నీకు అదేసరియైన శిక్ష!'' అని విఘ్నేశ్వరుడు శపించాడు.

హస్తినాపురం నుండి ధర్మరాజు భీమ, నకుల, సహదేవులతో వాతాపి నగరానికి వచ్చాడు.

ఆ రాత్రి ధర్మరాజు విఘ్నేశ్వర మహా శిల్పం అంతర్ధానమైన ప్రదేశానికి ఎదురుగా కూర్చొని, "నా తమ్ముడు నీ మహా శిల్పం దర్శించాడు, దేవా! నాకూ ఆ భాగ్యం కల్గించవా? నీ మహనీయ శిల్పాన్ని ఎవరు చెక్కుతారు! సత్వరమే నీ విగ్రహ ప్రతిష్ఠ జరిపించే మహా భాగ్యాన్ని నాకు కల్గించు!" అని కన్నులు మూసి విఘ్నేశ్వరుని ధ్యానిస్తూ వేడుకొన్నాడు.



అప్పుడు అతని చెవుల్లో, "ధర్మజా! దేవశిల్పి విశ్వకర్మ, దానవశిల్పిమయుడు కలసి శిల్పులుగా వచ్చి విగ్రహాన్ని చెక్కుతారు. విగ్రహ ప్రతిష్ఠ జరిగిన వెంటనే యాగాశ్వం కదలివెళ్తుంది. నీ అశ్వమేధ యాగం జయప్రదంగా జరుగుతుంది. వాతాపినగరాన్ని పునరుద్ధారణ చెయ్యి! మీ పాండవ సంతతివారైన చంద్రవంశ రాజులు చిరకాలం ఈ నగరాన్ని పాలిస్తారు!" అనే వాక్కులు వినిపించాయి

ధర్మరాజు కళ్ళు తెరిచేసరికి ఎదురుగా మహోన్నతంగా విఘ్నేశ్వర మహాశిల్పం దేదీప్యమానంగా కనిపించి అంతర్ధానమైంది.

మర్నాటి ఉదయం ఒక తెల్లనివాడు, ఒక నల్లనివాడు ఆ దరిదాపుల్లో పొదల మధ్య ఉన్న పెద్ద స్ఫటికశిలను పరీక్షిస్తూ కనిపించారు. వారెవరైనదీ గ్రహించి ధర్మరాజు వారికి మ్రొక్కి మర్యాదలు జరిపాడు.

ఆ శిలను పెకలించడానికి తవ్వుతున్నప్పుడు, అక్కడ గొప్పనిధి దొరికింది. ఆ బంగారాన్ని ఇల్వలుడు నిక్షిప్తపరిచాడు. ఆ చోటు వదల్లేక చివికి చివికి వాడు చివరకు మరణం పాలయింది కూడా అక్కడే.

ధర్మరాజు ఆ నిధిని వాతాపినగర అభివృద్ధికి వినియోగించాడు.




ఇద్దరు మహాశిల్పుల చేతుల మీదుగా విఘ్నేశ్వరుని విగ్రహం, మహాశిల్పం అదృశ్యమైన చోటనే గొప్ప ఆలయము, పెద్ద మంటపము తయారైనాయి. విశ్వకర్మ మయుల శిల్పరీతుల అద్భుత సమ్మేళనంతో ఒక గొప్ప శిల్ప సాంప్రదాయానికి నాంది అయింది. భరతవంశం వారిచే నెలకొల్పబడినందువల్ల అది భారతీయ శిల్పంగా పేరొంది, కాలాల తరబడి గొప్ప ప్రఖ్యాతి పొంది చిరస్థాయిగా వర్ధిల్లింది.

ఆ విధంగా విఘ్నేశ్వర శిల్పం పూర్తి చేసి శిల్పులిద్దరూ ఎలాగ వచ్చారో అలాగే మాయమయ్యారు.

ఆలయంలో ధర్మరాజుచే విఘ్నేశ్వర విగ్రహప్రతిష్ఠ జరిగిన వెంటనే గుర్రం దౌడు తీసి పరుగెత్తింది. అర్జునుడు, భీముడు సైన్య సమేతంగా దాని వెనక బయలుదేరారు.

ధర్మరాజు అగస్త్యుడు ఏర్పరిచిన ప్రజారాజ్య పద్ధతులతో వాతాపినగర పాలన సాగేలా పాలనాదక్షత ఏర్పాటు చేసిన తరువాత నకుల సహదేవులతో హస్తినాపురానికి తిరిగి వెళ్ళాడు.

ప్రజారాజ్య పర్యాయపదంగా ఆ ప్రాంతం అగస్త్యరాజ్యమనీ, నగరం అగస్త్యనగరమనీ, కొంతకాలం పేర్కొనబడినవి. కాలక్రమాన వాతాపినగరం అనే పేరే స్థిరంగా నిలిచిపోయింది.

అర్జునుడు దిగ్విజయాన్ని ముగించుకొని గుర్రంతో హస్తినాపురం చేరాడు. అశ్వమేధయాగం జరిగింది. ధర్మరాజు యాగభాగాలను, విశ్వకర్మకూ, మయుడికీ ప్రత్యేకంగా అర్పించాడు. శిల్పులకు శిల్పానికి గౌరవ ప్రపత్తులు చేకూర్చాడు.

ధర్మరాజు తర్వాత పరీక్షిత్తు, పరీక్షిత్తు తర్వాత జనమేజయుడు పాలించారు. జనమేజయుడి సంతతి వారైన రాజులు వాతాపినగరాన్ని పాలించసాగారు.

వాతాపినగరాన్ని పాలించిన చంద్రవంశరాజులలో శత్రుంజయుడు గొప్ప

సామ్రాజ్యపిపాసి. వాతాపి నగరం రాజధానిగా వాతాపి సామ్రాజ్యాన్ని స్థాపించాడు. సైన్యాల్ని పెంచడానికి ప్రజల మీద విపరీతంగా పన్నులు వేశాడు. నిరంకుశపాలన సాగిస్తూ, ఇల్వలుడు మళ్ళా పుట్టాడు అని అనిపించుకున్నాడు.

అతని కుమారుల్లో కడపటివాడైన చళుకవర్మ చాలా మంచివాడు. అగస్త్యుడి ప్రజారాజ్య సూత్రాలపై గురిగలవాడు. విఘ్నేశ్వరుణ్ణి భక్తితో ఆరాధిస్తూ, విద్య పట్ల, కళలపట్ల ఆసక్తితో ఉండేవాడు. అగస్త్యుడి అంశ అతనిలో ఉన్నదని ప్రజలు అనుకునే విధంగా ప్రజాభిమానాన్ని సంపాదించాడు.

సామ్రాజ్య విస్తరణకు శత్రుంజయుడు కుమాళ్ళను ఆయత్తం కమ్మన్నాడు. చళుకుడు తండ్రితో, "జనహింస పరపీడనతో కూడిన సామ్రాజ్య విస్తరణ కసాయి వృత్తికంటే ఏం గొప్పది?" అని అన్నలతో కలిసి దండయాత్రకు వెళ్ళడం మానేశాడు.

శత్రుంజయుడు మండిపడుతూ, "ఔరా! సింహం కడుపున ఎలుక పుట్టినట్లు రాజవంశంలో తప్పపుట్టావు! నీకు తగిన శాస్తి జరగాలి!" అని అంటూ ఒక ఎలుకను పట్టి తెప్పించి, దానికి చుళుక అని పేరుపెట్టి, దానితో చళుకవర్మకు పెళ్ళి అని చాటించాడు.

చుళుక అసలు పేరు కళ్యాణకింకిణి! ఒక అప్సరస. ఇంద్రుడి శాపం వల్ల ఎలుకగా భూమ్మీద పడింది.

కళ్యాణవేదికపైన వున్న పెళ్లిపీటలపై రాకుమారుణ్ణీ, ఎలుకనూ చూసి, వచ్చినవారు చేసే కోలాహల పరిహాసానికి చళుకుడు సిగ్గుతో కృంగిపోవాలని శత్రుంజయుడు, ఆ విచిత్ర వివాహానికి రాజుల్నీ, ప్రజల్నీ ఆహ్వానించాడు. కాని చళుకవర్మ మందహాసంతో, "ఎలుకను మహారాజు కోడలుగా చేయించగల విఘ్నేశ్వరుడు, ఎలుకను చిలుకల కొలికిగా చేసినా చేయవచ్చు, అని మీరంతా నమ్మకపోవచ్చును గాని, నేను నమ్మగలను!" అన్నాడు.






శత్రుంజయుడు ఎలుకతో చళుకవర్మను దూరంగా చిన్న ఇంటికి తరిమి, "నువ్వు, మా మధ్య ఉండవలసిన వాడివి కావు. నీ ఎలుక వాహనుడైన విఘ్నేశ్వర భక్తికి తగ్గట్టు, ఆ వాహనం జాతిదే నీకు తగ్గ ఇల్లాలు! నీ ఇల్లాలు అసూర్యం పశ్యగా ఎవరికీ కనపడకుండా ఉండే అంతఃపుర కాంతగా ఉండడానికి ఇంటినిండా ఎలుక బిలాలు ఉన్నవిలే!" అంటూ ఎకసక్కెం చేశాడు.

చళుకుడు తండ్రి మాటలకు ప్రశాంతంగా, "తండ్రి, కుమారులందరికీ పెళ్ళి చేయడమనేది చాలా గొప్ప విషయం! ఎవరికెవ్వరో అది ఏనాడో రాసి పెట్టిందే అంటారు. మన చేతుల్లో ఏమీ లేదు! అంతా ఆ విఘ్నేశ్వరుని ఇచ్ఛకదా!" అన్నాడు.

చళుకుడు ఉత్తమ గ్రంథాలను చదువుతున్నప్పుడు చుళుక పక్కనే చేరి వింటూండేది. చళుకుడు విఘ్నేశ్వరుణ్ణి అర్చిస్తూన్నప్పుడు నోటితో పువ్వులు అందించేది. చళుకుడు తిన్న తర్వాత పెడితేనే తినేది. అలా కాలం గడుస్తూండగా వినాయకచవితి దగ్గిరికి వచ్చింది.

అందరూ ఇళ్ళకు వెల్లవేసి ధాన్యాలు దంచుకొంటున్నారు. చుళుక రాత్రికిరాత్రి ఎలుకలన్నిటినీ పిలిచింది. ఎలుకలు తోకలు ముంచి ఇంటి గోడలకు సున్నం కొట్టాయి, పళ్ళతో పైపొట్టు వొలిచి ధాన్యాన్ని మెరికల్లా బియ్యం చేశాయి.

**18.** చళుకవర్మ కథ



తలను అక్కడున్న రాతికేసి కొట్టుకుం టుండగా విఘ్నేశ్వరుడు అక్కడ ప్రత్యక్షమై, ఎలుకను చేతితో ముద్దుగా నిమిరాడు. శాపవిమోచనమై ఎలుకరూపు మాయమై దేవకాంత కళ్యాణకింకిణి నిజరూపంతో విఘ్నేశ్వరుడి పాదాల మీద ప్రణమిల్లి, అనేకవిధాల స్తుతించింది. విఘ్నేశ్వరుడు కళ్యాణకింకిణిని ఆశీర్వ దించి అంతర్ధానమయ్యాడు.

కళ్యాణకింకిణి నీళ్ళ బిందెను తల కెత్తుకొని నడిచి వెళ్తూంటే, దారిపొడవునా ప్రజలు బొమ్మల్లాగ నిల్చుని చూస్తూ, "ఎవరీ దేవసుందరి? ఎవరింటికి వెళ్తు న్నది?" అని విస్తుపోయారు.

చళుకవర్మ వదినలు కళ్యాణకింకిణి తమ చిన్న మరది ఇంటిలోకి వెళ్ళడం చూసి, ముఖాలు వేలాడదీసుకున్నారు.

శత్రుంజయుడు తన అజ్ఞానానికి తనే సిగ్గుపడి, చళుకవర్మను సతీసమేతంగా రాజమందిరానికి తోడ్కొని వచ్చాడు.

చళుకుని అన్నలు తండ్రితో, "మాకూ అలాంటి ఎలుకలతోనే ఎందుకు పెళ్ళిళ్ళు చేయలేదు? అలా చేసి ఉంటే మాకూ అప్సరసలే తయారై వచ్చి ఉండేవారు కదా!" అని గద్దించి అడిగారు.

ఇటువంటి తెలివిమాలిన కొడుకుల కోసమా నేను సామ్రాజ్యాన్ని ఆర్జించి

వినాయకచవితి ఉదయాన చళుకుని వదినలు స్వయంగా బంగారు బిందెలతో నదీజలాన్ని నెత్తినెత్తుకొని వస్తున్నారు. అది చూచి చళుకుడు కొద్ది విచారం కనబరిచాడు.

చుళుక వెంటనే బిందెలో దూరి దొర్లించుకుంటూ నదీతీరాన్ని చేరుకుని యివతలకి వచ్చి కొండంత బిందెనూ, పొంగిపొర్లి ప్రవహిస్తున్న నదినీ చూసి హతాశురాలై, "బిందెనైతే దొర్లించు కొచ్చాను గాని, నీళ్ళెలా ముంచగలను? బిందెతో ఎలా మోసుకెళ్ళగలను? అవివేకురాల్ని, పనికిమాలినదాన్ని, నేనెందుకు బ్రతికి?" అని అనుకుంటూ

పెట్టింది! అని శత్రుంజయుడు విరక్తి చెంది తపస్సు చేసుకోడానికి అరణ్యాలకు పోయాడు.

చళుకవర్మ అన్నలు అసంతృప్తి, పరస్పరద్వేషాలతో కలహించి యుద్ధాలు చేసి కొట్టుకుచచ్చారు. ఎంత వద్దంటున్నా వినక, ప్రజలు చళుకవర్మను తమ రాజుగా ప్రకటించుకున్నారు. చళుకవర్మ పాలనలో ప్రజలు సుఖశాంతులతో జీవించారు.



చళుకవర్మ కళ్యాణకింకిణి పేరున కళ్యాణి అనే మరొక గొప్ప నగరాన్ని నిర్మించాడు. అతనికి కళ్యాణకింకిణి వలన నలుగురు పుత్రులు కలిగారు. వారు చాళుక్యులుగా పిలువబడ్డారు. ఆ విధంగా చాళుక్యరాజవంశాలకు మూల పురుషుడైన చళుకవర్మ కాలంలో వాతాపి నగరం అనేక దేవాలయాలతో, ప్రాకారాలతో శోభిల్లింది. కళలకు కాణాచిగా, విద్వాంసులకు పండితులకు ఆటపట్టుగా, భూతలస్వర్గం అనిపించుకుంది. నగరాధి దేవతగా విఘ్నేశ్వరుడు ఆరాధింపబడ్డాడు. ఉత్కృష్టశిల్పానికి ప్రామాణికమైన ఆలయమంటపశిల్పాన్ని చూడ్డానికి దేశం నలుమూలల నుంచీ రాజులు మొదలుకొని సామాన్యయాత్రికుల వరకూ ఎల్లప్పుడూ వస్తూండేవారు.

చాళుక్యులు నాలుగు దిక్కులా రాజ్యాలు ఏర్పరుచుకొని పాలించారు. చాళుక్య వంశరాజులు శాఖోపశాఖలుగా దేశమంతటా వ్యాపించి రాజ్యాలు చేశారు. వాతాపినేలినవారు వాతాపిచాళుక్యులనీ, కళ్యాణినగరాన్ని పాలించినవారు కళ్యాణి చాళుక్యులనీ, వేంగినేలినవారు వేంగీ చాళుక్యులనీ, తూర్పుచాళుక్యులు, పశ్చిమ చాళుక్యులు, సౌరాష్ట్రచాళుక్యులుగా పేరొందారు. కాలక్రమాన వాతాపిని బాదామి అని కూడా వ్యవహరించారు.

### విఘ్నేశ్వర వినోద గాథలు

వాతాపి గణపతిగా విఘ్నేశ్వరుడూ, విఘ్నేశ్వర క్షేత్రంగా వాతాపి నగరమూ




దేశాంతరాల్లో పేరు మ్రోగుతున్న కాలంలో, పావనమిశ్రుడు అనే పండితుడు సాయంకాలాల్లో వాతాపి గణపతి ఆలయ మంటపంలో పిల్లలకు విఘ్నేశ్వరుడికి సంబంధించిన కథలను చెపుతూండేవాడు.

మంటపం గోడలపై విఘ్నేశ్వరుడి గాథలు చిత్రాలుగా చిత్రితమై ఉన్నాయి. ఆ చిత్తరువుల్లో వినోదకరమైన ఒక చిత్రాన్ని ఒక పిల్లవాడు గురువుకు చూపించి ఆ కథ చెప్పమన్నాడు.

పావనమిశ్రుడు కథ ప్రారంభించాడు:

ఒక నగరంలో సత్యశర్మ, లోభగుప్త ఇరుగు పొరుగున ఉండేవారు. లోభగుప్తుడి అసలు పేరు లాభగుప్త. కాని అతని లోభితనానికీ, అత్యాశకూ ఊళ్ళో వారంతా లోభగుప్త అనే స్థిరపరిచారు.

సత్యశర్మ, లోభగుప్త రోజూ శివాలయానికి వెళ్ళేవారు. సత్యశర్మ గర్భగుడిలోకి వెళ్ళే దారిలోనే ఉన్న విఘ్నేశ్వర విగ్రహం ముందు ప్రణమిల్లి స్తోత్రగానం చేశాక శివదర్శనం చేసుకొని వెళ్ళేవాడు.

లోభగుప్తుడు గర్భాలయం ప్రవేశిస్తూనే శివలింగం ముందు సాగిలపడి కోటి లాభాలు చేకూర్చమని చాలాసేపు అలాగే ధ్యానిస్తూండేవాడు.

ఒకనాడు సత్యశర్మ శివదర్శనం చేసుకొని వెళ్తూండగా, లోభగుప్తుడు వస్తూన్న సమయంలో నంది విఘ్నేశ్వరుడితో, "విఘ్నేశ్వరా! నీ భక్తుడు సత్యశర్మ చాలా డబ్బు అవసరంలో ఉన్నాడు. అతణ్ణి ఆదుకోవలసిన అవసరం లేదా?" అన్నాడు.

"ఔనోయి, నందీ! ఈ సాయంకాలానికి అతనికి వెయ్యి వరహాలు అందిస్తున్నాను!" అని విఘ్నేశ్వరుడు అన్నాడు.

రాతి విగ్రహాలు మాట్లాడుకుంటున్న మాటలు ఆశ్చర్యంతో లోభగుప్తుడు విని, క్షణం ఆలస్యం చేయకుండా సత్యశర్మ ఇంటికి వెళ్లి, "శర్మా! నువ్వేదో అవస

రంలో ఉన్నట్టుంది. ఐదువందల వరహాలు ఇస్తాను, తీసుకో!'' అని చెప్పి వెళ్ళి డబ్బు తీసుకొచ్చాడు.

సత్యశర్మ, ''అయ్యా గుప్తగారూ! నిన్ననే కదా అసలు వడ్డీలతో మీరిచ్చిన రుణం తీర్చకపోతే ఇల్లు ఖాళీ చేయమని చెప్పారు. ఈ అయిదువందలూ ఎలాగ తీర్చగలను?'' అన్నాడు.

లోభగుప్తుడు, ''అదా నీ సందేహం! ఈ ఐదు వందలు తీసుకుని సాయంకాలానికి నీకు లభించిన మొత్తం ఎంతయితే అంత నాకు యిస్తే చాలు!'' అన్నాడు.



సత్యశర్మ తటపటాయిస్తూంటే, అతని భార్య, ''ముందు ఆ ద్రవ్యాన్ని తీసుకోండి, అవతల పెళ్ళివారు చాలా సేపై కూర్చుని ఉన్నారు!'' అని ప్రోత్సహించింది.

సత్యశర్మ కుమార్తెకు అప్పుడే పెళ్ళి కుదిరింది. వరుడి తల్లీ తండ్రీ అయిదు వందల వరహాల విలువచేసే నగలు పిల్లదానికి పెట్టాలని పట్టుబట్టారు.

సత్యశర్మ లోభగుప్తుడితో, ''అయ్యా, సాయంకాలానికి నాకు లభించింది ఇవ్వడానికి నా కెలాంటి అభ్యంతరమూ లేదు కాని, అలా లభించే ఆస్కారం ఏదీ లేదు....'' అంటూ నసుగుతూంటే, లోభగుప్తుడు, ''అదంతా వదిలెయ్యి, మనం ఇరుగు పొరుగు వాళ్ళం! ఇప్పుడు నేనిస్తే తర్వాత నువ్విస్తావు. యీ మాత్రం దానికి మొహమాట పడకు!'' అంటూ ఐదు వందల వరహాల మూట సత్యశర్మ చేత పెట్టాడు.

సత్యశర్మ సత్యసంధుడని లోభగుప్తుడికి బాగా తెలుసు.

సాయంత్రం ఔతున్నది కాని సత్యశర్మకు ఏ వరహాలూ అందిన సూచన కనిపించలేదు. లోభగుప్తుడు కంగారు పడుతూ దేవాలయానికి పరుగెత్తి, విఘ్నేశ్వర విగ్రహం తొండం పట్టుకొని లాగుతూ, ''ఏమయ్యా, విఘ్నేశ్వరా!



''అదా సంగతి! ఐదువందలు ఇచ్చి వెయ్యి పుచ్చుకొని సునాయాసంగా అయిదువందల వరహాలు కాజేద్దామని ఎత్తువేశావన్నమాట! ఆశాపాతకుడా, నీ దురాశకు ప్రాయశ్చిత్తంగా సత్యశర్మకు మిగతా ఐదువందలూ యివ్వడమే గాకుండా, అతడి కిచ్చిన ఋణాన్ని చెల్లుపెట్టి, అతని కుమార్తె వివాహం నీ స్వంత ఇంటి పెళ్ళి లాగ జరిపించు!'' అని విఘ్నేశ్వర విగ్రహం నుండి గంభీరగర్జన వినిపించింది.

లోభగుప్తుడు క్షణాల మీద తన వారిని పిలిపించి, సత్యశర్మకు మిగతా ఐదువందల వరహాలూ ఇప్పించి, అతని ఋణానికి చెల్లు పెట్టించి, అతని కూతురు పెళ్లి ఖర్చంతా పెట్టుకుంటానని ప్రమాణం చేశాకనే అతని చేయి ఇవతలికి వచ్చింది.

లోభికి మంచి శాస్తి జరిగిందని ఊరు ఊరంతా చెప్పుకున్నారు.

లోభగుప్తుడు సత్యశర్మ కుమార్తె వివాహాన్ని స్వంత కూతురు వివాహం లాగ వైభవంగా జరిపించాడు. అప్పట్నించి బుద్ధి తెచ్చుకొని లోభగుణాన్ని విసర్జించి, అన్యాయంగా ఆర్జించిన ఆస్తిని ధర్మకార్యాలకు వినియోగించి, విఘ్నేశ్వరుడి దయకు పాత్రుడై, గొప్ప ధార్మికుడని పించుకున్నాడు.

సత్యశర్మకు వెయ్యి వరహాలు త్వరగా ఇప్పించుమరి....'' అని అంటూండగా అతని అరచేయి తొండం సందున ఇరుక్కుపోయి తీస్తే రాకుండా తొండం మరింత గట్టిగా బిగించి నొక్కపట్టింది.

నొప్పితో లోభగుప్తుడు కిరకిరలాడిపోతూంటే, ''సత్యశర్మకు వెయ్యి వరహాలు ఎంత త్వరగా నువ్వు ఇప్పిస్తే అంత త్వరగా నీకు విడుదల!'' అని విగ్రహం నుండి వినిపించింది.

లోభగుప్తుడు రెండో చేత్తో నెత్తీ నోరూ బాదుకుంటూ, ''అన్యాయం దేవుడా, అన్యాయం! ఐదువందలు ముందే ఇస్తిని గదా!'' అని పెడబొబ్బలు పెట్టాడు.

కథ ముగించి పావనమిశ్రుడు విఘ్నేశ్వర ప్రసాదాన్ని తెచ్చి పిల్లలకు పంచాడు. పిల్లలు ప్రసాదాన్ని నోట్లో వేసుకొని ఆనందంగా కేరింతాలు కొడుతూ ఇళ్ళకు పరుగెత్తారు.

మరొక సాయంత్రం ఒక బాలిక మంటపం గోడలపై గల మరో చిత్రాన్ని చూపించి కథ చెప్పమన్నది. పావన మిశ్రుడు ప్రారంభించాడు:

కళ్యాణినగరంలో కలహకంఠి అనే ధనికురాలు, కోడలు పుట్టింటినుంచి ఎక్కువగా నగలు పెట్టుకురాలేదని సాధింపుతో రాచిరంపాన పెట్టిపెట్టి, చివరకు నిర్దాక్షిణ్యంగా వెళ్ళగొట్టింది.

కలకంఠి అని నామకరణం చేయబడినప్పటికీ కలహకంఠిగా పేరు పొందిన ఆ ధనిక అత్తకోడలు సౌదామిని, పుట్టెడు దుఃఖంతో పుట్టింటికి బయలుదేరి దారి తప్పి అరణ్యంలోపడి, ఆకలితో అటమటించిపోతూ ఒక వెలగచెట్టు దగ్గిర పడిపోయింది.

తను పుట్టినింటి కెళ్ళి కూడా ప్రయోజనం లేదు. తన పెళ్ళికి చేయించిన నగలకే తండ్రి అప్పులపాలయ్యాడు. మరి నగలు పెట్టలేడు. అంచేత ఆ కీకారణ్యంలో చావడమే మేలు! అనుకుంటూండగా చెట్టు నుండి ఒక వెలగపండు రాలి దొర్లుకుంటూ, అందుకోమన్నట్లు ఆమె చేతి దగ్గిర ఆగిపోయింది. దాన్ని పట్టుకొని సౌదామిని లేచి కూర్చుంటుండగా భూమి అదిరేలాగ ఒక పెద్ద ఏనుగు పరుగున రావడం కనిపించింది.

సౌదామిని చిన్నతనం నుంచీ విఘ్నేశ్వరుడిపై గొప్ప భక్తి విశ్వాసాలు కలది. విఘ్నేశ్వరుణ్ణి తలచుకొని ఏనుగు పాదాల కిందపడి చావాలని ఎదురు వెళ్ళింది. ఏనుగు ఠక్కున ఆగిపోయింది.

ఏనుగు సౌదామిని చేతిలో ఉన్న వెలగపండును తొండంతో తీసుకొని నోట వేసుకొని, దీవిస్తున్నట్లుగా తొండంతో సౌదామిని తలనిమిరి చేయి పట్టుకొని తిన్నగా ఒక పెద్ద గుహ దగ్గిరికి తీసుకెళ్ళింది.






గుహద్వారాన్ని మూసి ఉన్న కొండంత రాతిని గులకరాయి లాగ తొండంతో లాగేసి, గజరాజు లోపలికివెళ్ళి కొంత సేపయ్యాక రత్నాల నగలను కట్టలు కట్టలుగా తొండంతో తీసుకొచ్చి సౌదామిని ముందు కుప్పవేసింది. చంద్రహారాల్నీ, కంఠాభరణాల్నీ ఆమె మెడనిండా వేసి, తండ్రి బిడ్డను బుజ్జగించి చెప్పినట్లుగా వీపునిమిరి, మిగతా నగలను ధరించినన్ని ధరించి, తక్కినవి మూట గట్టుకొని తీసు కెళ్ళమని సైగచేసి చెప్పింది.

సౌదామిని అలాగే చేశాక, ఏనుగు ఆమెను అరణ్యం దాటించి కళ్యాణినగర సమీపాన విడిచి, అరణ్యంలోకి వెళ్ళి పోయింది.

బంగారు విగ్రహం లాగ నగలతో తళుక్కు, తళుక్కున దేదీప్యమానంగా మెరుస్తున్న కోడలిని చూసి కలహకంఠి నిర్ఘాంతపోయి, సంబాళించుకొని, మెల్ల మెల్లగా ఆ నగలన్నీ ఎలాగ వచ్చాయో చెప్పేవరకూ వేధించి, సౌదామిని చెప్పిన దంతా విని, "ఏనుగకి వెలగపళ్ళు అంత ఇష్టమన్న మాట!" అని తల పంకించి, వెంటనే సంతకు వెళ్ళి సంచినిండా వెలగ పళ్ళు కొనుక్కువచ్చింది.

నగలు నింపుకొని రావడానికి ఒక గట్టి గోతాన్ని భుజాన వేసుకొని, వెలగపళ్ళ సంచితో కలహకంఠి బయలుదేరింది.

అరణ్యం ప్రవేశించి కోడలు చెప్పిన గుర్తుల ప్రకారం ఎంత వెతికినా వెలగ



చెట్టు కనపడక విసిగి, ఒక చింతచెట్టు కింద చతికిలబడి, తినాలని వెలగపండు తీసింది.

తినాలనే తీసినా ఎలాగో నిగ్రహించుకొని, వెలగపండు చేత్తో ఎత్తి పట్టుకొని, గొంతు సవరించుకొని,

''ఏనుగా రా రావే!
వెలగపళ్ళు తినవే!
నగలెన్నో తేవే!
నా కోర్కె తీర్చవే!
ఏనుగా రా!
వేగంగా రా!''—అంటూ భజనపాట మొదలుపెట్టింది. పాట సాగుతున్నది, ఏనుగు రాలేదు గాని, అడవి దద్దరిల్లేలాగ గాండ్రుమనే అరుపు వినిపించింది. అది ఏనుగు ఘీంకారం కాబోలు అనుకొని కలహకంఠి సంతోషపడుతూ మెడచాచి చూడగా, పెద్దపులి దూకుతూ రావడం కనిపించింది.

భుజం మీది గోతాన్ని వదలకుండా కలహకంఠి తిరిగి చూడకుండా పరుగెత్తి, పరుగెత్తి రొప్పుతూ పడిపోయింది. ఆ పడడం సరిగా గుహ దగ్గిరే పడింది. గుహ తెరిచే ఉంది. తన అదృష్టానికి కలహకంఠి పొంగిపోతూ గుహలోకి వెళ్ళింది.

గుహలో కుప్పలు తెప్పలుగా ఉన్న నగలు చూసి పిచ్చెత్తినదానిలాగ తల మునిగేలాగ నగలన్నీ వేసుకొని, గోతం నిండా నగలు కుక్కి మూతి కట్టి, ఎత్త లేక ఎత్తి, మోయలేక మోస్తూ, నడవలేక నడుస్తూ గుహ మొదటికి వచ్చేసరికి గుహ మూతబడి ఉంది. ఎదురుగా చీకటిలో ఎర్రగా మెరుస్తున్న కళ్ళతో, తెల్లగా మెరుస్తున్న కోరపళ్ళతో పగలబడి నవ్వుతున్న పెద్ద బ్రహ్మరాక్షసి చీకటిలో చీకటిలాగ కనిపించింది.

ఆ భూతం ప్రతిధ్వనితో గుహ కంపించిపోయేలాగ, ''ఓహ్హో! కలహకంఠీ! నువ్వు కోడలిని కాల్చుకుతినే అత్తవైతే, నేను అత్తను చిత్రహింసతో

తినేసిన కోడల్నీ! నా చరిత్ర విను!'' అంటూ చెప్పడం ప్రారంభించింది:

వెనకటికి నేను చురకత్తిలాంటి అందకత్తెను. అమ్మా, నాన్నా పెట్టిన కలహంసి; కాపురానికెళ్ళాక, నా నోటి ప్రతాపానికి ఆ పేటంతటికీ నేను సంపాదించుకొని సార్థకపరుచుకొన్న పేరు కలహదుందుభి.



నువ్వెంత చెడ్డ అత్తవో, కలహకంఠీ! నా అత్త అంత ఉత్తమురాలు, పరమ సాధువు.

నేను కాపరానికివెళ్ళి ఏడాది తిరక్కుండానే నా మొగుడు ఇల్లు విడిచి దేశాల పాలయ్యాడు. అంటే నేనెంత ఉత్తమ ఇల్లాలినో ఊహించుకో! నాకు నగలపిచ్చి ఇంతా అంతా కాదు. బంగారుపంటలు పండే భూములు పుట్రలు అమ్మించి నగలు చేయించుకున్నాను. మా అత్త ముక్కుపుల్ల నుంచి అన్నీ నాకే యిచ్చేసింది.

అటువంటి అమాయకురాలైన అత్తను, ఒక పూటైనా సరిగా తిననిచ్చేదాన్నిగాను. చిక్కిశల్యమైన వృద్ధురాలి చేత ఇంటి చాకిరీ అంతా చేయించేదాన్ని.

చివరికి నా అత్త, మామ విసిగిపోయి వాతాపిక్షేత్రంలోని విఘ్నేశ్వరుని దర్శించి అక్కడే కన్ను మూద్దామని బయలుదేరారు. నా అత్త చేతుల్లో ఉన్న చిన్న మూట చూసి అదేమిటని దూకుడుగా దాన్ని లాక్కోవడంలో, ఆవిడ తూలి పడిపోయి, ఆయాసంతో రొప్పుతూ కన్ను మూసింది.

అంతవరకూ ఎంతో సహనంతో నా అత్యాచారాలన్నీ చూస్తూ పల్లెత్తు మాట అనని నా మామగారు, ఆపలేని దుఃఖంతో, పైకుబికిన కోపంతో, ''పాపిష్ఠిదానా! నువ్వు మా కోడలివైపోయినావు, లేకుంటే శపించేవాణ్ణి! ఎప్పటికైనా, మా ఒక్కగాని ఒక్క కొడుకు తిరిగి వస్తాడనీ, నువ్వు వాణ్ణి సుఖపెట్టగలవనే ఆశతో, అన్నీ సహించాము; కడసారి కోరుతున్నాను-వాడొస్తే సరిగా చూడు!'' అని



చెబుతూ అలాగే ప్రాణాలు విడిచి భార్య తోనే సహగమనం చేశాడు. ఆయన గొప్ప నిష్ఠాపరుడు, తపశ్శాలి.

అదే సమయంలో, ఒక సన్యాసి అక్కడికి వచ్చాడు. నా అత్తమామల మృత దేహాలపైబడి రోదిస్తూ, నేను లాక్కొ బోయేటప్పుడు కిందపడిన మూటను తీసి విప్పాడు. అందులో రెండు చిరుగుల బట్టలు తప్ప మరేమీ లేవు.

ఆ సన్యాసి నన్ను వజ్రాల్లాంటి కళ్లతో కాల్చేస్తున్నట్టు చూస్తూ, "నువ్వు బ్రహ్మ రాక్షసిగా పుట్టవలసినదానివి!" అని అన్నాడు. అంతే, తర్వాత వృద్ధ దంపతుల ఉత్తరక్రియలు జరిపి వెళ్లిపోయాడు.

ఆ సన్యాసి ఎవరో కాదు, నా రూప విలాసాలకి పరవశించి కోరి చేసుకున్న నా భర్తే! అని బ్రహ్మరాక్షసి చెప్పి కాస్సేపాగి మళ్ళీ చెప్పసాగింది:

నా నగల పిచ్చి, ధన వ్యామోహం నన్ను ఎంతవరకు ఈడ్చుకు వచ్చాయంటే, నేను కొంతమంది గజదొంగలను చేరదీశాను. దొంగల రాణిని అనిపించుకున్నాను. ఈ గుహలోనే దొంగలు గొప్ప గొప్ప నగలను ధనరాసులను పోగు పోస్తూండేవారు. అంతా నా స్వంతం చేసుకోవాలని దొంగలకు విషభోజనం పెట్టాను. వాళ్లు చచ్చే ముందు చావు తెగింపుతో కసిగా నన్ను ఇందులో ఉంచి గుహను పెనుబండతో కప్పేశారు.

కలహకంఠీ! ఇదే గుహలో, ఆ నగల్నీ, ధనరాసుల్నీ చూసుకుంటూ అలాగే మాడి మాడి కన్ను మూసి, ఇలాగ భూతాన్నయి పడి ఉన్నాను. నీకు బుద్ధి వచ్చేలాగ చేస్తే, నా పిశాచజన్మ శాపం తీరిపోతుందని గుహలోకి వచ్చిన ఏనుగు వలన తెలిసింది.

ఏనుగు నీ కోడలికి ఇచ్చినవన్నీ అసలు నగలే; ఇప్పుడు నువ్వు పెట్టుకున్నవీ, అత్యాశకొద్దీ పోగు చేసి గోతాం నిండా కట్టుకున్నవీ ఏమిటో చూసుకో! అన్నది బ్రహ్మరాక్షసి.



కలహకంఠి భుజానికెత్తుకొన్న గోతం కట్టువిడి దాంట్లోంచి పాములూ, జెర్రులూ, కొండ తేళ్ళూ ఊడిపడుతూ జరజరా గుహ నలుమూలలకూ పాకాయి.

ఒంటి మీద పాములూ, తేళ్ళూ పాకుతూంటే బెంబేలు పడిపోతున్న కలహకంఠిని చూసి గుహ మారుమ్రోగుతూండగా బ్రహ్మరాక్షసి వికవికా నవ్వుతూ, "నువ్వు కోడలిని కాల్చుకుతినే కలహకంఠివి. నేను అత్తమామల ఉసురుపోసుకున్న కలహదుందుభిని! ఉత్తమురాలైన నీ కోడల్ని మంచిగా చూసుకొంటే సరేసరి, లేదా ఈ గుహలో నాలాగ బ్రహ్మరాక్షసివై పడి ఉండటం ఇహ నీ వంతు అవుతుంది! విన్నావా, కలహకంఠీ!" అని చెప్పింది.

కలహకంఠి లెంపలువేసుకొని, రాక్షసికి దణ్ణం పెట్టి, "బుద్ధి వచ్చింది, కోడల్ని పువ్వులాగ చూసుకుంటాను. గుహ నుంచి నన్ను బయట పడనిచ్చి, అరణ్యం దాటించు!" అని మొరపెట్టింది.

బ్రహ్మరాక్షసి కలహకంఠిని అడవి దాటించి కళ్యాణినగరం పొలిమేరకు చేర్చి, "మాట తప్పావో, బ్రహ్మపిశాచివై గుహలో ఉంటావు, జాగ్రత్త!" అని హెచ్చరించి భగ్గుమని మండిపోయి అదృశ్యమైంది.

కలహకంఠి బ్రతుకు జీవుడా అని ఇంటికి బిరబిరా వెళ్ళి, సౌదామిని ముందు మోకరిల్లి, మోకాళ్ళు పట్టుకొని, "అమ్మా, సౌదామినీ! నన్ను మన్నించు. కొడుకూ, కోడలూ చిలకాగోరువంకల్లాగ ఉంటే చూసి సంతోషించడం కంటే నాకు కావల్సిందేమీ లేదు!" అన్నది.

అత్త పరివర్తనానికి కారణం విఘ్నేశ్వరుని కటాక్షం అని సౌదామిని సంతోషించింది. కలహకంఠి తిరిగి కలకంఠి అనిపించుకొన్నది.

పావనమిశ్రుడు కథను ముగించి, "పిల్లలూ! ఏనుగ ఎవరో చెప్పుకోండి చూదాం!" అన్నాడు.

పిల్లలే కాకుండా, పెద్దలు కూడా ఆనందోత్సాహాలతో గొంతెత్తి, "విఘ్నేశ్వరుడు! మన విఘ్నేశ్వరుడే!" అంటూ గొల్లున లేచి ప్రసాదం తీసుకొని ఇళ్లకు వెళ్లారు.

ఆలయమంటపంలోని కుడ్యచిత్తరువులకు సంబంధించిన కథలను, రోజూ పావనమిశ్రుడు చెబుతూంటే, వీనుల విందుగా వింటూన్న పిన్నల, పెద్దల మనస్సులనిండా, విఘ్నేశ్వరుడిపై బలమైన భక్తి వర్ధిల్లింది.



ఒకనాడు ఒక సంగీత కళాభిమాని, ఒక కుడ్యచిత్తరువులో తంబుర మీటుతూ ఒక విద్వాంసుడు గానం చేస్తూంటే, వివిధ భంగిమల్లో విఘ్నేశ్వరుడు నృత్యం చేస్తూండడం చూసి, ఆ చిత్ర చరిత్ర చెప్పమని కోరాడు; పావనమిశ్రుడు చెప్పడం మొదలుపెట్టాడు:

వాతాపినగరం కళలకు కాణాచిగా కవిపండిత, గాయక, విద్వాంసులకు పుట్టినిల్లై విలసిల్లుతూన్నది.

గజానన పండితుడు నగరంలో అగ్రగణ్యుడు, బహుముఖ ప్రజ్ఞాశాలి; ముఖ్యంగా గొప్ప గాయకుడు. అతని గాత్రంలో సమ్మోహన శక్తి ఉండేది. వాతాపి గణపతిపై ఎన్నెన్నో కీర్తనలు రచించి పాడుతూండేవాడు. అతని మనుమడు బాలగణేశభట్టు టింగుటింగున తాళాలు వాయిస్తూండేవాడు.

గజాననుడు 'ధిమికిట ధిమికిట తాండవ నృత్యకరీ గజానన....' అనే పల్లవిని ఎత్తుకొని రాగాలు మారుస్తూ, అనేక రాగాల్లో పాడుతూంటే, గజాననుడైన విఘ్నేశ్వరుడు ఇంద్రధనుస్సు రంగుల్లో అనేక రూపాల్లో నర్తిస్తూ శ్రోతల కన్నులకు కట్టేవాడు.

హంసధ్వనిరాగంలో తెల్లని రాజహంస లాగ, మాయామాళవ రాగంలో ఉదయ రవి బింబంలాగ, భైరవిరాగంలో ఎర్ర తామరలాగ, హిందోళరాగంలో నీలాకాశం లాగ, నీలాంబరిరాగంలో నీలికలువలాగ,

ఆనందభైరవిరాగంలో అరవిచ్చిన తెల్ల కలువలపై విరిసిన పున్నమి వెన్నెలలాగ విఘ్నేశ్వరుడు లీలగా కనిపించేవాడు.

గజానన పండితుడికి సత్కారాలమీద, సన్మానాలమీద కాంక్ష ఏ కోశానా లేక పోయినా, అత్యున్నత సత్కారమైన బంగారు గణేశ ప్రతిమ అతనికే ప్రతి సంవత్సరం వస్తూండేది. ఆ ప్రతిమలతో అతని ఇల్లు నిండిపోయింది.

దేశాంతరంగా చాలామంది మహామహా విద్వాంసులకే గజానను డంటే ఎనలేని గౌరవమూ, గురుభావమూ ఉంటున్నా, వాతాపినగరంలో కొంతమందికి అతనిపై అసూయ బాగా పెరిగింది. వారందరికీ నాయకుడు స్వరకేసరి.

స్వరకేసరి ఎప్పుడూ విద్వత్తు చూప డానికి గొప్ప తాపత్రయ పడేవాడు. అతను గళం విప్పితే సింహగర్జనలు వెలువడేవి. మద్దెల వాయించేవాడిని ముప్పతిప్పలు పెడుతూ వీరవిహారం చేస్తూన్నట్లు పాడే వాడు. గజాననపండితుడికి అటువంటి విద్వత్తు ప్రదర్శించుకోవాలనే యావ లేక పోవడమే కాకుండా, విఘ్నేశ్వరుడిపై భక్తితో తన్మయావస్థలో పడి తాళం తప్పుతూ, మరొకప్పుడు పాడుతూ, పాడుతూ మూగబోతూండేవాడు. అటు వంటి సందర్భాలను స్వరకేసరి ప్రభృతులు గజాననుడికి శాస్త్రపాండిత్యం లేదనీ, కేవలం అతనిది మనోధర్మగాన మనీ గాలిపాట అనీ హేళనగా ప్రచారం చేస్తూ, అక్కసు తీర్చుకుంటూండేవారు. గజాననుడికి ఎవరేమన్నా, ఏమను కుంటూన్నా ఆ ధ్యాసే ఉండేది కాదు. మనసులోని విఘ్నేశ్వరుడితో ఏకాంతంలో మంతనాలాడుకొంటున్నట్లు పాడేవాడు. అందులో ఏదో అనిర్వచనీయమైన శక్తి వింటున్నవారిని మైమరపించి దివ్యలోకా ల్లోని ఆనంద సాగరాల్లో ముంచి తేల్చేది.

ఏ విధంగానైనా ఆ సంవత్సరం స్వర్ణ గణేశ విగ్రహం గజానన పండితుడి ఇల్లు చేరకుండా చేయడానికి స్వరకేసరి బాగా ఆలోచించి, ఒక గొప్ప పథకం వేశాడు.






గజానన పండితుడి ఇంట కామధేనువు లాంటి గంగిగోవు ఉన్నది. నందుడు అనే వాడు దాని బాధ్యతలు నిర్వహిస్తూ, గజానన పండితుడికి రోజూ చిక్కటి పాలు పితికి తెచ్చి యిచ్చేవాడు. స్వర కేసరి నందుణ్ణి లోబర్చుకొని, వాడు చెయ్యవలసినదంతా నూరిపోశాడు.

గణపతి నవరాత్రి ఉత్సవాలకు కుమార్తెనూ, అల్లుణ్ణీ, మనుమడు గణేశ భట్టునూ తీసుకురావడానికి దగ్గిరలోనే ఉన్న కళ్యాణినగరానికి గజాననుడి భార్య వెళ్ళి ఉన్నది.

గజాననుడి అమరగానాన్ని విని తరించడానికి దూరదూరాల నుంచి రసజ్ఞులైన శ్రోతలు వాతాపినగరానికి చేరుకొంటున్నారు. అనాడే ప్రారంభ దినం. వాతాపి గణపతి ఆలయప్రాంగణంలో గజాననుడు తొలి పాట వినిపించవలసిన రోజు, వినాయక చతుర్థి!

వేకువనే నందుడు స్వరకేసరి చెప్పిన ప్రకారంగా లోటాలో ఉన్న నీళ్ళలో పితికి తెచ్చిన పాలు కొన్ని పోసి, లోటాను అలాగే తీసుకెళ్ళి గజాననుడికి యిచ్చాడు.

గజాననుడు లోటాలోని నీళ్ళపాలను జూసి నివ్వెరపడి, ''ఇదేమిటి నందా! ఎన్నడూలేంది యీ రోజు పాలలో నీళ్ళు పోసి తెచ్చావేమిటీ?'' అని అన్న వెంటనే నందుడు, ''ఆ గణేశుడి సాక్షి! నేను పాలల్లో నీళ్ళు పోసి తేలేదు, ప్రమాణం




చేసి చెపుతా!'' అని గొంతెత్తి బోర విరుచుకుని అరిచాడు.

గజానన పండితుడి దగ్గర ఎంతో వినయంగా ఉండే నందుడు, అంత నిర్భయంగా అరవడం చూసి ఆశ్చర్యపడుతూ వీధిలోని వాళ్ళు నలుగురూ వచ్చి మూగారు. వీధిని పోతూన్న వాడల్లే వెళ్తూన్న స్వరకేసరి ఆగి దూరంగా నిలబడిపోయి లోలోపల ముసిముసిగా నవ్వుకొంటూ చూడసాగాడు.

గజానన పండితుడు చిరుకోపంతో కనుబొమలు ముడిచి, ''నందా! ప్రమాణం దాకా వచ్చావూ? ఏదీ ప్రమాణం చెయ్యి చూద్దాం!'' అని అన్నాడు.

ప్రమాణం చేయవలసివచ్చేసరికి జంకుపుట్టి నందుడు తటపటాయిస్తూంటే, ''అలా దిక్కులు చూస్తావేం?'' అంటూ గజానన పండితుడు కంచుఘంటలాంటి కంఠధ్వనితో, ''ప్రమాణం చెయ్యవేం మరి?'' అని గద్దించగా నందుడికి మరింత దిగులు పట్టుకొంది.

దూరంగా ఉన్న స్వరకేసరి పెద్ద మనిషిలాగ ముందుకు వచ్చి, ''అనగానే సంబరమా, చెయ్యరా నందా చెయ్యి! చెప్పింది సరిగ్గా చెప్పి, దీపం ఆర్పు, భయపడతావెందుకు!'' అంటూ నిబ్బరం చెప్తూన్నట్టు కనుసైగ చేశాడు.

నందుడు సగం ధైర్యం తెచ్చుకొని, ఎదురుగా గదిలో స్వర్ణగణేశ ప్రతిమ దగ్గిర వెలుగుతున్న దీపం ముందుకెళ్ళి నిల్చుని, భయం భయంగా హీనస్వరంతో, ''నేనేగాని పాలల్లో నీళ్ళు పోసి తెస్తే, నా రెండు చేతులూ పడిపోవాలి! లేదా అలాగ అన్న గొంతుకే పడిపోవాలి!'' అని చెబుతూ, దీపం ఆర్పేస్తూ గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

గజాననుడు కొయ్యబారిపోయాడు. అతని గొంతు బిగుసుకుపోయి మాట రాలేదు.

''అయ్యో! ఎంత పని జరిగింది!'' అని నలుగురూ విచారిస్తూంటే, ''ప్రమాణ

కాలు చేయించడం అంటే మాటలా మరి!'' అని అంటున్న స్వరకేసరి గొంతు విని నందుడు కళ్ళు తెరిచి, తన చేతుల కేమీ కానందుకు ఆనందపడుతూ, గబ గబా స్వరకేసరిని చేరుకున్నాడు.

ఆ సమయంలో బాలగణేశభట్టు పరు గెత్తుకుంటూ వచ్చి, ''తాతయ్యా! బండి దిగి ముందు నేను పరుగెత్తుకుంటూ వచ్చేశా! అమ్మమ్మా వాళ్ళంతా బండి మీద వస్తున్నారు!'' అని అంటూ తాత గారిని చూసి నివ్వెరబోతూ, నలుగురూ చెప్పినదంతా విని, పెదవులు బిగించి నడుం మీద చేతులుంచి ధాటీగా నిలబడి, ''నందా, ఆగు!'' అన్నాడు.

స్వరకేసరితో వెళ్ళిపోబోతూన్న నందుడు మంత్రించినట్టుగా తక్కున ఆగిపోయి, గదిలో దీపం వెలుగుతూనే ఉండడం చూసి విస్తుపోయాడు.

''నువ్వు దీపం సరిగా ఆర్పినట్టులేదు, మళ్ళీ ప్రమాణం చెయ్యి!'' అని శాసిస్తు న్నట్టు బాలభట్టు అన్నాడు.

భయంలేదు వెళ్ళి ప్రమాణం చెయ్యి అన్నట్లుగా స్వరకేసరి నందుడి వీపు పొడిచి ముందుకు తోశాడు.

బాలగణేశభట్టు, ''నందా! సరిగ్గా విను, నేనేగాని నీళ్ళల్లో పాలు పోసి యిస్తే, నా చేతులు పడిపోవాలి! అని




చెప్పి దీపం ఆర్పు! ఊఁ, త్వరగా కానియ్యి.'' అని హుంకరిస్తూ అన్నాడు.

నందుడికి ముచ్చెమటలు పోశాయి. అతడు గజగజలాడుతూ, ''అయ్యబాబో! నేనీ ప్రమాణకం చెయ్యను. ఈ స్వర కేసరి చెప్పినట్లుగా, నీళ్ళలో పాలు పోసి తెచ్చిచ్చాను. పాలల్లో నీళ్ళు పోయలేదని ప్రమాణం చేశాను, అంతే! నన్ను రక్షిం చండి!'' అని అంటూనే గబగబా వెళ్ళి, నీళ్ళల్లో పోయగా చెంబులో ఉన్న చిక్కటి పాలను తెచ్చి బాలభట్టు ముందు పెట్టి అలాగే మోకరిల్లుతున్నట్టు పడ్డాడు.

అక్కడ చేరినవారంతా గలగలా నవ్వు తూన్న కోలాహలంలో స్వరకేసరి జాడ



పోయినట్లు తెలుసుకొని, అంతా సంతో షిస్తూ వెళ్ళిపోయారు.

గణేశభట్టు, ''తాతయ్యా! ఆడంబ రమూ, అహంకారమూలేని పండితుడివైన నువ్వే పామరుడిలాగ, యిలాంటి ప్రమా ణాల మాయలో పడ్డావంటే చాలా చిత్రంగా ఉంది కదా!'' అన్నాడు.

గజాననుడు బాలుణ్ణి దగ్గరకు తీసు కుని కన్నులు మూసి, ''ఔను, గణేశా!'' అని అంటూన్న సమయంలో వీధిలో బండి ఆగింది.

గజాననుడు కళ్ళు తెరిచి చూస్తే బాలుడు లేడు; అప్పుడే బండి మీంచి కిందికి గణేశభట్టు దూకడం కనిపించింది.

గజానన పండితుడి ముఖం జ్యోతిలాగ వెలిగింది. ''గణేశా!'' అంటూ మహా నందంతో ఆనందభైరవి ప్రారంభ స్వరం లాగ అరిచాడు.

పావనమిత్రుడు కథ చెప్పడం ఆపి, ''పిల్లలూ! ముందు వచ్చిన ఆ గణేశ భట్టు ఎవరో చెప్పండి?'' అని అనడమే తరవాయిగా, ''ఇంకెవరు, మన విఘ్నే శ్వరుడే! వాతాపి గణపతి,'' అంటూ పిల్లలూ, వారితో పెద్దలూ గొంతులు కలి పారు. పావనమిత్రుడు తిరిగి చెప్పసాగాడు:

''తాతా!'' అంటూ గణేశభట్టు చేతులు చాచి పరుగున వస్తూంటే, ''గణేశా!''

లేకుండా పారిపోయాడు. అతని కోసం కొందరు పరుగున వెళ్ళారు.

అప్పుడు గణేశభట్టు నలుగుర్నీ కలియ జూసి, ''చూశారా! ఈ ప్రమాణకాలు చేసేవారూ, వెనుక దన్నుగా చేయించే వారూ ఎక్కువమంది వట్టి మాయావులు! మాటలు మారుస్తూ సత్యాన్నే తికమక పెట్టే ద్రోహులు. అమాయకుల్ని నమ్మించి మోసం చేసే వంచకులు!'' అని అన్నాడు.

''ఔను! చిన్నవాడివైనా బాగా చెప్పావు. కళ్ళు తెరిపించావు!'' అని కుర్రవాడి తెలివితేటల్ని మెచ్చుకుంటూ, గజానన పండితుడి గొంతు పట్టు విడి



అంటూ పండితుడు చేతులు చాచి మన వణ్ణి ఎత్తి, ''గణేశా! విఘ్నేశ్వరుడు మనల్ని అనుగ్రహించాడు. నీ రూపంలో వచ్చి మన ఇల్లు పావనం చేశాడు. ఇది గజానన మందిరం!'' అని అంటూ అరవై ఏళ్ళు నిండిన ఆ వయస్సులో చిన్న పిల్లవాడిలాగ గంతులేస్తూ, ''తాండవ నృత్యకరీ గజానన ధిమికిట....'' అంటూ ఆనందభైరవి రాగంలో సమ్మోహన గాత్రంతో పాడుతూన్న పాట ఘంటానాదం లాగ నగరమంతటా మార్మోగుతూ విని పించింది.

ఆ ఆనందపతాక సన్నివేశంలో స్వర కేసరి పరుగునవచ్చి, గజానన పండితుడి పాదాలు చుట్టివేసి తల అన్చి, ''గురు దేవా! క్షమించాను అని అంటేగాని మీ పాదాలు వదలను!'' అని అన్నాడు.

గజాననుడు తెప్పరిల్లి, స్వరకేసరిని లేవనెత్తి, ''స్వరకేసరీ! మనం నిమిత్త మాత్రులం, అంతా ఆ గజాననుడి లీలా విలాసం! నువ్వు సంగీతాన్ని శాస్త్రీయంగా మథించినవాడివి, నేను భక్తికి, మమతకు ప్రాధాన్యం యిచ్చి, భక్తితో కూడినప్పుడే సంగీతం ఉన్నతమార్గం అందుకుంటుం దని నమ్మినవాణ్ణి, అంతే! ఇకనుంచి స్వర్ణగణేశ విగ్రహాలు అన్నీ నీ అధీనమే! ఆ సత్కారాలేవీ నాకు వద్దు. ఇటుపైని నేను సభల్లో పాడను!'' అని అనగానే గణేశభట్టు, ''తాతయ్యా! నీకోసం నువ్వు ఇంట్లో పాడుకొంటేచాలదు. ఎదుటివారిలో మంచి అభిరుచినీ, ఆనందాన్నీ, మమతనో, భక్తినో కలిగించినప్పుడేకదా నీ పాటకూ, పాండిత్యానికీ సార్థకత!'' అన్నాడు.

గజాననుడు చేతులెత్తి జోడిస్తూ, ''ఓ విఘ్నేశా! ఈ మాటలు నా మనవడి నోటితో నువ్వే అంటున్నావు! ఇంతవరకూ నీవు చెప్పినట్లుగానే గానం వినిపించాను, ఇక ముందు కూడా నీ ఆనతి ప్రకారం అలాగే నిన్ను కీర్తిస్తాను. వినేవారి హృద యాల్లో నర్తించు! సత్కారాలు మాత్రం నాకు అందకుండా చూడు!'' అన్నాడు.




అప్పుడు స్వరకేసరి, ''గురుదేవా! మీరు రచించిన కీర్తనలను మీ రీతిలో పాడినవారికి ఏటేటా స్వర్ణగణేశ విగ్రహం బహూకరింపబడుతుంది; ఆ విధంగానైనా మా భక్తిగౌరవాల్ని మీపట్ల చూపుకోగల అదృష్టాన్ని అనుగ్రహించండి!'' అని అంజలిఘటించి అర్థించాడు.

గజానన పండితుడికి అరవై ఏళ్ళు పూర్తి అయిన సందర్భంగా, అతను వద్దంటున్నా ఆనాటి సాయంకాలం వాతాపి గణపతి ఆలయ ప్రాంగణంలో ఏర్పాటైన బ్రహ్మాండమైన మహాసభలో పూలజల్లుల మధ్య షష్ఠిపూర్తి మహోత్సవం వైభవంగా జరిగింది.

గజానన పండితుడు చేతులు జోడించి, ''ఎందరో మహానుభావులు సంగీతాన్నీ, కవిత్వాన్నీ భక్తికి అంకితం చేసి అదే సన్మార్గమని చెప్పారు! వారందరికీ వందనాలు. నేనూ అదే నమ్మాను. అంతకంటే నాలో మరే విశేషమూలేదు!'' అని చెప్పి, అనేక రాగమాలికలతో విఘ్నేశ్వరుణ్ణి కీర్తిస్తూ అమృతగానాన్ని వినిపించాడు. ఆనాటి శ్రోతల హృదయాల్లో తాండవించిన విఘ్నేశుడు ఎప్పటికీ అలాగే నర్తిస్తూ ఉండిపోయాడు.

ఈ విధంగా వాతాపినగర చరిత్రలో గజానన పండితుడి పేరు సువర్ణాక్షరాలతో నిలిచిపోయింది, అని పావనమిశ్రుడు ముగించాడు.

ఒకనాడు చాలామంది పిల్లలు వారి వెనుక పెద్దలు గుమిగూడి ఒక చిత్రాన్ని వింతగా చూస్తున్నారు. ఆ చిత్తరువులో ఒక విచిత్రమైన జంతుభూతం చిత్రించబడి ఉంది. అప్పుడే మంటపం ప్రవేశిస్తున్న పావనమిశ్రుడు పిల్లల కుతూహల కారణం గ్రహించి, ''పిల్లలూ! ఆ కథ విందురుగాని కూర్చోండి!'' అంటూ చెప్ప మొదలు పెట్టాడు:

ఇంద్రుడు సగరచక్రవర్తి యాగాశ్వాన్ని దాచాడు. పృథుచక్రవర్తి యాగం సరిగ్గా పూర్తవకుండా, గుర్రాన్ని దొంగిలించుకు

పోతూ పాషండ వేషాలు వేశాడు, చేయ రాని పనులెన్నో చేశాడు.

పృథుచక్రవర్తి సంతతివాడైన అభినందను డనే మహారాజు ఇంద్రుడికి భాగం లేకుండా ఉండే ఒక మహాయాగాన్ని ప్రారంభించాడు. ఇంద్రుడు పట్టరాని ఉక్రోషంతో కాలుడిని ఇచ్చకాలతో, సుర భోగాలతో బాగా తృప్తిపరిచి, అభినందనుడి యాగాన్ని ధ్వంసం చేయమని కోరాడు.

కాలుడు కాలానికి అధినేత. జీవుల జీవన మరణాలకు కాలుడే మూలము. కాలుణ్ణి కాలయముడు, కాలధర్ముడు అని కూడా అంటారు.

కాలుడు యజ్ఞపురుషుణ్ణి ఆవహించి, అభినందనుడి యాగ హోమాగ్ని నుండి కనీ వినీ ఎరుగని మహాభయంకరమైన పర్వతంలాంటి జంతుభూతం వెలువడే లాగ చేశాడు. ఋత్విజులు, అధ్వర్యులు మొదలైనవారంతా పారిపోయారు.

అభినందనుడు గణేశభక్తుడు. అతని గురువైన వశిష్ఠుడు, ''రాజా! ఇలాంటి అవాంతరం రావచ్చునని తెలిసే హోమ గుండానికి ఎదురుగా పెద్ద స్వస్తికా పీఠాన్ని వేయించాను. స్వస్తిక గణేశుని సంకేత చిహ్నం. గణేశ్వరునికి ప్రతి రూపంగా పసుపుముద్దను స్వస్తిక కేంద్రంలో పెట్టి ప్రణమిల్లు! ఆ స్వస్తిక అవాంతరాన్ని నిర్మూలిస్తుంది!'' అని చెప్పాడు.

రాజు అలాగే చేశాడు.

ఆ స్వస్తిక ముగ్గు కేంద్రంనుంచి అద్భుత ప్రకంపనంతో నాదం వెలువడి, అణువులు విజృంభించి పైకెగిసి మహా జంతు భూతాన్ని ఆవరించాయి. అణువులు పెద్దవిగా పెరుగుతూ ఎలుకలుగా మారాయి. అనేక రంగురంగుల్లో మెరిసి పోతూన్న చిట్టెలుకలు చీమల బారుల్లాగ భూతజంతువు నిండా పట్టుకొని కొరికి కొరికి, బలవంతమైన సర్పము చలిచీమల చేత చిక్కి చచ్చిన విధంగా చేసినై. భూత జంతువు గిలగిలా తన్నుకొని చచ్చినట్లు చచ్చి అదృశ్యమైంది.





# విఘ్నేశ్వరుడు

హోమాగ్నినుండి పుట్టిన భయంకరమైన జంతువు అదృశ్యం కాగానే కాలుడు విఘ్నాసుర రూపం దాల్చి కాలపాశాన్ని విశిరాడు. కాలపాశం గిరగిరా తిరుగుతూ ప్రళయంగా అంతా చుట్టబెట్టింది. అభినందనుడు పరాక్రమించి దాన్ని ఛేదించడానికి యత్నించి నేలకొరిగాడు. కాలపాశం మరింత విజృంభించి జీవకోటిని అంతమొందిస్తూంటే వశిష్ఠుడు మొదలైన సప్తమహర్షులు, ఋషులు, లోకకళ్యాణం కోరేవారంతా కలిసి బ్రహ్మను ప్రార్థించారు.

బ్రహ్మ, "కాలపాశాన్ని తప్పించడం ఎవరితరమూ కాదు. కాలప్రభావాన్ని అరికట్టి కాలుణ్ణి నిగ్రహించగలవాడు గణేశుడొక్కడే!" అని చెప్పి వారందరితో కలిసి గణేశ్వరుడిని ప్రార్థించాడు.

మహాగణాధిపతి స్వస్తికాపీఠంపై ఆశీనుడై సాక్షాత్కరించాడు. తన చేతనున్న పాశాన్ని వదిలాడు. గణేశుని పాశం కాలపాశాన్ని ఉచ్చుపన్ని పట్టినట్లు గణాధిపతి ముందు కట్టి పడేసింది.

కాలుడు పరాభవంతో మండిపడుతూ మరింత భీకరజుగుప్సాకరంగా విఘ్నాసుర రూపం చూపుతూ కాలదండాన్ని ఎత్తి ఝుళిపించాడు. గణేశుడు అంకుశాన్ని వదిలాడు. అంకుశం విఘ్నాసురుడి వెన్నెముకలో గుచ్చింది.

విఘ్నాసురుడు అంకుశం తాకిడితో అలా అలా కుదించుకుపోయి, అంకుశం



వెన్నంటి తరుముతూండగా శరణు కోరుతున్నట్లుగా గణేశుడి రెండు పాదాల ఇరుకున పడి బందీగా చిక్కుకున్నాడు. గజముఖుడు విఘ్నాసురుణ్ణి రెండు పాదాలతో గట్టిగా నొక్కాడు.

అప్పుడు కాలుడు విఘ్నాసురుడి నుంచి బయటపడి గణేశుడికి మ్రొక్కుతూ, "గణేశా! నీ మహావిశ్వపాశం ముందు యీ భూమికి, సూర్యోదయ సూర్యాస్తమయాలకు మాత్రమే సంబంధించిన నా కాలపాశం ఎంత! విశ్వాన్ని అదుపులో ఉంచే నీ అంకుశం ముందు నా దండ మేపాటిది! పర్వతంలాంటి భూతాన్ని నీ వాహనరూపాలైన చిట్టెలుకలు తుదముట్టించాయి! నీవు విఘ్నాసురుణ్ణి అధీనంలో పెట్టుకొన్న విఘ్నేశ్వరుడివి! దేవా, నన్ను మన్నించు!" అని వేడుకున్నాడు.

విఘ్నేశ్వరుడు, "కాలా! ఇతరుల పని నెత్తిని వేసుకోవడం కోరి ముప్పుతెచ్చుకోవడమే! నీ ధర్మాన్ని నువ్వు నిర్వర్తించు! ఇక యిక్కడి నుంచి కదిలి, వెళ్ళు," అని మందలించాడు.

కాలుడు మెలివేసిన చేతులతో చెవులు పట్టుకుని మూడుసార్లు వంగి లేచి, లెంపలు వేసుకొని, "బుద్ధి బుద్ధి! ఆ ఇంద్రుడి మాటవిని గడ్డి కరిచాను, బుద్ధి వచ్చింది దేవా! విఘ్నేశ్వరుడవైన నిన్ను నమ్మి కొల్చినవారి దాపులకు నేను పోను. వారిని వ్యాధులు సోకవు, వారికి విఘ్నాలుండవు!" అని చెప్పి శలవు తీసుకున్నాడు.

కాలుణ్ణి విఘ్నేశ్వరుడు భంగపుచ్చినప్పుడే కాలపాశంవల్ల నేల కొరిగిన అభినందన మహారాజు మొదలైనవారంతా సజీవులై నిద్రలేచినట్లు లేచారు. పూల జల్లు కురిసింది.

వినాయకుణ్ణి విఘ్నేశ్వరుడనీ, విఘ్నరాజు అనీ అందరూ కీర్తించారు.

అప్పట్నించీ, ఏ మంచి పనికైనా, శుభకార్యానికైనా స్వస్తికను ముగ్గుగా తీర్చి

దిద్దడం, పసుపుముద్దను విఘ్నేశ్వరుని ప్రతిరూపంగా ఉంచి పూజించడం సంప్రదాయంగా నిలిచింది.

"కాలపురుషుణ్ణి భంగపుచ్చి పాదాక్రాంతుణ్ణి చేసుకొన్న విఘ్నేశ్వరుడి మీద విశ్వాసం కలవారూ, విఘ్నేశ్వరుడి ఆశీర్వాద బలం ఉన్నవారూ కాలప్రవాహానికి ఎదురీత ఈది నిలద్రొక్కుకొని, విజయం సాధించగలరు!" అని చెప్పి పావన మిశ్రుడు ముగించాడు.

ఒకనాటి సాయంకాలం ఒక బాలిక పావనమిశ్రుడి దగ్గిరకు వచ్చి, అతడి చిటికెనవేలు పట్టుకొని ఒక కుడ్య చిత్రం దగ్గిరకు తీసుకువెళ్ళింది.

ఆ చిత్తరువులో అసమాన సౌందర్యం గల ఒక కన్య విఘ్నేశ్వర విగ్రహానికెదురుగా మోకరిల్లి నమస్కరిస్తున్నది. ముక్కుపచ్చలారని ఆమె తల ముగ్గుబుట్టలా ఉంది. పావనమిశ్రుడు ఆ కథ చెప్పడం ప్రారంభించాడు:

ఒక పుణ్య దంపతులకు విఘ్నేశ్వరుని ఆరాధించిన వరప్రసాదంగా రత్నంలాటి ఆడపిల్ల పుట్టింది. పుడుతూనే ఆ శిశువు పురిటిగదికి ఎదురుగా గూటిలో ఉన్న విఘ్నేశ్వర ప్రతిమను విప్పారిన కన్నులతో చూస్తూ, ఆ బొమ్మ పిలుస్తున్నట్లుగా క్యారుమన్నది.



ఆ పాప ఉయ్యాల తొట్టిలో ఊగుతూ గూటిలో వున్న గణేశవిగ్రహాన్ని చూసుకుంటూ నవ్వులతో కేరింతాలు కొడుతూ ఆడుకొనేది.

ఆ పిల్లకు సుందరి అని పేరు పెట్టారు. పేరుకుతగ్గట్టుగా సుందరి గొప్ప సౌందర్యవతిగా పెరిగి పెళ్ళియీడుకువచ్చింది. సుందరికి సౌందర్యంతోబాటు గొప్ప బుద్ధి, తెలివితేటలు, అందరికీ హితవుకూర్చే మాట తీరూ కలిగి ఉండటం చూసి, ఆమెను జ్ఞానసుందరి అన్నారు.

సుందరి అసమాన సౌందర్యంగురించి ఊరూరా చెప్పుకోసాగారు. శాపవశాన పుట్టిన గంధర్వకన్య అనీ, భూమ్మీద



అవతరించిన దేవసుందరి అనీ అన్నారు. ఆమె పాణిగ్రహణానికి గొప్ప ధనసంపన్నులూ, అధికార బలంగలవారూ అసంఖ్యాకులుగా సుందరి తలిదండ్రులను ఒత్తిడి చేశారు. సుందరి గురించి విన్న ఆ రాజ్యమేలే మహారాజే, ఆ కన్యకా రత్నాన్ని తన రాణివాసానికి తీసుకుపోడానికి పరివారంతో రాజధాని నుండి బయలుదేరి వస్తున్నాడని తెలిసింది.

సుందరి ప్రతినిత్యమూ ఆరాధించే నదీ ఘట్టాన ఉన్న విఘ్నేశ్వర శిలావిగ్రహం ముందు మోకరిల్లి, కన్నులు మూసి నమస్కరిస్తూ, "విఘ్నేశ్వరా! శైశవం నుంచీ నిన్నే నమ్మినదాన్ని. సంసారంలో కొట్టుకుపోవడం నాకు యిష్టంలేదు. నన్ను ముసలిదాన్ని చెయ్యి! జ్ఞానసంపద నాకు అనుగ్రహించు! పుట్టినందుకు ప్రయోజనకరమైన పని నా చేత చేయించు!" అని ధ్యానిస్తున్న ఆమె నల్లని కొప్పు వెండిలాగ మెరుస్తూ నెరిసింది. పాలబుగ్గలు సొట్టలు సొట్టలుపడ్డవి. నుదురుఅడ్డంగాముడుతలు దేరింది. నదికి వచ్చినవారంతా నివ్వెరపోతూ చూస్తున్నారు. అమ్మాయి అవ్వ అయింది!

"అమ్మాయి సుందరీ! ఏమిటమ్మా ఇది?" అంటూ కంటనీరు పెట్టుకొంటున్న తండ్రి, తల్లితో, "నేను అమ్మాయినీ కాను, సుందరినీ కాను, అవ్వను! మీరు సంతోషించడానికి బదులు విచారిస్తారెందుకు? మీరిచ్చిన జన్మను సార్థకంగా చేసుకొనే అవకాశాన్ని గణేశుడు అనుగ్రహించాడు. నా కంటె అజ్ఞానులైనవారికి నాకు తెలిసిన హితవచనాలు చెప్తాను. జ్ఞానులైనవారినుండి తెలియనివి తెలుసుకుంటాను. అజ్ఞాన దశలో ఉన్నవారంతా పసిపిల్లలవంటివారే. అంతా నా పిల్లలే, వారికి నేను అవ్వను!

నా పుట్టిన రోజు యీ రోజేకద, ఇదే నా పండగరోజు! పదయాత్రకు బయలుదేరుతున్నాను, నన్ను ఆశీర్వదించండి!" అని అవ్వ అంటూ అక్కడ

పడి ఉన్న చెట్టుకొమ్మను ఊతకర్రగా పట్టుకొని లేచి నిలబడింది.

అప్పుడే అక్కడికి చేరుకున్న రాజును చూసి అవ్వ, "ప్రజల ధన ప్రాణ గౌరవాలను కన్యలను రక్షణలో ఉంచవలసిన నువ్వే, ఒక కన్యను ఎత్తుకుపోవచ్చావు. ఊళ్ళు, ఇళ్ళు దోచుకొనే దండునాయకుడివా? రాజువా?" అని అడిగింది.

సిగ్గుతో సగం చచ్చిపోయిన మహారాజు కత్తినీ, కిరీటాన్నీ తీసి దూరంగా పెట్టి, అవ్వ పాదాలకు ప్రణమిల్లి, "మహాత్మురాలా! నీ దర్శనంతో నా అజ్ఞానం తొలగింది. నేను నా రాజసాన్ని వదిలి ప్రజకు సేవకుడిననుకుంటూ వర్తిస్తాను!" అన్నాడు.



కారణజన్మురాలని అంతా అవ్వను కీర్తిస్తుండగా బయలుదేరుతున్న అవ్వను పల్లకిలో సంచారం చేయవలసిందనీ, సర్వవిధ ప్రయాణ సౌకర్యాలు అమర్చుతాననీ రాజు ప్రాథేయపడ్డాడు.

అవ్వ నిరాకరించి, "రాజా! చెప్పులకు కూడా నోచుకోని అతి సామాన్యులైన కష్టజీవుల మధ్యకు అందలమెక్కి వెళ్ళి ఏ మొగంతో నీతులు బోధించగలను? నువ్వు ప్రజకు విద్యా సౌభాగ్యాలను చేకూర్చు. నీ పని నువ్వు చెయ్యి! నేను సామాన్యురాలిగా, సామాన్యులందరితో ఒకటిగా నేను చేయగల్గినది చేసుకుపోతాను. విఘ్నేశ్వరుడు, అతని ముద్దుల తమ్ముడు సుబ్రహ్మణ్యేశ్వరుడు అన్నీ చూసుకుంటారు. వారే నాకు రక్ష!" అని చెప్పింది.

అవ్వ కర్ర ఊతగా కాలినడకను బయలుదేరి, జ్ఞానపీఠమైన ఒక మఠాన్ని చేరుకొంది. పీఠాధిపతికి మ్రొక్కి, "అయ్యా! నాకు జ్ఞానం ఉపదేశించండి!" అని కోరింది.

పీఠాధిపతి సంశయిస్తూ, "అమ్మా! నువ్వు స్త్రీవి. జ్ఞానోపదేశం పొంది ఏం ప్రయోజనం?" అన్నాడు.

అవ్వ, "నీరూ, దీపమూ మగవాడికే గాని స్త్రీకి ఉపయోగపడవా? ఉపయో



గించలేదా ? గ్రుడ్డివాడి చేతనున్న దీపం ఇతరులకు దారి చూపించగలదు కదా ! జీవిలో నేను అనే జ్ఞానస్వభావం మగదా? ఆడదా ? ఏదీ కానిది, అన్నీ అయినది, అన్నిటా ఉన్నది ఒకటే అని అంటూనే పుట్టుకచేత ఎక్కువతక్కువలు, అర్హతలు ఎంచడం జ్ఞానుల పనేనా?'' అని అన్నది.

పీఠాధిపతి, '' మహాత్మురాలా ! జ్ఞాన పీఠంపై ఉండవలసింది నేను కాదు, నీవే!'' అని అన్నాడు.

అవ్వ, '' పీఠాలు, మఠాలు ఎందుకు? అందరికీ తేలికగా అర్థమయ్యేలాగ దగ్గిరి కెళ్ళి ఎక్కువమందికి జ్ఞానం అందించడం మంచిది కదా ! పంచభక్ష్య పాయసాల రాజభోజనం ఒకడికి పెట్టే కంటే, అంతా తినేది పదిమందికీ పెడితే కాదా!'' అని అన్నది.

'' ఔను ! నేనూ అదే అనుసరిస్తాను,'' అని శిరసు వంచి నమస్కరించాడు పీఠాధిపతి.

అవ్వ అలా వెళ్తూండగా ఒక మంచి నీటి బావి దగ్గిర నలుగురు స్త్రీలు నీళ్ళు తోడుకొని తీసుకెళ్లే విషయంలో ఒకామె చెప్తున్నది వింటున్నారు. ఆవిడ శాసిస్తున్నట్టు, ''ఎవరు ముందు వచ్చినా, వెనక వచ్చినా నేను ముందు తోడుకెళ్ళాలి. తర్వాత ఈవిడగారు, తర్వాత ఆమె, ఆ తర్వాత ఆ మనిషి !'' అని అంటున్నది.

దూరంగా ఒక బాలిక, ''కాసిని నీళ్ళు పొయ్యండమ్మా, గొంతారిపోతున్నది !'' అంటూ దీనంగా అరుస్తున్నది.

నలుగురు స్త్రీలు ఏకకంఠంతో, '' దూరం, దూరంగా పోవే ! యీ చాయలకు రాకు !'' అంటూ కసిరినట్టు అరుస్తూండగా, చాలాదూరం ఎండలో నడిచి వచ్చిన బాలిక శోషిల్లుతూ పడిపోయింది.

అప్పుడు అవ్వ వెళ్ళి తన జారీ చెంబుతో బాలిక నోట్లో నీళ్ళు పోసి తాగించింది. మిగిలిన నీరు అవ్వ తాగి దాహం తీర్చుకుంది. అది చూచి నలుగురు స్త్రీలూ నోళ్ళు నొక్కుకుంటూ, '' హవ్వ !

ఎంత పనిచేశావు, అవ్వా! అది తాగగా మిగిలిన నీరు నువ్వు తాగుతావా! అది జాతి తక్కువది!'' అన్నారు.

అవ్వ త్రేన్చి శాంతంగా, ''శ్రీమతుల్లారా! అసలు జాతే లేనిదాన్ని నేను! అయితే ఆ పిల్లలో, నాలో నీళ్ళే నాళాల్లో ప్రవహిస్తూన్నందువల్ల నీళ్ళే మమ్మల్ని సేద దేర్చాయి!'' అంటూ కుతూహలంగా వెళ్ళి వాళ్ళ కడవ, బిందెల్లోకి చూసి ఆశ్చర్యంతో, ''మీ శరీరం నిండా పాలే ఉంటాయనుకుంటున్నాను, మీకు నీళ్ళెందుకు? త్రాగడానికి కాదు గదా? అమ్మల్లారా! నీళ్ళు మాకు వదలండి, మీరు పాలే త్రాగండి!'' అని అంటూ తన చెంబు నిండా నీళ్ళు పోయించుకున్నది.

నలుగురు స్త్రీలూ అవ్వ మాటల్లో దాగి ఉన్న సత్యాన్ని గ్రహించి బుద్ధి తెచ్చుకున్నారు.

అవ్వ అలా వెళ్తూండగా ఒక ఊళ్ళో జీవాల బలులు సాగుతున్నవి. జనం భయపడుతున్నట్లుగా దేవతకు మ్రొక్కుతున్నారు.

అవ్వ, ''ఎంత అన్యాయం చేస్తున్నారే, తల్లీ! వాళ్ళేమో మాంసాన్ని మంచి రుచులతో వంట చేసుకొని తింటారు, నిన్ను పచ్చి నెత్తురు తిని బతికే క్రూర జంతువుగా అవమానిస్తున్నారు. తల్లిని అవమానించే పిల్లలైపోయారు వీళ్ళంతా!'' అని అంటున్న మాటలు జనం విని, ''అపచారం! అపరాధం! అమ్మ తల్లికి ఆగ్రహం వస్తే అంతా మసి చేస్తుంది!'' అంటూంటే, అవ్వ, ''లంచం పెట్టలేదని ఏ తల్లైనా పిల్లల్ని చంపుతుందా? మీరు ఊరికే భయపడుతున్నారు, అంతే! భయాన్నే భక్తి అనుకుంటున్నారు! మీ కోరికల్ని అమ్మకు అంటగట్టుతున్నారు! నిజమైన భక్తి అమ్మ మీద మీకు కలిగిన నాడు మీకు భయమూ ఉండదు, ఆపదలూ ఉండవు!'' అని చెపుతూ వారికి అర్థమయ్యేలాగ భక్తి మార్గాన్ని ఉపదేశించింది.





# విఘ్నేశ్వరుడు

అవ్వ ఒకరోజున ఫలవృక్షాలతో నిండివున్న మార్గంగుండా వెళ్తూండగా ఒక అందమైన బాలకుడు చెట్టుమీద కూర్చుని పాడుకుంటున్నాడు. చెట్టునిండా పళ్ళు విరగపండి వున్నవి.

ఆ కుర్రవాణ్ణి పలకరించి మాట్లాడాలని అవ్వకు బుద్ధిపుట్టింది. "నాయనా! ఒక పండు యిలా పడెయ్యవూ! నోరూరుతున్నది," అని అన్నది.

బాలుడు నవ్వుతూ, "అవ్వా! ఏ పండు కావాలి? చెట్టు నిండా రకరకాల పళ్ళున్నవి. ముసలితనాన్ని పోగొట్టే పండు యిమ్మంటావా? మృత్యువుని దూరంజేసే పండా? ధనరాసుల్నిచ్చే పండా? ఎలాంటి పండు కావాలి?" అన్నాడు.

అవ్వకు ఆ బాలుడు సుబ్రహ్మణ్యేశ్వరుడే అని తెలిసిపోయింది. ఆమె చేతులెత్తి మ్రొక్కుతూ, "సుబ్రహ్మణ్యస్వామీ! ఎంత పంచినా తరగని అపార జ్ఞాన సంపదనిచ్చే పండు యివ్వు, తండ్రీ! జ్ఞానఫలాన్ని అనుగ్రహించు!" అంటూ సాగిలపడింది.

సుబ్రహ్మణ్యస్వామి నిజరూపంతో దండాన్ని ధరించి నెమలిపై సాక్షాత్కరించాడు. అవ్వ శిరస్సు బల్లెపు మొనతో సుతారంగా తాకి అనుగ్రహించాడు. అవ్వకు ఒక్కసారిగా విశ్వస్వరూపమైన ఓంకార తత్వము, బ్రహ్మ జ్ఞానము, జీవన్ముక్తి మార్గము తెలిసి అపారమైన జ్ఞానం కలిగింది. సుబ్రహ్మణ్యేశ్వరుడు

22. సహస్రసేకు గణపతి



అవ్వను ఆశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

అవ్వ కాలినడకను ఊరూరా, వాడవాడా జ్ఞానాన్ని, భక్తిని, ఉత్తమ జీవన ధర్మాలను సామాన్యులకు తెలిసే మాటలలో ప్రబోధిస్తూ దేశసంచారం చేసింది.

అవ్వ నోటి నుంచి వచ్చిన మధుర వాక్కులు కవితలాగ గీతాలై ప్రజాసామాన్యంలో వ్యాప్తిపొంది చిరస్థాయిగా నిలిచాయి.

అవ్వ అలావెళ్తూ చీకటిపడ్డ వేళకు ఒక అరణ్య మార్గానికి వచ్చింది. ఆకాశంలో మేఘాలు దట్టంగా క్రమ్ముకొచ్చాయి. చిట్టచీకటిగా వుంది. ఉండి, ఉండి మెరుస్తున్నది. తుప్పర పడుతున్నది. అవ్వ కాలికి రాయి తగిలి పడిపోయింది. చేతనున్న ఊతకర్ర దూరంగా పడింది.

ఆ చీకటిలో ఎవరో వస్తున్న పాదధ్వని మధురంగా వినిపించింది. అవ్వ తల ఎత్తి చూసింది. అప్పుడే మెరిసింది. మెరుపు వెలుగులో ముద్దుగా, బొద్దుగా దోరపు బొజ్జతో ఒక బాలుడు కనిపించాడు. ఆ బాలుడు అవ్వను లేవనెత్తి కర్రతెచ్చి అందించాడు. అవ్వ పట్టిన కర్రను బాలుడు కదలకుండా పట్టుకుని, "అవ్వా! ఎక్కడికి వెళ్తున్నావు? ఏ క్షేత్రం చూడాలని వెళ్తున్నావు? ఏ తీర్థం సేవిస్తావు?" అని అడిగాడు.

"నాయనా! నాకు యీ పుడమి అంతా ఒకే ఒక దివ్యక్షేత్రం. ప్రత్యేకంగా క్షేత్రాలు, తీర్థాలు సేవించాలని నాకులేదుగాని నేను చేరవలసిన క్షేత్రాన్ని ఎలాగ చేరాలో దారి కనిపించడం లేదు. ఇంతకూ నువ్వెవరో ఏమిటో! పసివాడివి యీచీకటిలో వస్తున్నావెందుకు?" అని అవ్వ అన్నది.

"అవ్వా! నేను నీ ఆబాల్య సన్నిహితుణ్ణి. పుట్టినప్పట్నించీ నన్నెరిగున్నదానివే, చీకటిలో గుర్తించ లేకపోతున్నావు! ఇంతకూ నువ్వు చేరాలనుకుం

టున్న ఆ క్షేత్రం ఏమిటో చెప్పావు కాదు!'' అన్నాడు బాలుడు.

''చెప్పి ఏంలాభం! తీసుకెళ్తావా? అది శివసన్నిధానం అనే మహాక్షేత్రం!'' అన్నది అవ్వ.

''ఓష్! ఈ మాత్రందానికేనా, అదెంత పని నాకు! నీ చెయ్యి పట్టుకొని తీసుకెళ్తాను, పద!'' అంటూ బాలుడు అవ్వ చేతిని పట్టుకొని అడుగు వేశాడు. రెండో చేత ఊతకర్రతో అవ్వ అడుగు ముందుకు వేయబోతుండగా పెద్ద మెరుపు మెరిసింది. ఆ కాంతిలో తన చేతిని తొండంతో పట్టుకొని నడిపించే విఘ్నేశ్వరుణ్ణి చూసి అవ్వ కన్నులు మూసి, ''దేవా! చిన్ననాటి నుంచీ నువ్వేనడిపిస్తున్నావు, నేను కన్నులు మూసుకున్నా తెరిచినా ఒకటే!'' అని అనుకుంటూ కళ్ళు తెరవకుండానే విఘ్నేశ్వరుడు ఎక్కిస్తూ తీసుకెళ్తూంటే ఎన్నో ఎన్నో మెట్లు ఎక్కుతూ, అలా ఎంత కాలం గడిచిందో తెలీకుండా వెళ్ళింది.

అలా వెళ్ళగా వెళ్ళగా, ''అవ్వా! శివసాన్నిధ్యాన్ని సమీపించాము!'' అని అన్న విఘ్నేశ్వరుని మాటకు అవ్వ కన్నులు తెరిచి చూసింది.

అక్కడ వెలుగు తప్ప మరేమీ కనిపించలేదు. క్రిందికి చూస్తే అనేక నక్షత్ర మండల సముదాయాలు సోపానపంక్తుల్లాగ



కనిపించాయి. ఎన్నెన్నో సూర్యకుటుంబాలు, తోకచుక్కలు, వాయురూపంలో తిరుగుతూ పెరుగుతూన్న జ్యోతులు, వెలుగు చక్రాల్లాగ గిర్రున తిరుగుతున్న తేజోమండలాలతో నిండిన అనంత విశ్వం పాదాల దిగువ కన్నులపండువుగా వున్నది.

విఘ్నేశ్వరుడు అవ్వ చేతిని వదలి, ''అవ్వా! శివసన్నిధానాన్ని చేరుకున్నావు. ఇక్కడ కాలం అనేది లేదు. నాశము అనేది లేదు. ఇదే సృష్టి స్థితిలయాలకు అతీతమైన శివుని సన్నిధానం, అసలు కైలాసం! విశ్వనాథుడు విశ్వేశ్వరుడైన శివుణ్ణి దర్శించు!'' అని చెప్పి అంతర్థానమయ్యాడు.

హలంగా చూస్తూండడం గమనించి పాపన మిశ్రుడు కథ ఆరంభించాడు:

రాజంతటి భూస్వామి ఒకడు ఏటేటా వినాయక పూజలు, ఉత్సవాలు ఘనంగా జరిపిస్తూ, గణేశభక్తశిరోమణి అనిపించు కున్నాడు. అతనికి అనేక పంటపొలాలతో బాటు పెద్ద చెరుకుతోట ఉంది.

ఆ చెరుకు తోట పని అంతా చూసు కుంటూ ప్రతి ఏటా పుష్కలంగా చెరుకు పండించి భూస్వామికి మంచి రాబడి చేకూర్చే పాలేరు, మనస్సులో విఘ్నేశ్వ రుణ్ణి నమ్మిన భక్తుడు. "ఈసారి మరింత బాగా పండించు గణేశా!" అని మనస్సులో మొక్కుతూ చెరుకునాటి ఏడాదికేడాది తన యజమానికి మరింత లాభం చూపించేవాడు.

పాలేరూ అతని భార్యా, పదేళ్ళ కొడుకూ ముగ్గురూ చెమటోడ్చి పని చేసేవారు. భూస్వామి మాత్రం చాలా తగ్గించి కూలి ఇచ్చేవాడు, అదీ సరిగా ఇచ్చేవాడు కాదు. పాలేరు అమాయకుడు, అల్ప సంతోషి. ఏమీ అనేవాడు కాదు.

భూస్వామి భార్య ఉత్తమురాలు, మంచి అయినా చెడ్డ అయినా మనస్సులో గణేశుడికే నివేదించుకొనేది. పాలేరుకి కూలి యివ్వడంలో భర్త మరీ అన్యాయం చేస్తూంటే, "పాపం, వాళ్ళు పడే కష్టా




అవ్వకు లింగాకారంగా మీదకూ కిందకూ ఒకేలాగ వ్యాపించి ఉన్న గొప్ప జ్యోతి కనిపించింది. ఆ జ్యోతిలో ప్రమథ గణాలు చేస్తున్న స్తోత్రం ఓంకారధ్వనిగా వినిపిస్తున్నది. విశ్వేశ్వరుడైన శివుడు కని పించాడు. అతనికిరుపక్కలా, విఘ్నే శ్వరుడు, పార్వతి కుమారస్వామి, నంది మొదలైన వారంతా ఉన్నారు.

అవ్వకు శివసాక్షాత్కారమైంది. శివుడు ప్రీతితో తన అభయహస్తాన్ని అవ్వ తలపై ఉంచి అనుగ్రహించాడు. ఆ విధంగా అవ్వ శివసాయుజ్యాన్ని పొందింది.

మంటప చిత్రాల్లో, చెరుకుగడ పట్టి ఉన్న విఘ్నేశ్వరుడిని ఒక రైతు కుతూ

నికి మీరిచ్చేది ఏ మాత్రం? సరిగా యివ్వండి!'' అనేది.

''బాగానే ఉంది నీ బోడి సలహా! ఇలాగ మిగుల్చుకుంటూ వస్తేనే గదా మనం గణేశఉత్సవాలు జరిపించేది!'' అనేవాడు భూస్వామి.

ఆమె ''కష్టపడేవాళ్ళ నోట మట్టి గొట్టి పూజలూ, ఉత్సవాలూ జరపకపోతేనేం? గణేశా, ఈయనకు మంచిబుద్ధి కలిగించు!'' అని అనుకునేది.

ఆ ఏడాది చెరుకు ఏనుగుతొండాల్లాగ మరింత విశేషంగా పండింది. వెయ్యేసి చెరుకులు కట్టిన మోపులు బళ్ళతో భూస్వామి దివాణం చేరుతున్నాయి.

''అంతా గణేశ్వరుడి దయ. ఊరికే పోతాయా, పూజలూ ఉత్సవాలూ. మరి దేనికి చేయిస్తున్నాం!'' అన్నాడు భూస్వామి.

''అంతే గాని మన పాలేరు శ్రమ ఏమీ లేదంటారు, అంతేనా?'' అని భార్య అన్నది.

''బాగానే ఉంది నీ వల్లమాలిన జాలి! అలా పాలేర్లనూ, జీతగాళ్ళనూ వెనకేసుకొస్తే మనం కూడా వాళ్ళ వెనకే వెళ్ళవలసి వుంటుంది. ఈ మనుషుల్లో ఏముంది. అంతా ఆ వినాయక దేవుడి మహిమ!'' అన్నాడు భర్త.



''ఓ విఘ్నేశ్వరా! ఈయనకు జ్ఞానోదయం కలిగించవలసింది నీవే!'' అని ఆమె మనసులో ప్రార్థించింది.

పాలేరు కొడుక్కి విఘ్నేశ్వరుడంటే ప్రాణం. వినాయకచవితికి తెల్లకలువలూ, ఎర్రతామరలూ, పూలూ, పత్రీ ప్రతి ఇంటికీ పూజకు తెచ్చి యిచ్చేవాడు.

వినాయక చవితి వచ్చింది. కుర్రవాడి ప్రాయంతోబాటు బుద్ధి కూడా ఎదుగుతున్నదేమో, వాడు చెరుకు మోపుల్ని భూస్వామి దివాణానికి చేరవేయిస్తున్న తండ్రి దగ్గిరకెళ్ళి, ''నాన్నా, మనం కూడా వినాయకుడికి పెట్టుకుందాం. ఒక చెరుగ్గెడ తీసుకెళ్తా!'' అన్నాడు.



పాలేరు ఒక చెరుకు తీసి కొడుక్కిచ్చాడు. వాడు దాన్ని ఇంటికి తీసుకెళ్తున్నాడు. అది భూస్వామి కంట బడింది.

భూస్వామి ఉగ్రనరసింహావతారుడై, "ఏమిరా, నా చెరుకంతా నీ ఇంటికి చేరవేయిస్తున్నావా?" అంటూ పాలేరుపై విరుచుకుపడి నానా మాటలూ అంటూ, కొరడాతో కొడుతూంటే, భూస్వామి వెంటనున్న పరివారమూ, గ్రామస్థులూ చూస్తూ ఊరుకున్నారే గాని కిక్కురుమనలేదు. భూస్వామి పలుకుబడి అలాంటిది! అతడేం చేసినా చెల్లుతుంది, ఎదురు తిరిగి అడిగేవాడు లేడు.

పాలేరు తాళుకోలేక, "చవితి కదా వినాయకుడికి పెట్టుకుందామని పట్టుకెళ్ళమని యిచ్చాను, ఒక్కటంటే ఒక్క చెరుకు.....!" అన్నాడు.

భూస్వామి, "ఏమిటీ! మీ జాతి తక్కువ వాళ్ళకి పూజలూ, వినాయకుడూనా?" అన్నాడు.

పాలేరు, "కడజాతి అయితే అయింది గాని, దేవుడూ భక్తీ ఉండవా?" అన్నాడు.

భూస్వామి హేళనగా, "నీ ముఖానికి భక్తి కూడానా! నక్కకూ, నాకలోకానికీ ఉన్నంత దూరం! చెరుగ్గెడ పత్రా!" అన్నాడు.

పాలేరు, "ఒక్క చెరుకు కోసం అలా రాపాడిపోతారేమయ్యా? బళ్ళతో చెరుకు దింపుకున్నది చాలదా, ఒక్క చెరుకుతో ఏం బావుకుంటావయ్యా?" అన్నాడు.

భూస్వామి, "ఎంత మాట కూశావురా! ఒకటి కాదు పది కాదు వెయ్యి చెరుకులైనా నాకు పూచికతో సమానం తెలుసా! తెల్లవారేసరికి నువ్వు వెయ్యి చెరుకులు తినాలి! నమిలిన పిప్పి అంతా పోగు కనిపించాలి! లేకుంటే చెరుకొక్కంటికి వెయ్యి కొరడా దెబ్బలు తింటావు, తెలిసిందా!" అంటూ పాలేరును పెడరెక్కలు విరిచి కట్టించి, భృత్యులచేత వాణ్ణి బందీలాగ చెరుకు

నిలవచేసే సాలలో త్రోయించి, వెయ్యి చెరుకుల మోపు ముందు పడవేయించాడు.

భూస్వామి గొప్ప తిక్కమనిషి, ఎంత తోస్తే అంత. పాలేరు నుంచిన సాల చుట్టూరా భటుల్ని కాపలా పెట్టాడు.

భూస్వామి భార్య, "విఘ్నేశా! పాలేరు ఉత్త అమాయకుడు. చెరుకు తినడానికి పూనుకుంటే పాపం నిష్కారణంగా చస్తాడు. తినకపోతే నా భర్త దెబ్బలు కొడతాడు. వాణ్ణి ఎలాగ కాపాడతావో మరి!" అని మనసులో అనుకొంది.

పాలేరుకి ఏమీ తోచలేదు. చేసేదిలేక విఘ్నేశ్వరుణ్ణి తలచుకొంటూ, చీకటిపడే వేళకు అలాగే నిద్రలో పడిపోయాడు.

తెల్లవారుతూనే భూస్వామి వెళ్ళి చూస్తే, తెల్లగా హిమాలయపర్వతంలాగ చెరుకు పిప్పిపోగు కనిపించింది. భూస్వామి దెయ్యం పట్టినవాడిలాగ పెద్ద కేకపెట్టి, తెరిచిన నోరు తెరిచినట్టే ఉండిపోయాడు.

ఆ కేక విని వచ్చిన భార్యతో భూస్వామి, "అంతా సర్వనాశనం! సాలలో ఒక్క చెరుకు మిగలకుండా అంతా పిప్పి పిప్పి! పాలేరు కాడు, భూతం! వాడు మనల్ని తినేస్తాడు, పద!" అంటూ అరుస్తూంటే, ఆమె నవ్వి, "వాడు భూతమూ కాదు, తిననూలేదు! నేను కళ్ళారా చూశాను. అప్పటికింకా తెల్లారలేదు. ఏనుగ ఘీంకారం విని, కిటికీ లోంచి చూశాను. పెద్ద ఏనుగు చెరుకు మేస్తూ కనిపించి మాయమైంది!" అన్నది.

"ఏనుగేమిటి, నీ మొహం! యీ చుట్టుపక్కల ఏనుగన్నది ఉన్నట్టు వినలేదు," అని భూస్వామి అంటూండంగా, కొంతమంది వినాయక ఉత్సవశాల నుండి పరుగున వచ్చి, "రాత్రినుంచీ పందిట్లో పూజలో పెట్టిన వినాయక విగ్రహం కనిపించటంలేదు. అంతటా వెతికాము," అని చెప్తూనే సాలలోకి చూస్తూ, "అదుగో, విగ్రహం, అదుగో!" అంటూ అటు కేసి వెళ్ళారు.






సాలలో యింత గొడవ జరుగుతున్నా, పాలేరు ఇంకా నిద్రిస్తూనే ఉన్నాడు. పక్కనే పత్రిపూలతో నిండిన గణేశ విగ్రహం ఉంది. నేలంతా చెరుకుపానకంతో బురద, బురదగా తడిసి ఉంది. కాపలావాళ్ళను పిలిపించి అడిగితే వాళ్ళు, "చాలా రాత్రయింది, పాలేరు నిశ్చింతగా నిద్ర తీస్తున్నాడు, మాకూ కునుకొచ్చింది. అంతలో ఏనుగు అరుపుతో కళ్ళు తెరిచాము. పెద్ద ఏనుగు చీకట్లో తెల్లగా కనిపించింది, చెరుకంతా లాగి మేసేస్తున్నది, గానుగలాగ పిప్పంతా ఊసేస్తున్నది; మాకు చెడ్డభయమేసింది. పారిపోయాం!" అంటూ వాళ్ళింకా భయంతో వొణికిపోతూనే చెప్పారు.

భూస్వామిలో గొప్ప పరివర్తనం కలిగింది. అలాగే వెళ్ళి పాలేరు పాదాలకు మొక్కుతూన్నట్లు సాగిలపడిపోయాడు. పాలేరు మేల్కొన్నాడు, లేచి నుంచున్నాడు. భూస్వామి అతని పాదాలు వదలకుండా శిరస్సుతో మొక్కుతూనే ఉన్నాడు.

భూస్వామి భార్య విఘ్నేశ్వర విగ్రహానికి ప్రణమిల్లి, "స్వామీ! ఇన్నాళ్ళకు మమ్మల్ని అనుగ్రహించావు, ధన్యులం!" అని అంటూ జరిగిందంతా పాలేరుకి చెప్పింది.

మహాద్భుతాన్ని విన్న జనం తండోపతండాలుగా అక్కడికి చేరుకుంటున్నారు. దివాణం క్రిక్కిరిసిపోయింది. నేలపై



ఏనుగు పాదాల గుంటల్లో నిలిచి ఉన్న చెరుకురసాన్ని తీర్థంగా సేవిస్తూ, చెరుకు పిప్పిని విఘ్నేశ్వర మహాప్రసాదంగా పట్టుకువెళ్తున్నారు.

పాలేరు, భార్య పిల్లవాడితో కలిసి వినాయక విగ్రహానికి దణ్ణాలు పెడుతూ, "చిన్న పత్రిపిసరైనా వేసి నిన్నెన్నడూ పూజించలేదు. నీ కోసమని పంపిన చెరుకు నీకు పెట్టనైనాలేదు. నా కోసం ఎందుకింత శ్రమపడ్డావయ్యా? ఏనుగు రూపంతోనైనా అందరికీ కనిపించావు, నాకు కనిపించావు కావు. నిద్దరపోయిన దద్దమ్మను!" అంటూ పిల్లవాడిలాగ బావురుమన్నాడు.

అప్పుడు విగ్రహం స్థానంలో చెరుకుగడ పట్టుకొని విఘ్నేశ్వరుడు పాలేరు ముందు సాక్షాత్కరించాడు. పాలేరు కొడుకు తీసుకువెళ్ళిన చెరుకుగడే అతని చేతిలో ఉంది!

విఘ్నేశ్వరుడు పాలేరును తన తొండంతో దగ్గిరకు తీసుకొని, అభయ హస్తంతో అతని తల నిమురుతూ, "నాయనా! కులాలు, జాతులు ఆచారాలు నేను పెట్టినవి కావు, అంతా మనుషులు కల్పించుకున్నవే. నా దగ్గిర ఎక్కువ తక్కువలకు చోటు లేదు! అందుకే నీకు కనిపించాను!" అని చెప్పి అంతర్థానమయ్యాడు.

జనులందరూ చేతులెత్తి జోడిస్తూ పాలేరుతో, "నీ మూలంగా మాకు గణేశుని దర్శన భాగ్యం కలిగింది," అంటూ పదేపదే మొక్కుతూ బ్రహ్మరథం పట్టారు.

"ఇక్షు అంటే చెరుకు, సహస్ర-ఇక్షు, వెయ్యి చెరుకుల గణపతి; సహస్రేక్షు గణపతిగా విఘ్నేశ్వరుడు కీర్తింపబడ్డాడు. చెరుకుగడ పట్టుకొన్న వినాయక విగ్రహం ప్రతిష్ఠింపబడి అక్కడ గొప్ప ఆలయం వెలిసింది," అని పావనమిశ్రుడు కథ ముగించాడు.

ఆలయమంటపంలోని చిత్రాల కథలన్నీ పావనమిశ్రుడు చెప్పాడు గాని



ముఖద్వారం మీద చిత్రింపబడినది మాత్రం మిగిలి ఉంది. అది చాలా పెద్ద చిత్తరువు. మంటపంలోని చిత్రాలన్నీ ఒక ఎత్తు అది ఒక్కటీ ఒక ఎత్తు! చిత్రలేఖన ప్రతిభ అంతా అందులో ఉంది. ప్రతి రోజూ ఆ చిత్రాన్ని పరీక్షగా నిల్చుని చాలా సేపు తదేకంగా చూస్తూండే యువకుడొకడు పావనమిశ్రుడి పాదాలకు నమస్కరించి, "మహాశయా! ఈ ఆలయ మంటపంలోని చిత్రాలను ఎవరు చిత్రించారు? ఆ మహాశిల్పి చరిత్ర ఏమైనా ఉంటే చెప్పండి! ఆ ముఖద్వారం మీద వున్న చిత్రానికి నా కళ్ళూ, మనస్సూ అంకితమైపోయాయి. ఆ చిత్తరువు గురించిన గాథ కూడా చెప్పి చిత్ర చరిత్ర సంపూర్ణం చెయ్యండి!" అన్నాడు.

పావనమిశ్రుడు ఆ యువకుణ్ణి సాదరంగా చూసి, "నాయనా! చూడగా నువ్వు చిత్రకారుడిలాగ కనిపిస్తున్నావు! ముఖద్వారం మీది చిత్తరువు నాకూ అభిమాన చిత్రమే. దాని గాథ తర్వాత చెప్పి విఘ్నేశ్వర చరిత్ర సంపూర్ణం చేస్తాను! నువ్వడిగిన చిత్రశిల్పికి చరిత్ర లేకపోలేదు, ఉంది!" అంటూ కన్నులు మూసి ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్లు ధ్యానించి, కాస్సేపైనాక చెప్పడం ప్రారంభించాడు:

వాతాపి నగరానికి సాధువుల గుంపుతో పధ్నాలుగేళ్ళప్రాయంగల వాడొకడు వచ్చి వాతాపి గణపతి ఆలయం వదలకుండా అలాగే ఉండిపోయాడు.

అతని ఊరేదో పేరేదో అతనికే తెలియదు. అతని నుదుట పెద్ద గాయం మానిన గుర్తు చూసి, పాపం ఏదో దెబ్బ తగిలి స్మృతి పోగొట్టుకొన్నవాడులాగుంది, అని అంతా అనుకున్నారు. ఆ బాలుడు మూగవాడా అన్నట్లు అట్టే మాట్లాడేవాడు కాడు. గోడల మీద బొమ్మలు గీస్తుండే వాడు. మంటపం రాతిపలకల నేలమీద సుద్దతో బొమ్మలు గీస్తూండేవాడు. గీస్తూన్నంతసేపూ అతని ముఖం పూర్ణచంద్ర



బింబంలాగ నవ్వుతూ వెలుగుతూండేది. అంచేత చిత్రానందుడు, చిత్రముఖుడు అనీ, అతడు ఎక్కువగా విఘ్నేశ్వరుడి బొమ్మల్నే వేస్తూండడంవల్ల విఘ్నేశ్వర చిత్రకారుడు అనే పేరును లుప్తాక్షరిగా విచిత్రుడు అని అంటూండేవారు.

అప్పటికి గజాననపండితుడు చాలా వృద్ధుడయ్యాడు. రోజూ సాయంత్రం ఇంటి దగ్గిర పిల్లలకు విఘ్నేశ్వరుడి కథలు చెప్పుతూండేవాడు. విచిత్రుడు ఆ కథలను అతిశ్రద్ధగా అరుగు మీద చెవికోసుకొని వింటూండేవాడు. కథ విన్న మర్నాడు ఆ కథకు సంబంధించిన చిత్రం ఏ గోడ మీదనో కనిపించేది.

గజానన పండితుడికి విచిత్రుడి మీద చాలా వాత్సల్యం. ఇంటిలోపలికి పిల్చినా విచిత్రుడు గడపమీద ద్వారం వెలుపలే కూర్చుని వింటూ, "స్వామీ, ఇక్కడ కూచుని వింటేనే నాకొక్కడికే చెబుతున్నట్లు ఎంతో బాగా వినిపిస్తున్నది!" అనేవాడు. విచిత్రుడు చిత్రించే విఘ్నేశ్వరుడి బొమ్మలు చూసి గజాననుడు మురిసిపోతూ, విఘ్నేశ్వరుడికి సంబంధించిన అనేక కథలను ప్రత్యేకంగా అతనికి చెబుతూండేవాడు.

విచిత్రుడి వెనక ఎప్పుడూ పిల్లలు గుంపులుగా ఉండేవారు. అతను బొమ్మలు వేస్తూంటే నిశ్శబ్దంగా చూసి ఆనందిస్తూ, తర్వాత చిన్న చిన్న బొమ్మలు వేస్తూండేవారు. ఊళ్లో పిల్లలకి చిత్రకళ అబ్బింది.

విచిత్రుడు పగలంతా వీధుల్లో గోడల మీద జేగురుముక్కతోనో, సుద్దరాయితోనో బొమ్మలు వేస్తూ, వాతాపి గణపతి ఆలయంలో పంచే ప్రసాదంతో గడిపి, రాత్రి ఆలయమంటపం మెట్లమీద ఓ వారగానే, ఊరి చివరనున్న వాడలో ఏ పంచకిందనో నిద్రపోయేవాడు.

ఆ వాడలో కుమ్మరులు, చర్మకారులు, పంచములు మొదలైనవారుండేవారు. విచిత్రుడంటే ప్రాణం పెట్టేవారు. ఏ అపరాత్రివేళ విచిత్రుడు వచ్చినా అతని

కోసం ఉంచినదాన్ని పెట్టి తినిపించి మరీ విచిత్రుడికి పడక సదుపాయం చేసి విదురపోయేవాళ్ళు.

ఆ విధంగా విచిత్రుడు పెరిగి పెద్ద వాడయ్యాడు.

తానెవరో తనకే తెలియకుండా మరిచి పోయిన విచిత్రుడికి అన్నలూ తల్లీ తండ్రీ అందరూ ఉన్నారు!

వాతాపి నగరానికి కొంత దూరంలో ఉన్న ఒక ఊళ్లో మధ్యతరగతి కుటుం బంలో విచిత్రుడు పుట్టాడు. తండ్రి మూలంగా అతనికి అతి బాల్యంలోనే బొమ్మలు గీయడం అబ్బింది. బొమ్మలు వెయ్యడానికే పుట్టాడా అన్నట్లు ఆ కుర్ర వాడికి మరేదీ అబ్బలేదు. అన్నలు, వది నలు అతణ్ణి యీసడించుకొని ఇంటినుండి తరిమేశారు. కుర్రవాడికి విఘ్నేశ్వరుడంటే చాలా యిష్టం. వాతాపి నగరానికి బయలు దేరివస్తూ, తిండీతిప్పలు లేని నీరసంతో మార్గంలో ఒక కరుకురాతి మీద పడి పోయాడు. దెబ్బ తగిలి తెలివితప్పి పడి ఉన్న అతణ్ణి సాధువుల గుంపు కాపాడి వాతాపి నగరానికి తెచ్చారు. అదీ విచి త్రుడి బాల్యచరిత్ర.

ఆ ఏడాది వాతాపి నగరంలో వినాయక చతుర్థి. ఉత్సవాలకు ఒక ప్రదర్శన ఏర్పాటు జరిగింది.



నిలువెత్తు వినాయక విగ్రహాలను చిత్ర కళా ప్రతిభ కనపరుస్తూ రంగులు వేసి ప్రదర్శనలో పెట్టాలి. అన్నిట్లో గొప్పగా ఉన్న విగ్రహాన్ని వెయ్యి బంగారు కాసు లకు నవరాత్రి ఉత్సవాలు నిర్వహించే వారు కొంటారు. రత్నఖచిత స్వర్ణకంక ణాన్ని నగరపాలకులు చిత్రకారుడికి బహూకరిస్తారు.

ఆ పోటీ ప్రదర్శనకు అస్థాన చిత్ర కారులూ, గొప్ప గొప్ప చిత్రకళా నిపు ణులూ చాలా మూల్యాన్ని వెచ్చించి దేశాంతరాల నుండి తెప్పించిన రంగులు, బంగారు పూతలు, రంగురంగుల మెరుపు రేకులు, రంగురాళ్ల పొళ్ళు ఉపయోగించి,




మెరుగుపూత పెట్టిన విగ్రహాలను ప్రదర్శనలో పెట్టారు.

విచిత్రుడికి ఒక కుమ్మరి మిత్రుడున్నాడు. విచిత్రుడు దగ్గిరుండి చెప్పిన విధంగా అతడు బంకమట్టితో విఘ్నేశ్వర విగ్రహాన్ని చేశాడు. విచిత్రుడు సున్నము, మసి, జేగురు, పచ్చమట్టి, ఆకుపసర్లను ఉపయోగించి విగ్రహానికి రంగులు దిద్దాడు.

విచిత్రుడు రంగులు వేసిన ఆ విగ్రహాన్ని చిత్రకార ప్రముఖులు ప్రదర్శనలో పెట్టనివ్వలేదు. విచిత్రుడు ప్రదర్శన నిర్వాహకులతో, "అయ్యా! దయతో చిట్ట చివర్న నా విగ్రహాన్ని కూడా ఉంచండయ్యా! ఉడతాభక్తిగా నేను కూడా నాకు వచ్చినంతగా విఘ్నేశ్వరుడికి రంగులు వేశానని అనుకుంటూ, ఆ గొప్ప గొప్ప విఘ్నేశ్వరుల సరసన నా విఘ్నేశ్వరుడు కూడా ఉంటే చూసుకోవాలని ఉందయ్యా! అంతకు తప్ప మరే కోరికా లేదు!" అని ప్రాధేయపడ్డాడు.

కాని, "కులగోత్రాలు, ఊరూ పేరూ లేనివాడివి, కడజాతులతో తిరిగేవాడివి. అలాంటి నీ చేతుల్లో తయారైన విగ్రహానికి వంశప్రతిష్ఠలుగల ప్రఖ్యాత మహా చిత్రకారుల విగ్రహాల సరసన ప్రదర్శించడానికి అర్హత లేదు!" అని నొక్కి వక్కాణించారు ప్రదర్శన నిర్వాహకులు. విచిత్రుడు చాలా విచారపడ్డాడు.

కుమ్మరి మిత్రుడు, "ప్రదర్శన పందిట్లో పెట్టకపోతే పోయారు. మనం విగ్రహాన్ని వేరేచోట పెడదాం పద!" అని విచిత్రుడికి నచ్చజెప్పి, ప్రదర్శనశాలకు దగ్గర్లో ఉన్న ఒక అరటిచెట్టు మొదట విగ్రహాన్ని పెట్టి, విచిత్రుణ్ణి తనతో బాటు అక్కడ కూర్చుండబెట్టుకున్నాడు.

ప్రదర్శనశాలలో పెద్దవాళ్ళు విగ్రహాలను చూస్తూ, గుంపులు గుంపులుగా చేరి, విగ్రహాలకు ఉపయోగింపబడిన రంగుల విలువల గురించీ, చిత్రకారుల పదవీ కులగోత్రాల గొప్పలూ చెప్పుకుంటూ

ఉంటే, పిల్లలంతా విచిత్రుడి వినాయక విగ్రహం దగ్గిరికి చేరి హర్షధ్వానాలు చేస్తూ అసక్తితో చూస్తున్నారు.

ఆ సమయంలో ఆకాశంనుండి జారి పడ్డ జంటమెరుపుల్లాగ ఉన్న ఇద్దరు తరుణులు, ప్రదర్శనశాలకు వచ్చారు. వారు నిండుగా ధరించిన రత్నాభరణాల కాంతి మిరుమిట్లు గొల్పుతున్నది.

జనం వారిని చూసి విస్తుబోతూంటే, పెద్దామె, "కళానంద నగరం మాది. మాకు నచ్చిన వినాయక విగ్రహం కోసం పదివేల వరహాలు పట్టుకు తిరుగుతున్నాం!" అంటూ చేతనున్న బంగారు జలతారు అల్లిక సంచిని గలగల్లాడించింది. అక్కడ ఉన్న చిత్రకారులు చరచరా వారి వారి విగ్రహాల దగ్గిరికి వెళ్ళి నిల్చున్నారు.

"మా అక్క ప్రసన్నవదన గొప్ప గాయనీమణి. అంతేకాదు, గొప్ప తిండి పోతు. నైవేద్యపుష్టి, విగ్రహపుష్టి తర్వాతనే గాత్రపుష్టి. బొజ్జ పెంచి పాడి చూడు, అనే గాయక సిద్ధాంతాలకు తార్కాణం మా అక్క ప్రసన్నవదన!" అంటూ సుకుమారంగా సమ్మోహనాస్త్రం లాగున్న చిన్నామె కాలిమువ్వలు ఘల్లుమనిపించింది.

"మా చెల్లి మోహన గొప్ప వాగుడు కాయ, అంతకంటె గొప్ప నర్తకీమణి! చూడ్డానికి చిన్నారి చిట్టిలాగుందే కాని, నన్నే ఎత్తి తిప్పేస్తుంది! అంత శక్తి సామర్థ్యాలున్నాయి దానికి. నృత్యంలో దాని చురుకుదనం చూడ శక్యంకాదు!" అని ప్రసన్నవదన చెప్పింది.

"మా చేత పాడించడం, ఆడించడం, ఆ ఇంద్రుడికీ, కుబేరుడికీ సాధ్యం కాదు. అలాంటి ఆటపాటల్ని, మాకు కావలసిన విగ్రహం ముందు జరుపుతామని మొక్కుకున్నాం!" అని మోహన చెప్పింది.

వారి మాటలకు పరవశించిపోతూన్న జనం మంత్రించినట్లుగా పక్కకు తప్పుకుని విశాలంగా దారి చేశారు.

—(వచ్చే సంచికలో ముగింపు)





# విఘ్నేశ్వరుడు

అక్కచెల్లెళ్ళు ప్రసన్నవదనా, మోహనా వరసగా విగ్రహాల్ని చూసుకుంటూ వెళ్ళి, నిరుత్సాహంగా మరలబోతూ, అవతల పిల్లల కోలాహలానికి ఆశ్చర్యంగా చూశారు.

"అక్కడ ఒక తక్కువ రకం రంగుల విగ్రహం ఉందిలెండి!" అంటూ ఎవరో అనడం వాళ్ళకు వినిపించింది.

అది విని మోహన, "పదవే, అక్కా! అదేదో తక్కువలోనే దొరుకుతుందిలా ఉంది!" అంటూ ప్రసన్నవదన చేయి పుచ్చుకొని అటు దారి తీసింది. అంతా ఆడా, మగా జనం ప్రదర్శనశాలలో ఒక్కరు మిగలకుండా వారిని వెంబడించారు.

ప్రసన్నవదన వెళ్ళి, వరహాల సంచిని విగ్రహం ముందు పెట్టి, తన మెడలోని పచ్చల రత్నాలహారాన్ని తీసి విచిత్రుడి చేతికి కంకణంలాగ చుట్టింది.

అది చూసి జనం, "వీళ్ళకేదో పిచ్చి ఉంది! అలాంటి గొప్ప విగ్రహాల్ని కాదని ఇక్కడ డబ్బు ధారపోస్తున్నారు!" అన్నారు.

ప్రసన్నవదన వాళ్ళతో, "ఇక్కడున్న విగ్రహంలో ఏ విశేషాన్ని చూసి పిల్లలంతా మురిసి ముచ్చట పడుతున్నారో, ఆ విశేషమే మమ్మల్ని ముగ్ధుల్ని చేసింది. బాల దీవనలు బ్రహ్మదీవనలు, పిల్లలు దైవసమానులనీ అంటారు. అందుకే వారి ఎన్నికను శిరసావహించాము." అన్నది.

24. మహాభారత రచన



"మట్టి శిల్పంలో లేని రూపసౌందర్యాన్ని, సొంపుల్ని సామాన్యమైన జేగురు, సున్నము, బొగ్గు మొదలైన రంగులతోనే ఎంతో మూర్తివంతంగా తీర్చిదిద్దిన చిత్రకారుని ప్రతిభ అమోఘంగా వుంది. మా బహూకరణం అతిస్వల్పం!" అని మోహన అన్నది.

ఆ సమయంలో, విచిత్రుడి వృద్ధజననీ జనకులు అక్కడికి వచ్చారు.

"నాయనా, పావనా! వాతాపి గణేశుడి కృపవల్ల మా అన్వేషణ ఫలించింది, ఇంత వాడివై కనిపించావు!" అంటూ కుమారుణ్ణి కౌగిలించుకొని ఆనంద బాష్పాలు రాల్చారు. అప్పుడు విచిత్రుడు బాల్యం దాటుతున్న నవయుకుడు. తలిదండ్రులనుచూసి మహదానందం పడ్డాడు. గతం అంతా గుర్తుకొచ్చింది. తన పేరేమిటో తెలిసింది.

వారి సమాగమాన్ని చూసి ప్రసన్నవదన తృప్తిపడుతూ, "ఇప్పుడిప్పుడే మా కోరిక నెరవేరింది, మా మొక్కు చెల్లించుకొంటాము," అని చెప్పింది.

క్షణాలమీద జనం అక్కడ పెద్ద పందిరి వేశారు. విశాలమైన వేదిక అమర్చారు.

ప్రసన్నవదనవినాయకవిగ్రహాన్ని అంటిపెట్టుకు కూర్చుని తాళాలు వాయిస్తూ, "తాండవ నృత్యకరీ గజానన...." అని కీర్తన మొదలుపెట్టింది. వేదికపై మోహన విద్యుల్లతలాగ నృత్యం చేస్తూంటే, జనం పరవశించిపోతూ ఆనంద తరంగాల్లో ఊగిపోతున్నారు.

ప్రసన్నవదన గానం గజానన పండితుడికి వినిపించింది!

అప్పుడు గజాననుడు శతాధిక వృద్ధుడై ఇల్లు కదలలేని స్థితిలో ఉన్నాడు. అతనికి ఎక్కడలేని జవసత్వాలు వచ్చాయి. పరుగులాంటి నడకతో పందిట్లోకి చేరుతూనే ప్రసన్నవదనను చూసి చేతులెత్తి జోడించి సాగిలపడి అలాగే ధ్యాన ముద్రలో ఉండిపోయాడు.



నృత్యం చేస్తూ, చేస్తూ మోహన పెద్దదైన వినాయక విగ్రహాన్ని అవలీలగా భుజాని కెత్తుకొంది. అది చూసి తెప్పరిల్లిన జనం "అంత బరువు మోయలేవమ్మా!" అని అంటూంటే మోహన, "నాకు అల వాటేగా!" అని చెపూ విగ్రహాన్ని, భుజాన మోస్తూ, నాట్యం చేస్తూన్న నడకతో బయలుదేరింది. జనం అంతా ఆమె వెనకనే వెళ్ళారు. ఆ సందట్లో ఎప్పుడో అదృశ్యమైన ప్రసన్నవదన సంగతే ఎవరికి పట్టలేదు.

ధ్యానముద్ర నుండి గజాననుడు కళ్ళు తెరిచాడు. ఎదురుగా విగ్రహమున్నచోట మెరుస్తున్న వరహాలతో నిండుగా ఉన్న బంగారు జలతారు సంచి కనిపించింది. పాదాల చెంత విచిత్రుడు మోకరిల్లి కూర్చుని ఉన్నాడు.

గజాననుడు విచిత్రుడితో, "ఆలయ మంటప కుడ్యాలను గణేశలీలల చిత్ర శోభితం చెయ్యి! అందుకు కావలసిన ధనాన్ని ప్రసన్నవదనుడైన విఘ్నేశ్వరుడే అందించాడుగదా!" అంటూ లేచాడు.

గజానన విచిత్రులిద్దరూ ఊరేగింపుగా వెళ్తున్న జనంతో కలిశారు.

మోహన విగ్రహంతో ఆలయ పుష్కరిణికి చేరుకొని, తటాక సోపానాలు దిగుతూ మాయమై, ఆమెకు మారుగా చిట్టెలుక విగ్రహాన్ని వీపున మోస్తూ నీటిలోకి పరుగు తీసింది. ఆ రోజే విగ్రహాల్ని జలనిమజ్జనం చేసే ఉత్సవదినం.

విగ్రహం తటాక మధ్యానికి చేరుకొని, కోటి పూర్ణిమల కాంతిపుంజంగా భాసించింది. ఆ కాంతిలో అభయ హస్తంతో ఆశీర్వదిస్తూ విఘ్నేశ్వరుడు లీలగా కనిపించి, కనిపించి అంతర్థానమయ్యాడు.

గజాననుడు విచిత్రుణ్ణి గాఢాలింగనం చేసుకొని, "నాయనా, పావనా! నీ మూలంగా వాతాపినగరానికి పావనత మిశ్రమమైంది. నీవు పావనమిశ్రుడివి!" అని చెప్పాడు. అంటూ పావనమిశ్రుడు ఆగకుండా, "గర్భాలయ ముఖద్వారం



మెరుస్తున్న వెండి జుట్టుతో, ముడుతలుపడ్డ విశాల ఫాలంతో వార్ధక్యం పైబడ్డా మనసుకి ముసలితనం రానివ్వని పావనమిశ్రుడు యువకుడి తలపై చేత్తో ఆశీర్వదిస్తూ, మందహాసం చేసి మళ్ళీ చెప్పసాగాడు:

వ్యాసుడు తాను చెప్పబోయే మహాభారతాన్ని వ్రాయగల సమర్థుడు ఎవరా అని ఆలోచిస్తూండగా, బ్రహ్మ సాక్షాత్కరించి, విఘ్నేశ్వరుణ్ణి లేఖకుడుగా పెట్టుకోమన్నాడు.

బ్రహ్మ ఆదేశానుసారం వ్యాసుడు విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

విఘ్నేశ్వరుడు ప్రసన్నుడై, "వ్యాసా! నీ ధోరణిలో నీవు చెప్పుకుపోతూండాలి, నా వంక చూడకూడదు సుమీ!" అని చెప్పి వ్రాతకు కూర్చున్నాడు.

విఘ్నేశ్వరుడు తన దంతం ముక్కనే గంటంగా పట్టి, మోపినది ఎత్తకుండా వ్రాస్తున్నాడు. వ్యాసుడు అరమోడ్పు కన్నులతో ధ్యానమగ్నుడై చెపుతున్నాడు.

ఎదురుగా హిమాలయ శిఖరాగ్రం నుండి పడుతున్న జలపాతం మధ్యమావతి రాగంలాగ మంద్ర గంభీరంగా నేపథ్య సంగీతంలాగ శృతి పోస్తున్నది. దేవదారు వనాలు తలలూపుతూన్నవి. జలజల పారే నదాలు అనంతరాగమాలికలు ఆలా

మీది చిత్రరువు మహాభారత రచన...." అంటూ చెప్పుకుపోతూంటే, యువ చిత్రకారుడు, "గురుదేవా!" అంటూ పావనమిశ్రుడి పాదాలను చేతులతో చుట్టి, "మీ పావనచరిత్రను విన్న నేను ధన్యుణ్ణి! నా పేరు ఆనందుడు. మీ పావన నామాక్షరి మొదటి రెండు అక్షరాల్ని మార్చి, నా పేరు ముందు చేర్చి, 'వపానందుడు' అనిపించుకుంటాను. ఈ మంటపం పావన చిత్రాలయం! ఈ చిత్రాలకు ప్రతికృతులు రచిస్తాను. ముందు తరం వారికి మీరు చెప్పిన కథలన్నీ చెప్తాను. అనుగ్రహించండి!" అంటూ శిరస్సు వంచాడు.



పిస్తున్నవి. మహాభారత రచన ధారావాహికంగా, నిర్విరామంగా సాగుతూన్నది.

పుట్టుగ్రుడ్డి ధృతరాష్ట్రుడు హస్తినాపుర సింహాసనాన్ని అలంకరించాడు. తమ్ముడు పాండురాజు సామ్రాజ్య భారాన్ని మోస్తూ విస్తరింపజేశాడు. పాండురాజుకు పంచ పాండవులు, ధృతరాష్ట్రుడికి నూరుగురు కౌరవులూ పుట్టారు.

చిన్ననాటినుంచే కౌరవ పాండవుల మధ్య స్పర్థ, అసూయలు వర్ధిల్లాయి.

వ్యాసుడు చెప్తున్నాడు విఘ్నేశ్వరుడు వ్రాస్తున్నాడు. సభాపర్వం సాగుతున్నది.

మయసభలో పరాభవం పొందిన దుర్యోధనుడు ప్రతీకారంగా పాండవుల్నీ వారి భార్య ద్రౌపదినీ జూదంలో గెల్చుకొని ద్రౌపదీ వస్త్రాపహరణ తలపెట్టాడు. భీముడు దుర్యోధనుడి తొడలు విరగ్గొడతాననీ, దుశ్శాసనుడి రక్తం తాగుతాననీ సింహగర్జన చేశాడు.

పాండవులు వనవాసం చేశారు. విరాటరాజు కొలువులో అజ్ఞాతవాసం చేస్తున్నారు. సైరంధ్రిగా ఉన్న ద్రౌపదిని కీచకుడు అవమానించి భీముడి చేతిలో ముద్దయ్యాడు. ఉత్తరగోగ్రహణంలో బృహన్నల విజయుడయాడు. మహాభారతంలో సుందరకాండగా విరాటపర్వం సాగింది.

జలపాతం కళ్యాణిరాగం ధ్వనిస్తున్నది.

అభిమన్యుడికి ఉత్తరకు వివాహం జరిగింది. కృష్ణుడు రాయబారం వెళ్ళి పాండవులకు ఐదు ఊళ్ళు యిస్తే చాలన్నాడు. దుర్యోధనుడు సూది మొనపాటి నేల కూడా యివ్వనన్నాడు.

యుద్ధం అనివార్యమైంది. హిమాలయ ఝరి కదనకుతూహలరాగం ఆలపిస్తూ శిఖరాలు విరిగి పడుతున్నవా అన్నట్లుగా వడి హెచ్చి పడుతూన్నది. హిమానీ నదాలు గుర్రాల్లా దౌడుతీస్తున్నాయి.

కృష్ణుడు అర్జునిడి రథసారథి అయ్యాడు. అర్జునుడికి భగవద్గీతను ఉపదేశిస్తున్నాడు. జలపాతం సామ సౌరాష్ట్ర దేవగాంధార రాగాలను వినిపిస్తున్నది.

భీష్ముడు అంపశయ్య చేరాడు. ద్రోణుడు పద్మవ్యూహం పన్నాడు. అభిమన్యుణ్ణి పదిమందీ కలిస్తేనే గాని చంపలేకపోయారు. సుభద్ర పుత్రశోకం లాగ జలపాత ధ్వని ముఖారిరాగంగా వినిపిస్తున్నది.

అర్జునుడు విజృంభించాడు ద్రోణుడి తల ద్రుష్టద్యుమ్నుడు నరికాడు. అనేక అనర్థాలు సంతరించుకొన్న కర్ణుడిని నమ్ముకొని దుర్యోధనుడు కర్ణుడి చావుతో పూర్తిగా చిత్తయ్యాడు. భీముడు దుశ్శాసనుణ్ణి చంపాడు, దుర్యోధనుడి తొడలు విరగ్గొట్టాడు.

జూదంలో ఓడిపోయిన ధర్మరాజు తమ్ములతో యుద్ధంలో విజయదుందుభి మ్రోగించాడు.

కృష్ణుడు అవతారం చాలించాడు.

పరీక్షిత్తుకి పట్టంకట్టి పాండవులు ద్రౌపదితో మహాప్రస్థానం బయలుదేరారు.

ధర్మానికి చావులేదు, చివరకు నిలబడేది ధర్మమొక్కటే అన్నట్లుగా ధర్మరాజు మేరుశిఖరాగ్రం మీద నిలబడ్డాడు.

జలపాత ధ్వని క్షీణిస్తూన్నది. అంతటా గంభీర నిశ్శబ్దం ఆవరించుకున్నది. వ్యాసుడు చెప్పింది విఘ్నేశ్వరుడు వ్రాస్తున్నాడా? లేక విఘ్నేశ్వరుడు వ్రాసింది వ్యాసుడు చెపుతున్నాడా?




అన్నట్లు చకచకా భారత రచన సాగింది. సత్యలోకంలో పద్మాసనంపై బ్రహ్మ సంతృప్తిగా చిరునవ్వు చిందిస్తూ, సాభిప్రాయంగా సరస్వతి వంక చూశాడు. వెంటనే సరస్వతీదేవి వీణ మీటుతూ శ్రీరాగాన్ని పలికించింది.

మహాభారతం చెప్పడం పూర్తి కావస్తున్నది. చివరి పర్వంలో ఉన్నది.

సరస్వతీదేవి సత్యలోకంనుండి మంగళాచరణంగా శ్రీరాగం ఆలాపిస్తున్న వీణానాదం, తాను చెప్పుతున్న కథనానికి అంతరాయంగా వ్యాసుడి చెవిని సోకింది.

ఇంకా చెప్పవలసినది చాలా ఉంది. వ్యాసుడు అదమరుపుగా లేఖకుడి దెస

తేరి చూశాడు. మరుక్షణంలో విఘ్నేశ్వరుడు అంతర్ధానమయ్యాడు.

మహాభారతం గ్రంథం మీద ఆకాశం నుండి అక్షతల్లాగ పువ్వులు జలజలా రాలాయి.

వ్యాసుడు ఆత్రంగా గ్రంథాన్ని విప్పి పరిశీలనగా చూశాడు. తాను ఇంకా చెప్ప దలచినదంతా ఒక్క అక్షరం తేడా లేకుండా సంపూర్ణంగా వ్రాయబడి ఉంది! వ్యాసుడు ఆనందాశ్చర్యాలతో పులకించి పోతూండగా, మహతివీణపై హంసధ్వనిరాగం వినిపించింది.

నారదుడు వస్తూనే, "ఏమిటి మహాభారత మహర్షీ! ఆశ్చర్యపడిపోతూ చూసుకుంటున్నావు?" అన్నాడు.

వ్యాసుడు జరిగినది చెప్పాడు.

"అంటే, నీవు చెప్పేది చెప్పకుండానే, ముందుగానే నీ లేఖకుడు వ్రాసుకుంటూ వచ్చాడన్నమాట!" అన్నాడు నారదుడు.

"ఔను, నారదా! అదే జరిగింది. అటువంటి లేఖకుడు ఎలాటి తపస్సులు చేసినా ఎవరికీ లభించడుకదా! నేను ధన్యుణ్ణి! నా సంకల్పం జయప్రదమైంది! మహాభారతాన్ని 'జయం' అని కూడా పేర్కొంటున్నాను!" అని చెప్తూ వ్యాసుడు చేతులు జోడించి విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించాడు.

మహాభారతం దగ్గిర పెద్ద జ్యోతి పెరుగుతూ కనిపించింది.

ఆ జ్యోతి విఘ్నేశ్వరుని ఆకారంగా రూపొందింది.

విఘ్నేశ్వరుడు సాక్షాత్కరించి, "వ్యాస మహర్షీ! నీ మహాభారతం అద్వితీయ మహాకావ్యమై పంచమవేదంగా పరిగణింపబడుతూ కీర్తింపబడుతుంది!" అని, వ్యాసుణ్ణి ఆశీర్వదిస్తూ అంతర్హితుడయ్యాడు.

విఘ్నేశ్వరుని చేత అతని దంతపు గంటంతో లిఖింపబడి అక్షరసిద్ధి పొందిన మహాభారతం, అన్ని కాలాల్లో సారస్వతాకాశంలో చుక్కల్లో చందమామగా నిలిచింది. —(సమాప్తం)

